# అపరాధ పరిశోధన

రు. 3 జులై '76

సప్లిమెంట్



అపరాధ పరిశోధన అనుబంధం—31

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## నకిలీ బాస్
రచన : వసుంధర

4

## చావు కబురు
రచన : విజయ్

## టైం బాంబ్
రచన : ఏ. వీ. మోహన్రావ్

## మరో ప్రపంచ ప్రమాదం!!
రచన : డా॥ పెందుర్తి మాస్టర్జీ

"ఖైదీ" సీరియల్ - 26 వ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—31
జూలై, 1976
వెల : 3-00 రూపాయలు
ఏడాది చందా 30 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

Vegavaram
(Via) Jangareddi-
gudem
534447

[illegible]

# నకిలీ బాస్

వసుంధర

"ఎక్కడికెళ్తారు బాబూ!" అనడిగాడు రిక్షావాడు.

"సుందర్రావుపేట" అన్నాను.

"ఎక్కండి బాబూ" అంటూ సీటు సర్దాడు రిక్షావాడు.

"ఎంత?" అడిగాను అడుగుకూడా ముందుకు వేయకుండా.

"మీకు తెలియన్దేముందండీ. మీకు తోచినంతివ్వండి."

"అలా కుదరదు. కచ్చితంగా ఇంతని తేల్చిచెప్పు."

"ఎక్కి కూచోండి బాబూ. మీ దగ్గర బేరాలేంటి?"

నేను చిరాగ్గా రిక్షావాడికేసి చూసి, "అర్ధరూపాయిస్తాను, వస్తావా?" అవడిగాను. వాడు తెల్లబోయాడు.

"సుందర్రావుపేటకి అర్ధరూపాయా ఇదేం న్యాయమండీ" అన్నాడు.

"అందుకే, ఎంతిస్తే న్యాయమో నువ్వే చెప్పు" అన్నాను.

"అయిదు రూపాయలండి. అంతా ఇచ్చే మామూలు రేటే అది!"

ఈసారి తెల్లబోవడం నా వంతయింది. "అయిదు రూపాయలా?" అన్నాను నోరు తెరచి.

"అందుకే,తమకెంత న్యాయమని తోస్తుందో చెప్పండి" అన్నాడు రిక్షావాడు.

అతగాడు నాతో వేళాకోళమాడాడని అర్థమయింది. నా ఒళ్ళు కతకతలాడింది. నేను అర్ధరూపాయన్నప్పుడు బహుశా అతగాడి ఒళ్ళుకూడా అలాగే కతకతలాడి ఉంటుంది. అందుకే అయిదు రూపాయలని దెబ్బకు దెబ్బ తీశాడు. కానీ వాడి అంతస్తెక్కడ, నా అంతస్తెక్కడ? నే నిచ్చేవాణ్ణి, తను పుచ్చుకునేవాడు. కాస్త అణకువగా ఉండొద్దూ. నాలోని అహం లేచింది. "అర్ధరూపాయికి పైసా ఎక్కువివ్వను" అన్నాను.

"అయిదు రూపాయలకు పైసా తగ్గదు. ఎవడు కడతాడో నేను చూస్తాను" అన్నాడు రిక్షావాడు.

నేను టైము చూసుకున్నాను. అక్కడికి చేరుకోడానికింకా రెండున్నర గంటల వ్యవధి ఉంది. ఇప్పుడు నా కొచ్చిన తొందరేమీ లేదు. ఈలోగా ఎవడో ఒకడు బేరం కట్టకపోడు. ఇలా ఆలోచించి ఎదురుగా వున్న హోటల్లోకి దూరాను.

చెప్పుకోదగ్గ ఆకలి లేదు. అందుకే సింపుల్ గా కాఫీ ఆర్డరిచ్చాను.

ఈరోజు నా జీవితంలో మరపురాని రోజుగా మారబోతోంది. అందుకు రెండున్నర గంటల వ్యవధిమాత్రమున్నది. ఆ తర్వాత నా జీవితం, జీవితవిధానం పూర్తిగా మారిపోతుంది. ఇప్పుడు ఈ క్షణంలో ఉన్న హోటల్లో మళ్ళీ నేను కాలు పెట్టను. కొద్దిక్షణాల క్రితంలా రిక్షా వాళ్ళతో బేరాలాడుతూ సమయం వృథా చేయను.

అప్పుడు నాకు ప్రతిక్షణం అమూల్యమవుతుంది. ఎక్కడికి వెళ్ళాలన్నా కారు సిద్ధంగా వుంటుంది. కారు తలుపులు డ్రైవర్ స్వయంగా తెరుస్తాడు. నా పక్కన కారులో వెనుకసీటులో చిత్ర వుంటుంది.

అందమైన చిత్ర పక్కన ఉండగా కాలం కారుకన్న వేగంగా పరుగెడుతుంది. జీవితం మధురాతిమధురంగా ఉంటుంది.

అసలు చిత్రతో నా పరిచయమే విచిత్రమైనది!

పాకహోటల్లో సింగిల్ టీకి ఆర్డరిచ్చి జేబులోకి చేయి పోనిచ్చి స్పర్శాజ్ఞానంతో పైసలు లెక్కపెడుతున్నానొకరోజు, మరో తినుబండారమేదైనా ఆర్డరివ్వగలనేమో నన్న ఆశతో. నా వేషం డాబుగా వుండడంవల్ల హోటల్ యజమాని-కమ్-సర్వర్ చాలా మర్యాద చేస్తున్నాడు. నామీద అతని గౌరవం సింగిల్ టీ ఆర్డరివ్వగానే తగ్గిపోయిందనిపించింది. అటువంటి చోట్ల నా గౌరవం తగ్గడం నేను సహించలేను.

నా బుర్ర చురుగ్గా పనిచేయగా, హోటల్ యజమాని వద్దకు వెళ్ళి, చెవిలో చెప్పినట్లుగా అన్నాను. "నాకో చిన్న సహాయం చేసిపెట్టాలి, అలా చూడు" అన్నాను.

అతనటుకేసి చూసి, "ఎవరో అమ్మాయి పాన్‌షాపు ముందు నిలబడి ఉంది" అన్నాడు.

నిజానికి నేనా అమ్మాయిని చూడలేదు. అతను చూపించగానే 'ఇదీ ఒకందుకు మంచిదే' అనుకుని, "ఆ అమ్మాయిని కనిపెట్టి చూస్తూండాలి. ఆమె అక్కడుండగా ఏమేం చేస్తుందో గమనించాలి. నేనిక యిక్కడుండడం ప్రమాదకరం. మళ్ళీ కొన్నిగంటల తర్వాత వస్తాను. నీవు చేసే ఈ సహాయానికి నేను స్వయంగా ఇచ్చే ప్రతిఫలం కాక ప్రభుత్వంనుంచికూడా గుర్తింపు లభిస్తుంది" అన్నాను.

ఆ హోటల్ యజమాని ముఖంలో ఆశ్చర్యం, సంతోషం, గర్వం మూడూ కనబడ్డాయి. అతని కళ్ళలో నా పట్ల ఆరాధనాభావంలాంటిదికూడా కనబడింది. నాకిప్పుడు సంతృప్తిగా ఉంది. అతను నిరాకరించినా సింగిల్ టీకి బలవంతంగా డబ్బులిచ్చేశాను. బయటకు వచ్చి మిగిలిన డబ్బులతో ఒక కిళ్ళీషాపులో పిప్పరమెంట్లు కొనుక్కున్నాను. సరిగ్గా నాలుగు వచ్చాయి. ఇంక జేబులు ఖాళీ అయిపోయాయి.

బజారులో తిరగసాగాను. ఎన్నో వస్తువులు కనిపిస్తున్నాయి. చాలా కొనాలని ఉంది. నా జేబులో డబ్బు లేకపోవడం షాపులవాళ్ళ దురదృష్టం! జేబులో డబ్బుండీ ఎంతమందో ఏమీ కొనకుండా వెళ్ళిపోతున్నారు.

హఠాత్తుగా నా కళ్ళకు నేలమీద పదిపైసల బిళ్ళ కనబడింది. చటుక్కున తీసి జేబులో వేసుకున్నాను. మళ్ళీ కాళ్ళలో కాస్త బలం వచ్చింది. ఇంకో సింగిల్ టీ తాగవచ్చును. కానీ ఆ పని చేయలేదు. అయాచితంగా వచ్చిన డబ్బు ఎలాగూ లోకువే. అందుకే ఆ పదిపైసలూ ఒక చోట లాటరీ ఆడాను. ఆ రోజు నా అదృష్టం బాగుంది.

పదిపైసలూ పదిరూపాయలు అయింది.

సింగిల్ టీ యేం కర్మ! ఏకంగా భోజనమే చేయవచ్చు.

'ఏం మనిషిని నేను? ఇంతకాలం ఉద్యోగానికి అప్లికేషన్స్ పెట్టడంలోనే సమయం వృధాచేశాను. ధన సంపాదన ఉద్యోగం కాకుండా లక్ష మార్గాలున్నాయి' అనిపించింది.

హఠాత్తుగా నాకు సింగిల్ టీ హోటలతను గుర్తుకొచ్చాడు. అతనితో నేను మళ్ళీ వస్తానని చెప్పాను. నన్నొక గొప్పవాడుగా అతను గుర్తు పెట్టుకోవాలంటే అతన్ని మళ్ళీ కలుసుకోవాలి. చిన్న బహుమానం ఇవ్వాలి. కుతూహలం లేకపోయినా జరిగినదేమిటో తెలుసుకోవాలి.

నన్ను చూస్తూనే సింగిల్ టీ హోటలతను నమస్కారం చేశాడు. జేబులోంచి ఒక రెండ్రూపాయల నోటు తీసి అతనికిచ్చి, "దగ్గరుంచుకో, జరిగిందేమిటో చెప్పు" అన్నాను కుతూహలాన్ని నటిస్తూ.

హోటలతని ముఖం అంత బాగా లేదు. "ఆమెతో కనీసం ఇద్దరు మగాళ్ళు మాట్లాడారండి. వాళ్ళు వెళ్ళిపోయాక, ఒక కారు వచ్చి ఆమె ముందుగా ఆగిందండి. నేను చూసి నంబర్ కూడా నోటు చేసుకున్నానండి. ఒక అయిదునిముషాలు ఆమె ఆ కార్లోని మనిషితో మాట్లాడిందండి. తర్వాత సూటిగా నా దగ్గరకు వచ్చిందండి. "ఎవరైనా నన్ను గమనించమని చెప్పారా?" అనడిగిందండి నన్ను. లేదని చెప్పాను. ఆమె తన వేనిటీ బ్యాగులోంచి పదిరూపాయల నోట్లు తీసి పట్టుకున్నదండి. "నిజం చెబితే నీకు చాలా డబ్బిస్తానన్న"దండి. నేను చెప్పేశాను. నేను కారు నంబరు నోట్ చేసుకున్న కాగితాన్ని కూడా అడిగి

తీసేసుకుందండి. మీరు రాగానే తనకు చెబితే డబ్బిస్తా నంది. బహుశా ఈ ప్రాంతాలలోనే ఉండివుంటుంది.''

నా కాశ్చర్యం కలిగింది. ఈరోజు నా అదృష్టం బాగున్నట్లుంది. ఏదో పరువు నిలబెట్టుకోడంకోసం నేనామెను చూపించాను. ఆమెలో ఏ విశేషమూ ఉంటుందనికూడా నేను భావించలేదు. వాటం చూస్తే ఆమె ఏదో ముతా మనిషిలాగుంది. వాళ్ళ దృష్టిలో నేను పడ్డట్లున్నాను. మంచిదే. వాళ్ళు నాతో పరిచయానికి ప్రయత్నించవచ్చు. ఇన్కు లేనంతవరకూ నాలుగుడబ్బులు వెనకేసుకోవచ్చు. ఇదే ఉద్దేశ్యంలో ''నేను ఎదురుగావున్న పాన్ షాప్ దగ్గర నిలబడతాను. ఆమె వచ్చి అడిగితే నన్ను చూపించు. ఆమె ఇచ్చే ప్రతిఫలం తీసుకో. ప్రస్తుతానికి నేను చేయగల ప్రత్యుపకారం ఇదే'' అన్నాను.

అతను నా వంక ఆరాధనాభావంతో చూస్తూ ''సార్, ఆమె కాగితం తీసుకున్నా నా కా కారు నంబరు గుర్తుందండి. యం. ఎస్. వై. 112'' అన్నాడు.

నేనతని భుజం తట్టి ''ప్రభుత్వం నీ సహాయాన్ని తప్పక గుర్తిస్తుంది'' అన్నాను హుందాగా.

అక్కణ్ణించి బయటపడి పాన్ షాపు చేరుకున్నాను. అటూ ఇటూ చూస్తూ అప్పుడప్పుడు టీ దుకాణంకేసి కూడా చూస్తున్నాను. సరిగ్గా అయిదు నిముషాల్లో ఆ అమ్మాయి ఆ దుకాణంలో అడుగుపెట్టింది. ఓరకంట నేను అన్నీ గమనిస్తున్నాను. అతనామెకు నన్ను చూపిస్తున్నాడు. ఆమె అతనికి డబ్బిస్తోంది. బహుశా కొన్ని పదులై వుంటాయి.

ఇలాంటి మనిషి దృష్టిలో పడితే చాలు. ఆ మాత్రం

సంపాదన చాలు. నాకు చాలా ఎక్కువ అవుతుంది. నా ఆచూకీ ఇచ్చినందుకే ఆ టీ దుకాణం అతనికి కొన్ని పదులు ముట్టాయి. అలాంటి పనులు చాలా చేసిపెట్టగలను నేను అలా డబ్బిస్తే!

ఆమె నెమ్మదిగా నడుచుకుంటూ నా దగ్గరకు వచ్చింది. బాగా సమీపానికి వచ్చేక, యెగాదిగా చూసింది. "హలో!" అన్నాను.

"హలో!" అంటూ ఆమెకూడా విష్ చేసింది.

మరికాస్త దగ్గరగావచ్చి "మీ పేరు!" అంది.

"మనిషిని చూపించినందుకే టీ దుకాణ మతనికి కొన్ని పదులిచ్చారు. పేరు తెలుసుకోవాలంటే ఖర్చవుతుంది మరి" అన్నాను.

ఆమె నా వంక చూసి తియ్యగా నవ్వి, "చూడండి, నేను చాలా అందంగా కనిపిస్తాను, తియ్యగా నవ్వుతాను, మాట్లాడతాను. కానీ, నేను పాముకంటె ప్రమాదకరమైన మనిషిని. నాతో ఆటలు పనికిరావు."

"పాములవాడు నాగుపాముతో ఆడుకోడు. దానిచేత ఆడిస్తాడు" అన్నాను ఎటో చూస్తూ. ఆమె యెవరై వుంటుందో, మా పరిచయం యెలా దారి తీస్తుందో అని ఆలోచిస్తున్నాను.

ఆమె ముఖంలో కోపం, ఉక్రోషం రెండూ కనిపించాయి. నా మాటకు జవాబుకోసం ఆలోచిస్తోందను కుంటాను. నేనే మళ్ళీ అన్నాను. "ఇందులో కోపగించుకో వలసిన దేమీలేదు. మీ సంగతి మీరు చెప్పారు. నా సంగతి నేను చెప్పాను. అంతే!"

ఈసారి ఆమె నవ్వింది. "ఒకరి సంగతి ఒకరికి పూర్తిగా

తెలియాలంటే మరికొంత పరిచయం అవసరమనుకుంటాను'' అంది.

"నిజమే. దానికే ఖర్చవుతుందంటున్నాను''అన్నాను.

ఆమె ఇబ్బందిగా నవ్వి "ఎంతేమిటి?'' అంది.

"మీకు తోచిందివ్వండి. ప్రస్తుతం బొత్తిగా సంపాదన లేకుండా వున్నాను'' అన్నాను.

"పదండి, మంచి హోటల్‌కి పోదాం'' అని జవాబు కోసం ఆగకుండా ముందడుగు వేసిందామె. నే నామె ననుసరించాను. ఇద్దరం ఒక మంచి హోటల్లో ప్రవేశించాం.

నేనా పూట నే నెంతో కాలంగా కోరుకుంటున్న తినుబండారాలన్నీ ఆర్డర్ చేశాను. చాలా ఆబగా తిన్నానని చెప్పాలి. ఆమె నా అంత ఎక్కువగా తినలేదు. లైట్‌గా ఆర్డరిచ్చి తిన్నది. సర్వర్ బిల్ ఒక ప్లేట్లో తెచ్చి టేబిల్ మీద పెట్టాడు. నేను దాన్ని ఓరకంట గమనించాను. తొమ్మిదిరూపాయల ముప్పై పైసలయింది.

ఆమె ఓ పదిరూపాయల నోటు తీసి ప్లేట్లో పెట్టింది. చిల్లరకోసం యెదురుచూడకుండా బయటకు నడిచింది. నేనూ వెనుక నే బయటకు నడిచాను.

"ఇంతకీ మీ పేరు చెప్పారు కాదు'' అంది చిలిపిగా నవ్వుతూ.

"ఏమని చెప్పాలి, ఎందుకు చెప్పాలి? మీరు నాకేమీ ఇవ్వలేదు.''

"అయితే మీరు ఇంకా చొక్కా జేబులో చూసుకోలేదన్నమాట.''

అప్రయత్నంగా నా చేయి చొక్కా జేబులోకి

పోయింది. అందులో కొన్ని నోట్లున్నాయి. బయటకు లాగాను. కొన్ని వదులు!

"మీకు తెలియకుండా మీ జేబులోకి నోట్లు వస్తున్నాయి. ఇలా వ్యవహరిస్తే, నాగుపాము మిమ్మల్ని సులభంగా కాటు వేయగలదు" అన్నదామె.

"మేడమ్_మీ పేరు?" అన్నాను అప్రయత్నంగా.

"నాగుపాము కాదు. చిత్ర. మీ పేరు చెప్పనవసరం లేదు లెండి. నేను తెలుసుకోగలను" అనేసి ఆమె వెళ్ళిపోయింది.

నేనలా ఆశ్చర్యంగా ఆమె వంక నే చూస్తూ ఉండిపోయాను.

అలా జరిగింది చిత్రతో నా పరిచయం. కానీ అంతటితో ఆగ లేదది. మరుసటి రోజామె నన్ను ఓ పార్కులో పలకరించింది "హలో, గోపాల్!" అంటూ. ఆశ్చర్యపోయాను.

"నా పేరు మీ కెలా తెలిసింది?" అన్నాను.

"అది వృత్తిరహస్యం. చెప్పకూడదు" అందామె.

"ఏమిటి, మీ వృత్తి?" అడిగాను కుతూహలంగా.

"నిజంగా మీకు తెలియదూ?" అంది.

"ఊహిస్తున్నాను. కానీ, ఊహ అన్నివేళలా నిజం కాకపోవచ్చు."

"కానీ, మీ ఊహ నిజమే గోపాల్!"

"ఏమిటి నా ఊహ!"

"చెప్పడం నా వృత్తిధర్మ మనిపించుకోదు."

"నన్ను మళ్ళీ ఈ రోజు కలుసుకోవడం మీ వృత్తిధర్మమా?" అన్నాను.

"కాదు. అది నా వ్యక్తిగత విషయం" అంది చిత్ర.

"అంటే?"

"మరికొన్నాళ్ళు పోయాక అర్థం కావచ్చు."

మరికొన్నాళ్ళు పోయాక నా కర్థమయిం దేమిటంటే' చిత్ర నన్ను ప్రేమిస్తోందని. ఆ ప్రేమలోనే నాకు డబ్బి స్తోందని. అయితే ఆమెకు డబ్బెక్కణ్ణించి వస్తోంది. అస లామె ఎవరు? అన్న ప్రశ్నలకు నాకు సమాధానం లభించ లేదు.

# 2

ఆలోచనల్లోంచి బయటపడి టైము చూసుకున్నాను. అక్కడికి చేరుకోడాని కింకా రెండుగంటలకు పైగా వ్యవధి ఉంది. హోటల్లోంచి ఇవతలకు వచ్చాను. రిక్షా బేరమాడదా మనుకున్నాను. ఇందాకా సుందర్రావుపేట కెదురూపాయ లడిగిన రిక్షావాడింకా అక్కడే వున్నాడు. వెధవకి బేరం దొరికినట్లు లేదు. నన్ను చూస్తూనే ఓ వెకిలి నవ్వు నవ్వాడు. ఆ నవ్వులో హేళన ఉందనిపించింది. ఇంకెన్నాళ్ళులే__కొన్ని గంటలు. అసలీ రిక్షావాళ్ళకేసి చూడడానికైనా టైముండదు. నా స్థితి, పరిస్థితి పూర్తిగా మారిపోతాయి.

జీవితంలో ఇటువంటి రోజు వస్తుందని నే నూహించ లేదు.

సరిగ్గా రెండ్రోజుల క్రితం చిత్ర చెప్పింది ఈ రోజు గురించే.

"గోపాల్! నీకు లక్షాధికారి అవాలనుందా?" అనడిగిం దామె.

"ఎందుకుండదు? నాకేం కర్మ ప్రతివాడికీ ఉంటుంది!"

అన్నాను.

"అందరికీ ఉండడం వేరు. నీకుండడం వేరు. నీకు కావాలనుంటే, ఎల్లుండే లక్షాధికారివి కావచ్చు."

"ఎలా?" అడిగాను ఆత్రంగా.

"ఎల్లుండి మధ్యాహ్నం ఒంటిగంటకు సుందర్రావు పేటలో నూటపదమూడో నంబరు ఇంటికి రా. ఒంటిగంట అంటే సరిగ్గా ఒంటిగంటకు రావాలి. రేడియో టైము ఫాలో అవు. మరీ ముందుగా సుందర్రావుపేటకు వెళ్ళి పోకు. ఒక్క అయిదునిముషాలు ముందుగా రావాలి. ఆ ఇంటిముందు ఆగు. సరిగ్గా ఒంటిగంటకు ఆ ఇంటి తలుపులు తెరుచుకుంటాయి. అవి ఆటోమేటిక్ తలుపులు. ఒక్క నిముషంపాటు తెరచుకుని ఉంటాయి. తర్వాత అవి మూసుకుపోతాయి. ఇంక మరి తెరుచుకోవు. ఆ ఒక్క నిముషం వ్యవధిలోనూ నువ్వొక్కడుండి ఆ ఇంట్లో ప్రవే శించు. తర్వాత లక్షాధికారివి ఆటోమేటిక్‌గా అయి పోతావు" అంది చిత్ర.

నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. అంతా ఏదో మాయ అనిపించింది. "నేను లక్షాధికారిని కావడంతో సరిపోదు. లక్షలతోపాటు నాకు నువ్వుకూడా కావాలి" అన్నాను.

చిత్ర ముఖం వికసించింది. "నాకూ నువ్వు కావాలి. అందుకే కదా నిన్ను లక్షాధికారిని చేస్తుంట" అంది.

"అది సరే. అంత సింపుల్‌గా లక్షాధికారి నెలా అవు తానో చెప్పలేవా?" అన్నాను.

"చెప్పడం నా వృత్తి ధర్మం కాదు" అంది చిత్ర.

అప్పట్నించీ ఈ రోజు కోసం ఎదురు చూస్తున్నాను వచ్చింది. ఇప్పుడు ఒంటిగంట ఎంత తొందరగా అవు

తుందా అని ఎదురు చూస్తున్నాను. టయమింకా పది కొండుంపావే అయింది. నెమ్మదిగా నడవసాగాను. సుందరావు పేటవైపు.

చిత్ర పేరుకు తగ్గట్లే చిత్రమైన మనిషి. ఆమెకు డబ్బుకు లోటులేదు. కానీ స్వతంత్రురాలనిపించదు. బయట ఉత్సాహంగా కనిపించినా పరీక్షగా చూస్తే ఆమె కళ్ళలో భయం, విషాదం కనిపించకపోవు. అయితే ఆమె ఏమి చేస్తుందన్నది నేను కనుక్కోలేకపోయాను. నిజం చెప్పాలంటే తెలుసుకోవాలని నేనూ సీరియస్‌గా ప్రయత్నించలేదు. ఆమె నా జబ్బు సమస్యను తీర్చింది. నన్ను లక్షాధికారిని చేస్తానంటుంది. ఆమె ఎవరైతే నాకేం? ఎవరైతే మాత్రం — నా కిన్ని సదుపాయాలు చేకూర్చగలరు?

వాచీ చూసుకున్నాను. టైము పదకొండున్నర దాటింది. ఇంకా చాలా దూరం నడవాలి. చాలాసేపు నడవాలి.

అయితే ఆమెను చూడగానే ఉలిక్కిపడ్డాను. ఆమె చిత్ర!

"అరె. చిత్ర!" అన్నాను ఉలిక్కిపడి.

ఆమె ఆగింది. నా వంక అదోలా చూసి, "నాతోనా మీరు మాట్లాడింది?" అంది.

నన్ను మీరనడం చిత్ర మానేసి చాలాకాలమైంది. అందుకే ఆశ్చర్యంగా, "నన్ను సుందరావు పేటకు రమ్మనమని నువ్వే అట్నించొస్తున్నా వేమిటి?" అని అడిగాను.

"ఎవరు మీరు? మీమాటలు నాకర్థం కావడంలేదు" అందామె.

"అయ్యో చిత్రా! మరో గంటలో లక్షాధికారిని కాబోతున్నాను. నేనే గుర్తులేనా?" అన్నాను కాస్త వ్యంగ్యంగా.

"చూడు మిస్టర్! నీకు మూడు విషయాలు చెప్పదల్చుకున్నాను. మొదటిది,లక్షాధికారుల్నీ, లక్షాధికార్లుకాబోయే వాళ్ళనీ గుర్తుంచుకోవడం కొంతమందికి వృత్తిగా ఉండవచ్చు కానీ నాకు కాదు. రెండవది, నువ్వు నాతో చనువుగా మాట్లాడం నాకు నచ్చలేదు. మూడవది, నా పేరు చిత్రకాదు. నా పేరు తెలుసుకోవాలని నువ్వీ నాటకమాడుతున్నావనే అనుమానంతో నా పేరు చెప్పడం లేదు. వెడుతున్నావు కదా ముందుకి. మరి నా జోలికి రాక ముందుకే వెళ్ళి నీ పని నువ్వు చూసుకో" అని కదిలింది.

ఏం చేయాలో నాకు తోచలేదు. నోటమ్మట మాట రాక అలాగే నిల్చుండి పోయాను. ఆమె వెళ్ళిపోయింది.

అప్రయత్నంగా వాచీ చూసుకున్నాను. టైముసుమారు పన్నెండయ్యింది. సుందర్రావు పేట చేరుకోడానికి మరి గంట మాత్రమే టైముంది.

నా నడక వేగం హెచ్చింది. సరిగ్గా అయిదు నిముషాలైనా నడిచానో లేదో ఒక ఖాళీ రిక్షా ఎదురయింది.
"సుందర్రావు పేటకి వస్తావా?"
"రెండ్రుపాయ లవుతుంది."
మాట్లాడకుండా రిక్షా ఎక్కి కూర్చున్నాను. రిక్షా సుందర్రావు పేట వైపుగా బయల్దేరింది.

నా బుర్రలో రకరకాల ఆలోచనలు తిరుగుతున్నాయి. ఒంటి గంటకు సుందర్రావు పేటలో నూటపదమూడో నంబరు ఇంట్లో ఏం జరగబోతుంది? నేను నిజంగా లక్షాధి

కారిని అవుతానా? ఇందాకా కనిపించిన అమ్మాయి నిజంగా చిత్రకాదా?

ఏమిటాలోచిస్తున్నానో సరిగ్గా తెలియదు. బుర్ర గజిబిజిగా అయింది. కంగారుగా ఉంది. భయంగా ఉంది. సంతోషంగా ఉంది. రకరకాల అనుభూతులతో ఒళ్ళు కాస్త వేడెక్కింది.

“ఎక్కడ దిగాలంటారు?” అన్నాడు రిక్షా అతను.

వచ్చేసింది సుందర్రావు పేట. రిక్షా దిగుతూ టైము చూసుకున్నాను. పన్నెండు ఇరవై అయింది. జేబులోంచి రెండు విడి రూపాయల నోట్లు తీసి రిక్షా అతనికిచ్చాను.

ఇప్పుడు నూటపదమూడో నెంబరు యిల్లు పట్టుకోవాలి. దగ్గర్లోవున్న యింటి నెంబరు చూశాను. నాలుగొందల ముప్పై ఏడుంది. అంటే ఈ నూటపదమూడెంత దూరంలో ఉందో?

ఎవరికీ అనుమానం రాకుండా ఉండడం కోసం ఒక కిళ్ళీ కొట్లో వాకబు చేశాను. నూట పదహారో నంబరింటి కెలా వెళ్ళాలని. నూట పదమూడు కూడా ఆ దగ్గర్లోనే ఉండకపోదు.

కిళ్ళీ కొట్టతని సమాచారం నాకు చాలలేదు. ఒకరిద్దరు మనుషుల్ని వాకబు చేయాల్సొచ్చింది. పేటలో ఇంటి నంబర్లు పద్ధతిలో లేవు. నూట పదహారో నంబరు ఇల్లు పట్టుకోడానికి పదిహేను నిముషాలు పట్టింది కానీ అది నేను రిక్షా దిగిన చోటుకెంతో దూరంలో లేదు.

కానీ ఆ సందులో ప్రారంభమైన మొదటి నంబరే నూటపదహారు. నూటపదమూడెక్కడో తెలియలేదు. అక్కడ చాలా సందులున్నాయి. ఒక సందులో రెం

డొందల మీదున్నాయి నంబర్లు. వేరో సందులో నాల్గొందల మీదున్నాయి. మూడో ప్రయత్నంలో విజయం సాధించాను. నూటయిదో నంబరింటి పక్క నూటారో నంబరిల్లు ఉంది. వరసలో ఇంకా పాతికిళ్ళకు పైగా ఉన్నాయి.

పది నిముషాల తక్కువ ఒంటి గంటకు నూటపదమూడో నంబరు ఇంటిముందున్నాను. ఇల్లు చాలా అందంగా ఉంది. చిన్న బంగళా అది. చుట్టూ గోడ ఉంది. ఇంట్లోకి వెళ్ళడానికి గేటు తలుపులు తీసుకుని వెళ్ళాలి. గేటుకు పెద్ద బోర్డు తగిలించి ఉంది. "కుక్కలున్నాయ్ జాగ్రత్త!",

నేను గేటు తీసికొని లోపల అడుగు పెట్టి మళ్ళీ గేటు వేశాను. చిన్న నడవలాంటి ఇంటి అరుగుమీదకు వెళ్ళాను. ఇల్లు చాలా నీటుగా గొప్పగా ఉంది. చుట్టూ పరికిస్తున్నాను. గుండెలు కొట్టుకుంటున్నాయి.

## 3

నా చూపులు వాచిమీదకూ, ఇంటి తలుపుమీదకూ మారుతున్నాయి. నా వాచి సరిగ్గా ఒంటిగంట చూపినప్పుడు చిన్నశబ్దం వినబడింది. అంతలోనే ఆ ఇంటి తలుపులు తెరుచుకున్నాయి. నేను హడావుడిగా లోపలకు వెళ్ళాను. లోపల మనుషులెవ్వరూ కనబడలేదు. అటూ ఇటూ చూస్తున్నాను.

ఇంతలో తలుపులు వాటంతటవే వేసుకుపోయాయి.

గది కాస్త చీకటిగా వుంది. ఇంట్లోకి వెలుతురు అంత బాగా రావడంలేదు. ఎక్కడైనా స్విచ్ ఉన్నదేమో చూసి దీపం వేయాలనుకున్నాను. కానీ గోడకు స్విచ్ లున్నట్లు కనబడలేదు.

ఇంతవరకూ అనుకున్నట్లే జరిగింది. చిత్ర చెప్పిన

విధంగా నేను మసలుతున్నాను. ఆమె చెప్పినట్లుగానే జరిగింది. మరిప్పుడేం జరుగుతుంది? నేనెలా లక్షాధికారిని కాబోతున్నాను?

దూరంగా ఎవరో నడిచివస్తున్న అలికిడి అవుతోంది. మరోక్షణంలో గదిలో వెలుతురు నిండింది. నా కళ్ళ ముందు చిత్ర అందంగా, ఆకర్షణీయంగా, ఒక అందమైన సూట్ కేసుతో నిలబడి వుంది.

"ఇంతవరకూ చీకటిగావున్న ఈ గది నీ రాకతో వెలుగును నింపుకుంది చిత్రా!" అన్నాను కాస్త కవితా ధోరణిలో.

"అందుక్కారణం చాలా సింపుల్! నాకు స్విచ్ ఎక్కడుందో తెలుసు. నీకు తెలియదు" అంది చిత్ర ఇంచుమించు నా ధోరణిలోనే.

నేను నవ్వాను. "చాలా సస్పెన్సులో పెట్టావ్. ఇప్పుడు నువ్వు నా కళ్ళబడ్డ క్షణంవరకూ నేనెటువంటి ఉద్వేగాన్ననుభవించానో మాటల్లో చెప్పడం కష్టం!" అన్నాను.

"అప్పుడే అయిపోయినట్లు మాట్లాడుతున్నావేమిటి? ఇంక ముందున్నది అసలైన కథ" అంది చిత్ర కాస్త సీరియస్ గానే.

"అంటే?" అన్నాను కాస్త అనుమానంగా.

"నా పేరు గుండూరావు" అన్న మాటలు వినపడి వెనక్కు తిరిగాను.

ఎత్తుగా, బలంగా, కండలు తిరిగివున్న ఆ వ్యక్తి, నున్నని గుండువల్ల కాబోలు చాలా భయంకరంగా వున్నాడు.

"ఎవరు మీరు?" అనడిగాను కాస్త భయంగా.

"నా పేరు నల్లయ్య" అన్న మాటలు వినపడగా మళ్ళీ వెనక్కి తిరిగాను.

చిత్ర పక్కగా ఒక నల్లని మనిషి నిలబడివున్నాడు. అతని రంగు అతని రూపాన్ని భయంకరంగా తీర్చిదిద్దడానికి కొంతవరకూ మాత్రమే సహకరించింది. అతను సహజ భయంకరుడు.

"వీళ్లెవరు చిత్రా!" అన్నాను భయపడుతూ.

"యమభటులను మించినవాళ్ళం" అన్నాడు గుండూరావు.

"నువ్వలా కుర్చీలో కూర్చో" అంది చిత్ర నన్ను.

నిలబడ్డం కష్టంగానే వుంది. వెంటనే వెళ్ళి అక్కడున్న సోఫాకుర్చీలో కూర్చున్నాను. చాలా కంఫర్టబుల్ గా వుంది. ఒక్క పిసరు ధైర్యం వచ్చింది. "ఎవరు మీరు?" అన్నాను మరోసారి. ఈసారి నా ప్రశ్న కాస్త హుందాగా అడిగాను.

"యమభటులను మించినవాళ్ళం" ఈసారి నల్లయ్య అన్నాడు.

"అయితే ఫరవాలేదు. నేను యముణ్ణి అనుకోండి" అన్నాను.

ఫక్కున నవ్వింది చిత్ర. సూట్ కేస్ తో నడుచుకుంటూ నా దగ్గరకు వచ్చింది. సూట్ కేస్ టీపాయ్ మీద పెట్టి, నా పక్కగా కూర్చుంది. "గోపాల్! లక్షాధికారివి కావడాని కింక కొద్ది క్షణాలుకూడా పట్టదు. సూట్ కేస్ తెరచి చూడు" అంది.

లేచి నిలబడ్డాను. టీపాయ్ మీద సూట్ కేస్!

వణుకుతున్న చేతులతో సూట్ కేసు తెరిచాను. కళ్ళు జిగేల్ మన్నాయి. మిలమిల మెరిసే రాళ్ళు. బహుశా అవి వజ్రాలయుంటాయి.

"ఈ సూట్ కేస్ విలువ కోట్లలో వుంటుంది. నువ్వు లక్షాధికారివి కావాలంటే ఈ సూట్ కేస్ మరొకరిది కావాలి. అదీ నీ ద్వారా" అంది చిత్ర.

"నాకేమీ అర్థంకావటంలేదు" అన్నాను చికాగ్గా.

"ఈ సూట్ కేసు నువ్వు తీసుకో. నీదగ్గరుంచుకో; నేను చెప్పిన రోజున చెప్పిన వ్యక్తికివ్వాలి. ఆ పని చేసినందుకు నీకు మొత్తం మూడు లక్షలు ముడుతుంది. అడ్వాన్సుగా ఈ రోజు లక్ష ఇస్తాను!" చిత్ర చాలా గంభీరంగా అంది.

"చిత్రా!" అన్నాను కొంచెం విసుగ్గా. "నీ ఉద్దేశ్యం నా కర్థం కావడంలేదు. నన్ను లక్షాధికారిని చేస్తానన్నావ్. నాతో కాపురం పెడతానన్నావ్. మనమిద్దరం హాయిగా ఉండొచ్చన్నావ్."

చిత్ర నవ్వింది. "నేనేమన్నానో నాకు తెలుసు. నీ ఊహలను నా మాటలుగా మార్చకు. నేను చాలా జాగ్రత్తగా మాట్లాడుతాను. నాకూ నువ్వు కావాలి. అందుకే లక్షాధికారిని చేస్తున్నానని చెప్పాను. అంతే నేను చెప్పింది. మిగతాదంతా నీ ఊహే!"

"ఈ వ్యవహారం నాకంత నచ్చలేదు. ఇందులో ఏదో తిరకాసుందనిపిస్తోంది. ఇవ్వదల్చుకుంటే ఉత్తనే లక్ష రూపాయలివ్వు. లేదా నా దారిన నే పోతాను" అన్నాను.

"ఇందులో తిరకాసేమీ లేదు. చాలా సింపుల్ వ్యవ

హారం. ఈ సూట్ కేస్ నీ గదిలో ఒక నాలుగు రోజుల పాటుంటుంది. ఆ నాలుగు రోజులూ దీన్ని జాగ్రత్తగా చూడవలసిన బాధ్యత కూడా నీకు లేదు. నా మనుషులు వెయ్యి కళ్ళతో నీ గదిని భద్రంగా చూస్తుంటారు. నాలుగు రోజుల తర్వాత ఏం చేయాల్సొంటుందో నేను చెబుతాను'' అంది చిత్ర.

నేను నవ్వాను. ''మరి తిరకాసు లేదంటావేం? ఈ సూట్ కేసును నీ దగ్గరే దాచుకోవచ్చుగదా! నీ మనుషులు చాలా సమర్ధులు గదా! ఈ పని వాళ్ళ చేతనే చేయించవచ్చునుగదా! వీటికి నేనెందుకు? నాకు పోలీసులకు సంబంధించిన వ్యవహారాల్లో దూరడం ఇష్టముండదు. ఏ తప్పు చేసినా జైలు కెళ్ళని తప్పు చేయాలి...''

చిత్ర నా వైపు ప్రేమగా చూసింది. స్వరం కస్త తగ్గించింది. ''నన్ను నమ్ము. ఇది కేవలం నీ మంచి కోసమే చెబుతున్నాను. ఈ పని చేయడానికి నేను వేరే మనిషి నెన్నుకోవచ్చు. కానీ అప్పుడు నువ్వు లక్షాధికారి వెలా అవుతావు? ఏ పరిస్థితుల్లోనూ నీకు పోలీసుల భయం లేకుండా చూసే పూచీ నాది.''

నేను మౌనంగా ఆలోచించసాగాను.

''చూడు గోపాల్! నిన్ను లక్షాధికారిని చేయడం నా ఆశయం. అందుకే ఈ పని నీకిచ్చి కొన్ని రిస్కులు కూడా తీసుకుంటున్నాను. సందేహించకు బంగారంలాంటి అవకాశాన్ని పాడు చేసుకోకు.''

తటపటాయిస్తూ ''ఈ ఒక్కసారికే. మళ్ళీ మళ్ళీ ఇలాంటి పనులు చెప్పవద్దు'' అన్నాను.

"ఒక్క దెబ్బతో లక్షాధికారివి కాబోతున్నావ్. మళ్ళీ మళ్ళీ ఇలాంటి పనులు చేయవలసిన అవసరమే ముంది_ఇంకా డబ్బు కావాలనుకుంటే తప్ప" అంది చిత్ర చిత్రంగా నవ్వి.

ఆ నవ్వు అర్థమేమిటో? ఒక్కసారి డబ్బు రుచి మరిగేక నేనే కావాలని ఇలాంటి పనులకు ముందుకు వస్తానా?

నేను చిత్ర వంక అదోలా చూశాను. 'చిత్రా ఎవరు నువ్వు? ఏమిటి నువ్వు చేస్తుండే పని? ఎందుకు నువ్వు ఒక మామూలు భారత నారిగా గాక వింతరకం జీవితం గడుపుతున్నావ్?' అన్న ప్రశ్నలు నా చూపుల్లో వున్నాయి. వాటి అర్థాన్నామె గ్రహించిందో, లేదో తెలియదుగానీ, ఆమె కన్నులలో నీరు తిరిగినట్లు నా కనుమానం వచ్చింది.

"గుండూరావ్!" అంది చిత్ర.

"యస్ మేడమ్."

"ఒక పదివేల రూపాయల క్యాష్టూ, ఓ తొంభై వేల విలువ చేసే బంగారం గోపాల్ గదిలో వుంచాలి."

నేను చిత్ర వంకనే చూస్తున్నాను. ఆమె ముఖం మామూలుగా లేదు. ఒక అధికారిణిలా వున్నది.

గుండూరావ్ వెళ్ళిపోయాడు.

"నల్లయ్యా! నువ్వు కూడా వెళ్ళవచ్చు" అంది చిత్ర. నల్లయ్య వెళ్ళిపోయాడు.

ఇద్దరూ వెళ్ళిపోయేక చిత్ర నాతో అంది: "లక్షాధికారిని అభినందిస్తున్నాను—"

"కానీ నాకు సంతోషంగా లేదు చిత్రా - అద్వాంచ

రస్ లైఫంటే నా కింట్రెస్టు లేదు. ఏదో సామాన్యంగా బ్రతకగలిగితే చాలు.”

“అందరికీ అలాగే ఉంటుంది గోపాల్ - కొందరికి సాగుతుంది. మరికొందరికి వీలుపడదు. జీవితంలోని మాధుర్యం అందరూ ఒకే రకంగా అనుభవించడం కుదరదు.”

“కానీ నా జీవితపథాన్ని నేను నిర్ణయించుకోగలను. అందుకు తగ్గ స్వతంత్రం నాకుంది...” అన్నాను.

చిత్ర బాధగా నవ్వి “నీ మాటలను నేనంగీకరించ లేను. ఈ ప్రపంచంలో ఏ మనిషికీ స్వతంత్రం లేదు. మనిషి పరిస్థితులకు బానిస” అంది.

“కానీ నేను పరిస్థితులకు తల ఒగ్గను” అన్నాను గర్వంగా.

“ఓహ్! మరి ఆ రోజున సింగిల్ టీ దుకాణంలో ప్రభుత్వానికి సంబంధించిన ఆఫీసరుగా నటించడం పరిస్థితులకు బానిసై కాదా?” అంది చిత్ర వ్యంగ్యంగా.

‘తెలివైనదానివే’ అనుకున్నాను మనసులో. పైకి మాత్రం ఏమీ అనలేదు. ముభావంగా వూరుకున్నాను.

“నేను నిన్ను వదలను, వదలలేను గోపాల్” అంది చిత్ర. “కానీ నువ్వు నాతో మనస్ఫూర్తిగా అన్నీ చెబుతున్నావని తోచదు.”

“నీ అనుమానమే నీకు శత్రువౌతుంది చిత్రా! నేను నీ దగ్గరేమీ దాచడం లేదు. ఇంకా నువ్వే నా దగ్గర అన్నీ దాస్తున్నావు. నిజం చెప్పాలంటే నీ గురించి నాకేమీ తెలియదు. అసలు నువ్వెవరివో, నీ పేరేమిటో కూడా నాకు తెలియదు.”

“నా పేరు చిత్ర-ఆ సంగతి నీకు తెలుసు.”

“అది నీ నోట విన్నది. ఇంకా నీకెన్ని పేర్లున్నాయో నీ అసలు పేరేమిటో నాకు తెలియదు.”

చిత్ర చురుకైన కళ్ళతో నా ముఖంలోకి చూసి, “నీ పేరు నిజంగా గోపాల్ కాదేమిటి?” అంది.

“ఏమో అది నేను చెప్పగా తెలుసుకున్నది కాదు గదా” అన్నాను.

“నిజమే. కానీ చెప్పకుండా విషయాలు తెలుసుకో గలగడం నీకూ చేతనైనట్లు కనబడుతోంది.” అంది చిత్ర. ఒక్క క్షణం ఆగి, “ఈ సూట్ కేసు తీసుకుని బయల్దేరు. నీకే విధమైన అడ్డంకులు రావు. ఎప్పుడే కష్టం వచ్చినా నన్ను తలచుకుని ధైర్యంగా ఉండు. మళ్ళీ ఎప్పుడూ ఈ ఇంటికి రావటానికి ప్రయత్నించకు” అంది.

నేను సూట్ కేసు తీసుకుని లేచాను. “వస్తాను చిత్రా!” అన్నాను.

“మంచిది.” అంది చిత్ర. ఆమె ముఖంలో అట్టే ఉత్సాహం కనపడలేదు.

నేను నా గది చేరుకునే సరికి గదిలో ఒక క్రొత్త పెట్టె కనపడింది. అందులో పదివేల రూపాయల క్యాషూ, బంగారం బిస్కట్లు ఉన్నాయి.

## 4

“ఎక్కడిది నాయనా ఇంత డబ్బు!” అన్నారు నాన్నగారాశ్చర్యంగా.

“అదృష్టం తన్నుకు వచ్చింది. నేనేం దొంగతనం చెయ్యలేదు, నా బిజినెస్ బుర్రను మెచ్చుకుని ఒక కోటీశ్వరుడు స్నేహితుడయ్యాడు. ఇది మొదటి సంపాదన,

చెల్లాయికీ, అమ్మకీ ఈ బంగారంతో నగలు చేయించండి. క్యాష్ ఎనిమిదివేలూ చెల్లాయి పెళ్ళికి కట్నానికి పనికొస్తుంది. దగ్గరుంచండి. ఒక్కసారి బ్యాంకులో వేస్తే ఎక్కడ్నించి వస్తోందని అనుమాన మొస్తుంది గాబట్టి డబ్బు ఇంట్లోనే వుంచండి'' అన్నాను.

నాన్నగారి ముఖంలో డబ్బును చూసిన సంతోషమూ ఇంతెలా వచ్చిందన్న అనుమానమూ రెండూ కనబడుతున్నాయి. అమ్మ ముఖం మాత్రం బంగారాన్ని చూడగానే చేటంతయింది. "నా బంగారు తండ్రి గొప్పవాడై పోతాడనీ, నన్ను బంగారంలో ముంచేస్తాడనీ నాకెప్పుడో తెలుసు'' అంది.

నేను తెచ్చిన రెండు బంగారం బిస్కట్సుకే ఆమె అంత ఇదై పోతుంటే అక్కడ గదిలో వున్న మిగతా బంగారం చూస్తే ఆమె కళ్ళు చెదిరిపోవచ్చుననిపించింది. ఆమె కోరిక నిజమే కాబోతోంది. నేను అమ్మను బంగారంలో ముంచేసే రోజు దగ్గర్లోనే వుంది.

చెల్లాయి కూడా నా సంపాదన గురించి అంత సంతృప్తికరంగా వున్నట్లు లేదు. తోచిన అబద్ధాలు కల్పించి చెప్పాను కానీ నాకూ అంత తృప్తిగా లేదు. అందుకే అంత సంతోష సమయంలోనూ ఎక్కువసేపు ఇంట్లో గడపలేకపోయాను. చెప్పవలసింది చెప్పాక మరి ముళ్ళమీదున్నట్లుంది. మధ్యాహ్నం వచ్చినవాడిని చీకటి పడకుండా తిరుగు ప్రయాణం పట్టాను.

మా ఊర్నించీ నగరానికి గంటన్నర బస్సు ప్రయాణం. అయినా ఈ మధ్య కాలంలో అనగా చిత్ర పరిచయం లభించేక ఇంటి ముఖం చూపిన పాపాన పోలేదు. ఒక్క

సారి ఇంత డబ్బు చేతికి వచ్చేక నా బాధ్యతలు నాకు గుర్తొచ్చాయి.

నా గది చేరుకున్నాను. తలుపు తాళం తీసి వులిక్కిపడ్డాను. లోపల మనిషి వున్నాడు. అతను గుండూరావు.

నన్ను చూసి గుండూరావు తలుపులు వేయమని సౌజ్ఞ చేశాడు. దగ్గరగా రమ్మన్నాడు. వెళ్ళాను. నెమ్మదిగా అన్నాడు, "చస్తున్నాను నీ గదికి కాపలా కాయలేక-ఎక్కడికి పోయావ్?"

ఏకవచన ప్రయోగం నాకు నచ్చలేదు. "కాపలా కాయమన్న దెవరు?" అన్నాను.

"ఎవరైతే నేంలే. ఇది నా డ్యూటీ కాదు. ఎక్స్‌ట్రా పని."

"నాకు తిరగడం బాగా అలవాటు. నన్నని ప్రయోజనం లేదు. కానీ ఒక్కమాట. ఇలా నా గదిలోకి మారు తాళంచెవితో ప్రవేశించడం నాకు నచ్చదు" అన్నాను.

"మారుతాళం కర్మ నాకేం పట్టింది" అంటూ గుండూరావు తన షర్టు జేబులోంచి ఒక తాళంచెవి తీసిచ్చాడు. అందుకున్నాను. అది నా దగ్గరున్న తాళానికి డూప్లికేటు. ఇదివరలో నా గదిలోనే ఉండేది. ఎప్పుడో దాన్ని చిత్ర సంగ్రహించి ఉండాలి. అవును, అసలు నే నాలోచించనే లేదు. బంగారం ప్లస్ డబ్బు నా గదిలో కెలా వచ్చాయి? అప్పటికే ఈ తాళం వాళ్ళ పరమైందన్నమాట!

చాలా పెద్ద గూడుపుఠాణీ నా చుట్టూ నడుస్తోంది. ఫలితంగా నే నేమవుతానో నాకు తెలియదు. తాత్కాలికంగా నా దగ్గర డబ్బుంటోంది.

"వస్తాను" అంటూ గుండూరావు లేచాడు.

"మళ్ళీ ఇప్పుడే. నేను బయటకు పోతానేమో. మరి గదికి కాపలా ఎవరు కాస్తారు?" అన్నాను.

గుండూరావు మాట్లాడకుండా ముందుకు నడిచాడు.

"మళ్ళీ గదిలోకి రావాలంటే తాళాలున్నాయా" అన్నాను.

"ఎన్ని తాళాలు కావాలేమిటి. నా దగ్గరో తాళంచెవి వుంది" అంటూ తన జేబులోంచి తాళంచెవి తీసి చూపించి వెళ్ళిపోయాడు. అప్రయత్నంగా నా చేయి జేబులోకి పోయింది. అందులో ఇందాకా గుండూరావిచ్చిన తాళం చెవి లేదు.

నా గుండె ఒక్క క్షణం ఆగి మళ్ళీ కొట్టుకుంది. గుండెలు తీసిన మొనగాళ్ళంటే వీళ్ళేనన్నమాట!

తలుపులు గడియవేసుకుని ఆలోచిస్తూ మంచంమీద నడుం వాల్చాను. నాకు తెలియకుండానే నిద్ర పట్టేసినట్లుంది. ఎవరో తలుపులు దబదబా బాదుతున్న చప్పుడైలేచాను. టైము చూసుకుంటే పన్నెండున్నరయింది. ఇంత రాత్రివేళ ఎవరబ్బా అనుకుంటూ లేచి వెళ్ళి తలుపులు తీశాను.

పోలీసులు!

ఆశ్చర్యంతో నాకు నోట మాట రాలేదు. "మీ గది సోదా చేయాలి!" అన్నాడు వాళ్ళలో ఒకడు. నేనవాక్కయి అలాగే చూస్తున్నాను. చిత్ర ఇచ్చిన వజ్రాలతోపాటు నా బంగారంకూడా పోతుంది. ప్లస్ నాకు జైలు శిక్ష.

మొత్తం అయిదుగురు మనుషులున్నారు. ఒకడు నాకు కాపలా కాస్తున్నాడు. మిగతా నలుగురూ గదిలో అన్ని

వైపులా చూస్తున్నారు. చిత్ర నాకిచ్చిన సూట్‌కేస్ వారిలో ఒకతను తెరిచాడు. మళ్ళీ మూసేశాడు. మరొకడు నా బంగారముండవలసిన పెట్టెను తెరచి చూసి మూసేశాడు. మొత్తం పదిహేను నిముషాల్లో గదిసోదా ముగించి "అయామ్ వెరసారీ మిస్టర్! అనవసరంగా మీకు ట్రబులిచ్చాం. మాకు వచ్చింది రాంగ్ రిపోర్టనుకుంటాను" అని వాళ్ళలో ఒకడన్నాడు. అయిదుగురూ వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళాక నాలో చలనం వచ్చింది. వెళ్ళి తలుపులు వేసి, నా ఆస్తి చూసుకుందుకు వెళ్ళాను. నిజంగానే వజ్రాలపెట్టీ, బంగారంపెట్టీ ఖాళీగా వున్నాయి. నా గుండె గుభేలుమంది. మంచంమీద కూలబడ్డాను నిరుత్సాహంగా.

'ఇప్పుడేం జరుగుతుంది?'

ఇదే ప్రశ్న నన్ను కలవరపరుస్తోంది. అప్పుడే నాకు చిత్ర మాటలు గుర్తుకొచ్చాయి. పెట్టె భద్రత విషయంలో నాదేమీ బాధ్యత లేదని చెప్పిందామె. నాలుగురోజులు నా గదిలో ఆ పెట్టె నుంచుకోవడంవరకే నా బాధ్యత. ఈ సమాచారాన్ని రేపు చిత్రకు అందజేయాలి.

మనస్సు స్థిమితంగా లేకపోయినప్పటికీ నాకు మళ్ళీ నిద్ర పట్టింది. నిద్రలో రకరకాల అర్థంలేని కలలు వచ్చాయి. లేచేసరికి ఉదయం ఏడున్నరయింది. త్వర త్వరగా ముఖం కడుక్కుని స్నానంచేసి గదికి తాళం వేసుకుని బయటపడ్డాను.

దగ్గర్లో ఉన్న హోటల్లో టిఫినూ, కాఫీ తీసుకుని రోడ్డు మీదకు వచ్చాను. ఇప్పుడు నేను చిత్రను కలుసుకోవాలి. అయితే ఎక్కడ కలుసుకోవాలో, ఎలా కలుసుకోవాలో

నాకు తెలియదు. ఇంతవరకూ ఆమె నాకు అనుకోకుండా కనిపించడంవల్లనే కలుసుకుంటూ వచ్చాను. ఈ రోజు ఆమె అవసరం నాకు బాగా కనపడుతోంది. ఎలా వెళ్ళాలో తెలియదు, ఎక్కడికి వెళ్ళాలో తెలియదు— ఆమెను కలుసుకునేందుకు.

ఒక ఆలోచన వచ్చింది. సుందర్రావుపేట వెడితే!

మళ్ళీ నువ్విక్కడికి రావద్దని చెప్పిందామె. అది హెచ్చరిక కావచ్చు. లేక యధాలాపంగా చెప్పి ఉండ వచ్చు. చిత్ర గురించిన వ్యక్తిగత సమాచారం ఏమీ లేని నాకు ప్రస్తుతం అక్కడికి వెళ్ళడం మాత్రమే ఏకైక మార్గంగా కనబడింది.

రిక్షావాడితో పెద్దగా బేరం పెట్టుకో నవసరంలేకుండా సులువుగా బేరం దొరికింది. తెలిసిన ఇల్లే కాబట్టి పట్టు కునేందు కెంతోసేపు పట్టలేదు.

అదే ఇల్లు. ఇంటిముందు కుక్కలున్నాయ్ జాగ్రత్త అన్న బోర్డు.

## 5

గేటుతీసి లోపల అడుగుపెట్ట బోయేటంతలో భౌంయ్ మని భయంకరమైన కుక్కఅరుపు వినపడింది. అప్రయ త్నంగా వెనకడుగువేసి గేటు వేసేశాను.

నేనిప్పుడు గేటు కివతల ఉన్నాను. అవతలపక్కగా సింహంలాంటి ఆల్సేషియన్ కుక్క ఉన్నది. అది నా వంక గుర్రుగా చూస్తోంది. అప్పుడప్పుడు మొరుగుతోంది. దాని మొరుగు చాలా భయంకరంగా ఉంది. మొరిగే కుక్క కరవదన్న సామెత నిజమే అనుకుంటే గేటు కవతల ఉన్నది కుక్క కాదు. క్షణంలో ప్రాణగండం

తప్పింది కానీ, లేకపోతే ఈ కుక్క నన్ను చీల్చి చెండాడి ఉండేదనిపించింది.

అయితే మొన్నటి రోజున నేను వచ్చినప్పటికీ కుక్క లేదు. బోర్డున్నా ధైర్యంగా లోపలకు అడుగుపెట్టాను, ఏమీ జరగలేదు. ఈ రోజీ కుక్క ఎక్కణ్ణించి వచ్చింది?

ఆలోచిస్తూ ఇంకా అక్కడే నిలబడి వున్నాను. కుక్క ఇంకా భయంకరంగా మొరుగుతూనే వుంది. ఇంతలో ఇంట్లోంచి ఎవరో వచ్చారు. మనిషికి యాభై ఏళ్లుంటాయి. బుగ్గమీసాలున్నాయి. పచ్చగా దబ్బపండులాగున్నాడు. చూడగానే గొప్పవాడనిపిస్తుంది. "నమస్కారమండీ!" అంటూ అరిచాను కుక్క మొరుగును ఛేదించుకుని నా కంఠం వినిపించడంకోసం.

"ఎవరది" అంటూ ఆయనకూడా అరిచి, "జానీ క్వయిట్" అన్నాడు. కుక్క స్వరం ఆగిపోయింది. ఆయన నెమ్మదిగా నడుచుకుంటూ వచ్చాడు గేటుదగ్గరకి.

"మీరెవరో నాకు తెలియదు. గేటుదగ్గర కాలింగ్ బెల్ ప్రెస్ చేస్తే మా కుక్కే కాలింగ్ బెల్ కావలసిన అవసరం తప్పేది" అన్నాడు నవ్వుతూ ఆయన.

"కాలింగ్ బెల్ నేను చూడలేదండి. అయినా మొన్న మీ ఇంటి కొచ్చినపుడు ఏ కుక్కా లేకపోవడంతో, కాస్త ధైర్యంగా లోపలకు అడుగుపెట్టబోయాను. అప్పుడే మీ కుక్క కాలింగ్ బెల్లు కావలిసొచ్చింది."

"మొన్న మీరు మా ఇంటికొచ్చారా?" ఆయన ముఖంలో కాస్త అనుమానం కనబడుతోంది.

"అవునండీ, మొన్న మధ్యాహ్నం ఒంటిగంటకు. మీ ఇంటి తలుపులు ఆటోమేటిక్ వికూడా కదా."

ఆయన ముఖంలో ఆదో రకమైన నవ్వు కనబడింది. "తొమ్మిదిన్నరకే ఎండ గీర త్తిస్తోంది. ఎండన పడొచ్చినట్లున్నారు. కాస్త లోపలికి రండి మాట్లాడుకుందాం, బయటే నిలబెట్టి మాట్లాడేస్తున్నాను పరధ్యానం ముండా వాణ్ణి!" అన్నాడు.

నేను జంకుతూనే లోపల అడుగుపెట్టాను. కుక్క ఇంకేమీ మొరగలేదు. అది శిక్షణ పొందిన మంచిజాతి కుక్కై ఉండాలి. గేటుకవతలే ఉండి మొరిగింది గానీ, దూకి బయటకు రావడానికి ప్రయత్నించలేదు. ఇంటాయనే నన్నాహ్వానించడం చూసి పిల్లిలా మెదలకుండా ఊరుకుంది.

నేనా ఇంట్లో అడుగుపెట్టాను. ఏర్పాట్లలో ఏ మార్పులూ లేవు. ఆ రోజు నేను చూసిన విధంగానే ఉంది. ఒకసారి గదంతా పరిశీలించి చూశాను. కొట్టొచ్చినట్లు గోడకు తగిలించిన లక్ష్మీదేవి పటం కనబడింది. ఆ రోజున ఈ పటం లేదు.

"అలా కూర్చోండి" అన్నాడాయన.

సోఫాకుర్చీలో కూర్చున్నాను. అదే అనుభవం. చాలా కంఫర్టబుల్ గా ఉంది.

"ఇప్పుడు చెప్పండి., మా ఇంటికి మీరు మొన్న వచ్చేరా?" అడిగేడాయన.

"అవునండీ, చిన్న పనిమీద వచ్చాను."

"ఎవరిని కలుసుకున్నారు?"

ఒక్క క్షణం తటపటాయించాను. ఏమని చెప్పాలి? నిజం చెబితే చిత్రకు కోపం రావచ్చు. అబద్ధం చెబితే ఈయన్ను నమ్మించడం కష్టం. జాగ్రత్తగా నిజాన్నీ, అబ

దాన్నీ కలగాపులగం చేయాలి.

"మీరేమీ అనుకోనంటే చిన్న ప్రశ్నడుగుతాను. చిత్రగారు మీకేమవుతారు?"

"చిత్ర ఎవరు?" అన్నాడాయన అదోలా ముఖంపెట్టి.

"ఆమెను కలుసుకునేందుకే నేనీ ఇంటికి వచ్చాను. ఆమె నా స్నేహితురాలు!"

"ఎంత వయసుంటుందామెకు?" ముసలాయన భృకుటి ముడతలు పడింది.

"ఇరవైకి అటో ఇటో..."

"ఈ ఇంట్లో ఉంటున్న స్త్రీ ఒక్కరే. ఆమె పేరు చిత్ర కాదు. ఆమె వయస్సు ఇరవైకి దరిదాపుల్లోనూ లేదు" అన్నాడాయన.

"ఆశ్చర్యంగా ఉందే!" అన్నాను.

"మీకంటే నాకెక్కువ ఆశ్చర్యంగా ఉంది. ఇది నా స్వార్జితంతో కట్టించిన ఇల్లు. దీనికి తెలిసి నేను ఆటోమేటిక్ తలుపులు పెట్టించలేదు. మీరవి ఆటోమేటిక్ వన్నారు. ఈ ఇంట్లో ఒక ఆడపిల్లను కలుసుకుంటున్నానంటున్నారు. అదీ అసహజంగానే ఉంది. ఈ మధ్య కాలంలో మా ఇంట ఆ పేరుతో ఆ వయసు పిల్ల మసల లేదు."

"ఇంతకీ ఈ ఇంట్లో ఒకేఒక ఆడపిల్లుందంటున్నారు. ఎవరామె?"

"ఆడపిల్ల కాదు. స్త్రీ. ఆమె నా భార్య!"

"మొన్నంటే మొన్న, మధ్యాహ్నం ఒంటిగంటనుంచి మూడు గంటలవరకూ ఈ ఇంట్లో మీరున్నారా?"

"లేము. సినిమాకు వెళ్ళాము."

"మీ పక్కనకూడా తీసుకవెళ్ళారా?"

"లేదు."

"ఇంట్లో ఇంకెవరైనా మనుషులున్నారా?"

"లేరు."

"మొన్న మధ్యాహ్నం ఒంటిగంటకు నేను మీ ఇంటికి వచ్చాను. మీ పక్క లేదు. తలుపులు ఆటోమేటిక్‌గా తెరుచుకన్నాయి. లోపల ముగ్గుర్ని కలుసుకన్నాను. ఇద్దరబ్బాయిలు. ఒకమ్మాయి. అమ్మాయి పేరు చిత్ర. అబ్బాయిల పేర్లు నాకు తెలియవు."

"కలుసుకని ఏం చేశారు?"

"ఏవో వ్యాపారవిషయాలు మాట్లాడుకన్నాం!"

"ఏం వ్యాపారం?"

"ఇంకా మొదలు కానిదే — నేను వ్యాపారం చేద్దామనుకుంటున్నాను. చిత్ర పెట్టుబడి పెడదామనుకుంటోంది. ఆమెకు డబ్బుంది. నాకు తెలివుంది. ఇంక వ్యాపారం మొదలుకావడమే తరవాయి."

"ఇంతకీ ఈ ఇల్లెవరిదో తెలుసా?" అడిగాడాయన.

తల అడ్డంగా ఊపాను.

"మా అబ్బాయి పోలీసాఫీసర్!"

ఉలిక్కిపడ్డాను. కోరి చిక్కుల్లో పడలేదు గదా! చిత్ర నన్ను మళ్ళీ రావద్దని హెచ్చరించడానికి కారణమిదేనేమో. అయితే నన్ను కలుసుకనేందుకామె పోలీసాఫీసరింటికి ఎందుకెన్నుకన్నది?

లేచి నిలబడ్డాను. "చిత్రను కలుసుకుందామని వచ్చాను. వస్తాను."

"ఏదైనా పుచ్చుకని వెళ్ళకూడదు."

"వద్దులెండి. అర్జంటు పని ఉంది." కదిలాను,
"మీ పేరు?" అడిగాడాయన.

"నరసింహమూర్తి. ప్రకాశ్ నగర్లో ఉంటున్నాను. రూమ్ నెంబర్ 27." అన్నీ అబద్ధాలే చెప్పాను.

ఆ ఇంట్లోంచి బయట పడ్డాక బుర్ర మళ్ళీ తీవ్రంగా పని చేయసాగింది. చిత్ర గుండెలు తీసిన బంటులాగుంది. ఒక పోలీసాఫీసరింటికి వజ్రాలున్న పెట్టెతో వచ్చింది. తన వ్యవహారాలన్నీ అక్కడే సెటిల్ చేసుకుంది. ఆ ఇంటి వాళ్ళకి చిన్న అనుమానమైనా కలగలేదు.

నడచుకుంటూ కొంతమేర వెళ్ళి రిక్షా ఎక్కాను. సిటీలో కాస్త సెంటరైన గోపాల్ పూర్ కు పోనీయమన్నాను. బేరమాడలేదు.

# 6

గోపాల్ పూర్లో దిగి మళ్ళీ హోటల్లో దూరాను. కాఫీ తాగి రోడ్డుమీదకు వచ్చేను. ఒకో షాపు వంకే చూస్తూ నడుస్తున్నాను. గాజుల దుకాణంలోంచి బయటకు వస్తూ చిత్ర కనిపించింది. ఉవ్వెత్తున ఉత్సాహం పొంగింది నాలో. రెండంగల్లో ఆమెను సమీపించి, "నీ గురించి తెగ గాలిస్తున్నాను. ఎక్కడున్నావ్ చిత్రా!" అన్నాను.

"మిస్టర్. అపరిచయస్తుల ఏకవచన ప్రయోగం నాకు నచ్చదని రెండోసారి చెప్పాలా?" అందామె తీవ్రంగా.

ఉలిక్కి పడ్డాను.

చిత్ర ఇలా మాట్లాడ్డం ఇది రెండోసారి.

"కానీ నేను నీ కపరిచయస్తుణ్ణెలాగౌతాను చిత్రా?"

"నా పేరు చిత్ర కాదని మళ్ళీ రెండోసారి చెప్పాలా?"

"అవసరం లేదు. నీ పేరు చిత్ర కాకపోవచ్చుని

మొన్న నే నీతో అన్నాను. నీ అసలు పేరేదై తేనేం. నువ్వు నీ నోటితో చెప్పిన పేరు చిత్ర.''

ఆమె విసుగ్గా నా వంక చూచి, ''ఎందుకిలా వెంట బడ్డావ్?'' అంది.

'అలా అడుగు చెబుతాను. మొన్న నువ్వు సుందర్రావు పేటలో సూట్ కేసిచ్చావా? అందులోవన్నీ ఖాళీ అయి పోయాయి. ఎలా పోయాయో తెలియదు. దాంతో పాటే నువ్వు నాకిచ్చిన బహుమానాలూ పోయాయి.''

ఆమె పకపకా నవ్వి, ''ఇంకా'' అంది.

''ఇంకేం లేదు. ఈ విషయాన్ని చెబుదామని సుంద ర్రావు పేటలో నూటపదమూడో నంబరింటి కెళ్ళాను. అక్కడ నిన్ను కలుసుకోవచ్చని ఆశ పడ్డాను. కానీ ఆ ఇల్లు పోలీసాఫీసరుది. చిత్ర పేరుగల వారెవ్వరూ ఆ ఇంట్లో ఎన్నడూ మసలలేదని ఇంటాయన నొక్కి చెప్పాడు.''

ఆమె కుతూహలంగా నా వంక చూసి, ''ఆ తర్వాత?'' అంది.

''ఏముంది. ఇక్కడకు వచ్చాను. వెతకబోయిన తీగ కాళ్ళకు చుట్టుకున్నట్లు నువ్వు కనిపించావు!'' అన్నాను.

ఆమె వస్తున్న నవ్వు నాపుకు నేందుకు ప్రయత్నిస్తూ ''ఏవండి, ఒకసారి మా ఇంటికొస్తారా?'' అనడిగింది.

''తప్పకుండా. నీ ఇల్లు తెలిస్తే ఏ బాధాలేదు'' అన్నాను.

''అయితే రండి. నాకో చిన్న సహాయం చేసిపెట్టాలి!'' అందామె.

''ఏమిటది?''

"నేను రాసిన కథలు చాలా తిరిగొచ్చేశాయి. వాటిలో లోపాలు చెప్పాలి. ఎలా రాస్తే ప్రచురించుకోబడుతాయో చెప్పాలి. నన్ను రచయిత్రిగా తీర్చిదిద్దాలి."

"కానీ నేను రచయితను కానే."

"అదేంటండీ. ఇప్పుడేగా ఇంతటి కథను నా కళ్ళ ముందే అల్లారు!"

"ఓహో." అన్నాను. "మీరు రచయిత్రిగా, నటిగా బాగా రాణిస్తారు. ఇప్పటి మీ ముఖం చూస్తుంటే తెలిసిన వారని నాకే అనిపించడం లేదు."

ఆమె ముఖం అదోల్లాగై పోయింది. నా వంక చూసి "నిజంగా మీకు నేను తెలుసా?" అంది.

"అది మీ మనస్సునడిగి తెలుసుకోండి."

"లేదు. దానికి మీరు తెలియరు."

"ఎక్కడో మనిషి బోలిన మనుషులుంటే తప్ప మీరు చెప్పేది నిజం కాదు కానేరదు." అని ఉలిక్కిపడ్డాను. ఇప్పుడు నేనేమన్నాను. బహుశా ఈమె చిత్రలాగే ఉన్న మరో మనిషేమో.ఆరోజు సుందర్రావు పేట వెడుతూంటే దార్లో ఈమె నాకుఎదురయ్యింది?సుందర్రావు పేట ఇంట్లో చిత్ర నాకు దర్శనమిచ్చింది. ఈమె చీరె కట్టుకుని ఉంది. అప్పుడు చిత్ర బెల్ బాటంతో ఉంది.

ఆమె నా వంక ఆశ్చర్యంగా చూసి, "మీరు నిజమేనా చెబుతుండాలి. లేదా నేనూహించిన దానికంటె అద్భుతమైన రచయితలైనా అయుండాలి. ఈ రెండూ కాకపోతే కాస్త వెర్రి వుండి వుండాలి" అంది.

"నేను నిజమే చెబుతున్నాను. కానీ మీరు కూడా నిజం చెప్పండి మీకింకా అక్కలూ చెల్లెళ్ళూ ఉన్నారా?

వాళ్ళలో ఎవరైనా అచ్చు మీ లాగే ఉంటారా?'' అనడిగాను.

''ముందు మా ఇంటికి రండి. అన్నీ మాట్లాడుకుందాం'' అందామె.

ఆమెను అనుసరించాను. గోపాల్ పూర్లో సిటీబస్సెక్కితే ఇంచుమించు వాళ్ళింటి ముందే దిగవచ్చు. వాళ్ళ ఇల్లు చాలా సామాన్యమైనది. ఈమె తలిదండ్రులకొక్కర్తే కూతురు. తండ్రి ఏదో ఆఫీసులో గుమాస్తాగా పనిచేస్తున్నాడు. ఉన్న ఊళ్ళో రెండెకరాల భూమి ఉంది. ఆమె తల్లి చాలా మంచిది. నన్ను బాగా ఆదరించింది.

నేను చిత్ర అనుకుంటున్నామె పేరు చిత్ర కాదు. రాజేశ్వరి. ఆమె పెద్ద ఎక్కువగా చదువుకోలేదు. సంప్రదాయంలో పెరిగిన పిల్ల. పెళ్ళి సంబంధాల కోసం చూస్తున్నారు. తల్లిదండ్రులు. నేను వివరాలు కనుక్కోగా, రాజేశ్వరి తనకు పుట్టిన కవలల్లో ఒకామె అనీ, చిన్నతనంలో రెండో అమ్మాయిని దొంగలెత్తుకు పోయారనీ రాజేశ్వరి తల్లి చెప్పింది.

''మీరు చెప్పేది నిజమైతే, మీ రెండో అమ్మాయీ ఊళ్ళోనే ఉంది. ఆమె పేరు చిత్ర. ఆమె నా స్నేహితురాలు కూడా'' అన్నాను.

''నేను నమ్మలేకుండా ఉన్నాను బాబు'' అంది రాజేశ్వరి తల్లి.

''ఒక పర్యాయం మీకు నేను చిత్రను చూపిస్తాను'' అన్నాను.

''మళ్ళీ లేనిపోని ఆశలు చిగురుస్తున్నావు బాబూ నువ్వు!'' అందామె.

"ఆశ చిగురించడం గాదు. ఇది నిజం!" అన్నాను.

వాళ్ళింట్లో కాఫీ తీసుకుని బయటకు వచ్చాను.

# 7

సిటీ బస్సు దిగి, నా గదికి వెళ్ళాను. గది తలుపులు తెరిచే సరికి, "యస్ కమిన్!" అన్న మాటలు విన బడ్డాయి.

ఆ స్వరం నాకు పరిచితమైనదే. తలుపులు వేసి ముందుకు నడిచి "నీ కోసం ఊరంతా గాలిస్తుంటే నువ్విక్కడున్నావా చిత్రా!" అనడిగాను.

"నాకోసం గాలించడ మెందుకు? నన్ను కలుసుకోవడం అవసరమనిపించినపుడు నేనే నీ ముందు ప్రత్యక్షమవతాను కదా!"

"అవుననుకో, కానీ మరీ ఇలా దేవతలా ప్రవర్తించడం బాగోలేదు. కాస్త నీ అడ్రసిచ్చి పుణ్యం కట్టుకోరాదూ" అన్నాను చిరాగ్గా.

"నీకా? అడ్రసివ్వడమా? ఒక్క క్షణంలో ఊరంతా టాంటాం అయిపోదూ?" అంది చిత్ర నిరసనగా.

"అదేమిటి?" అన్నా నాశ్చర్యంగా.

"తెలియనట్లు మాట్లాడకు. బొత్తిగా రహస్యమన్నది తెలీదు నీకు. లేకపోతే కలిసినవాళ్ళందరితోనూ అన్ని సంగతులూ చెబుతావా?" అంది చిత్ర.

"ఎవరితో చెప్పాను, ఏం చెప్పాను?" అడిగాను.

"సుందర్రావుపేట వెళ్ళావు. అక్కడ కనిపించిన ముసలాయనకు నా పేరు చెప్పావ్. నన్నా ఇంట్లో ఫలానా రోజున కలుసుకున్నాననీ చెప్పావు. అవునా?"

"అవును. కానీ కలుసుకుని ఏం మాట్లాడుకున్నామో

చెప్పలేదు. కలుసుకున్నాక ఏం జరిగిందో చెప్పలేదు."

"ఆ ముసలాయన కొడుకు పోలీసాఫీసరు. ఆమాత్రం క్లూ ఉంటే నువ్వు చెప్పకపోయినా మిగతా విషయాలు కనుక్కోగలుగుతాడు."

"అటువంటప్పుడు నన్ను నువ్వు బాగా హెచ్చరించాల్సింది. అయినా అది పోలీసాఫీసరిల్లని నాకేం తెలుసు."

"మరెన్నడూ ఆ ఇంటికి వెళ్ళొద్దని చెప్పాను. నా హెచ్చరిక పాటించావా?"

నా బుర్రలో ఏదో మెరిసినట్లయింది. "అవునూ, ఒక్క సందేహం. నేను పోలీసాఫీసరింటికి వెళ్ళడం నీకు తెలిసింది. అక్కడేం మాట్లాడేవో నీకు తెలిసింది. నేను వెతికేది నీకోసమే అసలు. అటువంటప్పుడు నన్నాపడానికెందుకు ప్రయత్నించలేదు?" అన్నాను.

చిత్ర సమాధానమివ్వలేదు. "ఆ తర్వాత రాజేశ్వరిని కలుసుకుని ఆమెదగ్గరా అలాగే మాట్లాడేవు!" అంది మళ్ళీ నిష్ఠూరంగా.

"ఇవన్నీ నీకెలా తెలుస్తున్నాయి చిత్రా!"

చిత్ర నవ్వింది. "అది నీకర్థంకాదు. నిన్నరాత్రి నీ గదికి పోలీసులొచ్చారు. గది గాలించారు. వాళ్ళకేమీ దొరకలేదు. అయితే ఇక్కడుండవలసిన వజ్రాలేమయ్యాయని నీ కంగారు. నీ బంగారం పోయిందేమోనని బెంగ. అయినా మళ్ళీ మొద్దునిద్ర పోయావు. నువ్వు నిద్రపోతున్న సమయంలో గుండూరావొచ్చి తను తీసుకుపోయిన వజ్రాలనూ, బంగారాన్నీ తిరిగి సూట్ కేస్‌లలో పెట్టేశాడు. ఉదయం లేచి నువ్వు సూట్ కేసు తెరచివుంటే నాకోసం వెతుక్కుంటూ పోలీసాఫీసరింటికి వెళ్ళాల్సిన అవసరం

తప్పేది! ఆ తర్వాత రాజేశ్వరిని కలుసుకోవాల్సిన అవ
సరమూ తప్పేది!''

''రాజేశ్వరి నీకు తెలుసా?'' అన్నా నాశ్చర్యంగా.

''అందరూ నాకు తెలుసు. ఇకమీదట ఎన్నడూ రాజే
శ్వరిని చూసి నేననుకుని పొరబడకు. నీకొక చిన్న ఆన
వాలు చెబుతున్నాను. నా కుడిచెవి క్రిందుగా పరీక్షగా
చూస్తే ఒక పుట్టుమచ్చ కనబడుతుంది. రాజేశ్వరికా
మచ్చలేదు. రెండవది నేను కట్టుకున్న బట్టల కనుగుణంగా
బొట్టు రంగు మారుస్తూంటాను. రాజేశ్వరి ఎప్పుడూ ఎర్ర
బొట్టే పెడుతూంటుంది. ఈ రెండు విషయాలూ తప్పక
గుర్తుంచుకోవాలి'' అంది చిత్ర.

సరేనని వెళ్ళి సూట్ కేసులు తెరిచి చూశాను.
వజ్రాలూ, బంగారం అలాగే వున్నాయి. మళ్ళీ సూట్
కేసులు మూసేశాను. అంతలో తలుపు చప్పుడయింది.

''ఎవరై వుంటారు?'' అంది చిత్ర.

''తెలియదు'' అంటూ వెళ్ళి తలుపులు తీశాను.

రాత్రి వచ్చినవాళ్ళే. పోలీసులు! ఈసారి మాట
మాత్రం అనకుండా వాళ్ళు సూట్ కేసుల దగ్గరకు పరు
గెత్తారు. చిత్ర వాళ్ళవంక తీక్షణంగా చూసి ''ఆగండి!''
అంది.

ఆగారు పోలీసులు.

''ఏమిటి మీరు వెతుకదల్చుకున్నది?'' అంది చిత్ర.

''ఈ గదిలో కోట్లు విలువచేసే వజ్రాలున్నాయని
వార్త వచ్చింది.''

''నిన్న రాత్రికూడా ఈ వార్త మీకు వచ్చింది.
అప్పుడు మీకేం కనబడింది?''

"ఖాళీ సూట్ కేసు."

"తెరవండి, ఇప్పుడూ అదే కనపడుతుంది" అంది చిత్ర. ఆమె వారివంక చూసే చూపులు చాలా చిత్రంగా వున్నాయి. పోలీసులు పెట్టె తెరిచి మళ్ళా మూసేశారు. గదంతా సోదాచేసి సారీ చెప్పి వెళ్ళిపోయారు.

నా ఆశ్చర్యానికి అంతులేదు. తలుపులువేసి ఒక్క ఉదుటున వెళ్ళి సూట్ కేస్ తెరచి చూశాను. మిలమిల మెరిసే, ధగధగలాడే వజ్రాలు!

"ఏమిటిది చిత్రా?" అన్నా నాశ్చర్యంగా.

"హిప్నాటిజం" అంది చిత్ర నవ్వుతూ.

"బాప్ రే. నమ్మడం చాలా కష్టం!" అన్నాను.

"కళ్ళారా చూశావు" అంటూ చిత్ర లేచింది. "ఇక పొరబాటున కూడా నీ గదికి పోలీసులు రారు. వస్తాను మరి!"

ఆమె వెళ్ళిపోతానంటే భయం వేసింది. కానీ ఆమె ఉంటుందన్నా భయంగానే ఉంది. చిత్ర చర్యలు చూస్తూంటే ఆమె మనిషేనా అని ఒక్కోసారి భయం కలుగుతోంది నాకు.

# 8

నా దగ్గరున్న కొంత బంగారాన్ని క్యాష్ చేశాను. సిటీలో ఒక ఫ్యాన్సీ దుకాణం ఓపెన్ చేశాను. ఈ రెండు పనులూ చేయడానికి వారంరోజులకంటే పట్టలేదు. అయితే నాలుగురోజులని చిత్ర చెప్పింది కానీ, పదిహేను రోజులైనా ఆ వజ్రాల సూట్ కేసుకి నా దగ్గర్నుంచి విముక్తి లభించలేదు.

చిత్రను అడిగితే సమయం రావాలని చెప్పింది.

మరోవారం గడిచింది. ఇంకా సమయం రాలేదంది చిత్ర.

దానిగురించి ఆలోచించడానికూడా నాకాట్టే వ్యవధి కనిపించడం లేదు. ఇప్పుడు నాకు కాలక్షేపం బాగానే వుంది. ఫ్యాన్సీ దుకాణంతో గంటలు క్షణాల్లా గడిచిపోతున్నాయి.

ఒకరోజు సాయంత్రం అయిదుగంటల ప్రాంతంలో నా షాపుకు రాజేశ్వరి వచ్చింది. ఆమె పెట్టుకున్న ఎర్ర బొట్టూ, కుడిచెవి కింద లేని మచ్చా ఆమెను నాకు పట్టిచ్చాయి. "హలో రాజేశ్వరిగారూ!" అంటూ పలకరించాను.

ఆనాడు వాళ్ళింటికెళ్ళాక రాజేశ్వరిని చూడడం మళ్ళీ ఇదే!

"బాగానే గుర్తు పట్టారే, ఈ షాపు మీదా?" అందాశ్చర్యంగా రాజేశ్వరి.

"నాదే" అన్నాను సగర్వంగా.

"ఎన్నాళ్ళయింది ప్రారంభించి?" అనడిగింది.

చెప్పాను. నవ్వి "వ్యాపారంలో పడ్డాక చిత్ర వ్యాపకం తగ్గిందనుకుంటాను. లేకపోతే నన్ను మీరు చిత్రా అని పిలవ్వలసింది" అంది.

"అదేం కాదు. చిత్రకూ, మీకూ ముఖ్యమైన రెండు తేడాలున్నాయి. ఆ విషయం నాకు చిత్రే చెప్పింది. అందువల్లే మిమ్మల్ని సులువుగా గుర్తించగలిగాను."

"బాగుందండీ. ఆ చిత్రకు నేను తెలుసునన్నమాట."

"మీరేమిటి? ఈ ప్రపంచంలో ఆమెకు తెలియనివాళ్ళు లేరు."

"ప్రతీకించారు. అయితే ఆమె మనిషి కాదన్నమాట. ఏ ఊరి అమ్మవారండీ ఆవిడ" అంది రాజేశ్వరి వెటకారంగా.

"అమ్మవారు కాదు. అవతారం!" అన్నాను.

ఇంతలో మరో బేరం వచ్చింది. రాజేశ్వరి మాత్రం ఇంకా నిలబడే వుంది. బేరం చూసుకున్నాక, "ఇంతకూ మీకేం కావాలో చెప్పండి!" అనడిగాను.

"కొత్త షాపు గదా, ఏమున్నాయో చూద్దామని వచ్చాను. మీరు కనబడ్డారు. ఇంక చూడ్డానికేముంది?"

"మీ అమ్మగారు కులాసానా?"

"ఆఁ నాన్నగారుకూడా కులాసానే, మరి వస్తాను" అంటూ వెళ్ళబోయింది రాజేశ్వరి.

"అరే, ఏదైనా తీసుకువెళ్ళండి" అన్నాను.

"ఏం తీసుకోనా అని ఆలోచిస్తున్నాను."

"బొట్టు పెన్సిల్స్ తీసుకోండి."

"తోపురంగు వున్నాయా?"

"ఆహా" అంటూ ఒక ప్యాకెట్ ఆమె ముందుంచాను. ఆమె అందులోంచి ఒక పెన్సిల్ తీసుకుని, "ఎంత?" అనడిగింది.

"మీకు నేనే అమ్ముతానా? తీసుకోండి" అన్నాను.

ఇద్దరు యువకులు షాపులోకి వచ్చారు. పెన్నులు కావాలని చూసుకుని కాసేపు బేరాలాడి చివరకు నేను చెప్పిన ధరకే కొనుక్కుపోయారు.

"బేరాలు బాగానే వున్నాయి కానీ, పెన్సిలు ధర చెప్పండి!" అన్నది రాజేశ్వరి.

"ధర కాదండీ, అది గిఫ్టు."

"గిఫ్టయితే పెన్సిల్ వద్దు, కాస్మెటిక్స్ తీసుకుంటాను."

"మీ ఇష్టం."

"డబ్బు తీసుకునే పక్షంలో."

"అలా అయితే నేనేమీ ఇవ్వను."

"ఇలా అయితే మీ వ్యాపారం మూన్నాళ్ల ముచ్చటే అవుతుంది."

"భలేవారే. మీలాంటి అందమైన అమ్మాయి నా షాపులో ఓ గంటసేపున్నదంటే చాలు. బేరాలమీద బేరాలు..." అంటూండగా మరో నలుగురు యువకులు షాపులోకి వచ్చారు, రెండద్దాలూ, రెండు దువ్వెనలూ కొనుక్కు వెళ్ళారు.

"అదా సంగతి! ఇంకా మీరు నిజంగానే ఉదార స్వభావులనుకున్నాను" అంది రాజేశ్వరి మూతి ముడిచి.

"తెలిసిందిగదా! మరి మీ క్కావలసినవి తీసుకోండి" అన్నాను!

"పెన్సిల్ చాల్లెండి" అంటూ ఆమె పెన్సిల్ తీసుకు వెళ్ళిపోతూ "ఆదివారం మీ షాపుకి సెలవనుకుంటాను, గాంధీ పార్కుకి సాయంత్రం రాగలరా?" అనడిగింది.

"ఎన్ని గంటలకి?"

"ఆరు సరిగా ఆరు" అని వెళ్ళిపోయిందామె.

ఒకనాడు నాతో తిరస్కారంగా మాట్లాడిన రాజేశ్వరి ఈరోజు నన్ను ప్రేమగా ఆహ్వానించింది. ఇదో వింత మలుపు నా జీవితంలో.

# 9

ఆదివారం, సాయంత్రం, ఆరు గంటలు...

సరిగ్గా ఆరు గంటలకు రాజేశ్వరి వచ్చింది ఎదురు చూస్తున్న నా దగ్గరకు.

నన్ను చూస్తూనే నవ్వింది. నేనూ నవ్వాను.

దగ్గరగా వచ్చింది. "రండి, అలా లాన్‌లో కూర్చుందాము" అంది. ఇద్దరం లాన్‌లో కూర్చున్నాం.

"ఏమిటి విశేషం?" అనడిగాను.

"మీ బొట్టు పెన్సిల్‌కు థాంక్స్ చెబుదామని."

"దానికింత దూరం రావాలా?"

"నా కోసం ఇక్కడకు రావడానికి మీకు చాలా కష్టమనిపించిందనుకుంటాను. అందుకే ఇంత దూరం రావాలా? అనడిగారు."

"అబ్బే అదేం కాదు" నసిగాను. "నేనిచ్చినది గోరంతలు, కొండంతలు చేస్తే ఇబ్బంది అనిపించి..."

"ఆడదాన్ని కదా..." నవ్వింది రాజేశ్వరి.

"అదే విశేషం! నేనిచ్చిన అతి చిన్న కానుక గురించి ఇంత ఇది చేసిన మీ రాడది కావడం నా సంతోషాన్ని పెంచింది" అన్నాను ఒక్క క్షణం ఆలోచించి.

"ఇప్పుడు నేను పెట్టుకున్న బొట్టు మీ షాపులోనిదే మీ కానుకే!"

నేనేం మాట్లాడలేదు.

"బొట్టుకు పెన్సిల్ వాడే అలవాటు లేదు నాకు. మీరే ఆ అలవాటు చేశారు" అంది రాజేశ్వరి మళ్ళీ.

"నా కానుకను మన్నించినందుకు ధన్యుణ్ని."

"నా ఆహ్వానాన్ని మన్నించినందుకు నేనూ ధన్యురాలి నయ్యాను."

ఏమిటో సంభాషణ చప్పగా ఉన్నదనిపించింది. ఇలా ఒకరి నొకరు అభినందించుకుంటూ కూర్చోడం కంటే దెబ్బలాడుకోవడం, మాటకు మాట అనుకోవడమే సర

దాగా ఉంటుంది నాకు.

రాజేశ్వరి నావైపు అదోలా చూస్తోంది. ఆమె వంక సూటిగా చూశాను. ఆ కళ్ళు ఏమేమిటో చెబుతున్నాయనిపించింది. కళ్ళ భాషను కళ్ళలోనే జవాబివ్వాలనుకుంటే నా కళ్ళకు మాట్లాడ్డం వచ్చునో రాదో నాకు తెలియదు. కానీ నేనూ ఆమె వంక అదోలా చూస్తూనే ఉన్నాను.

అలా ఒక గంట గడిచేక నేనే లేచాను. రాజేశ్వరి కూడా లేచింది.

“ఎన్నో మాట్లాడదామనుకున్నాను. కానీ మాటలు రాలేదు” అంది రాజేశ్వరి.

“ఒక్కోసారి అలాగే అవుతుంది. ఇలా కలుసుకోవటం మొదటిసారి గదా, మరోసారి కలుసుకుంటే ఇంకాసిని మాటలొస్తాయి. ఇంకోసారి కలుసుకుంటే ఇక అన్నీ మాటలే” అన్నాను.

రాజేశ్వరి నవ్వి “మనం మళ్ళీ మళ్ళీ ఇలా కలుసుకుంటామంటారా?” అంది.

“మీ కభ్యంతర ముండని పక్షంలో నా కిష్టమే!” అన్నాను.

అప్పటి కిద్దరం విడిపోయాం.

ఇంటికి వెళ్ళే సరికి గదిలో ఉత్తర మొకటి పడి వుంది. తీసి చదివాను. ఇంటి దగ్గర్నుంచి వచ్చింది. చెల్లాయికి పెళ్ళి చూపులు జరిగాయట. పెళ్ళికొడుక్కి పిల్ల నచ్చినట్లే అనిపిస్తోంది. కట్న కానుకల విషయంలో కూడా మాటలు సంతృప్తికరంగా జరిగినట్లే అనిపిస్తోందా వుత్తరం చూస్తుంటే. వారం రోజుల్లో మళ్ళీ ఉత్తరం రాస్తానని రాశారు నాన్నగారు.

# 10

"సమయం వచ్చింది గోపాల్!" అంది చిత్ర ఒక ఆదివారం పుదయం ఎనిమిది గంటల ప్రాంతాల నా గదికి వచ్చి.

"ఏ సమయం?" అనడిగాను.

"నీ గదిలోని వజ్రాలను కదల్చవలసిన సమయం."

"అమ్మయ్య!" అంటూ నిట్టూర్చాను.

"రేపే" అంది చిత్ర.

"రేపే, ఏం చేయాలి?" అనడిగాను.

"ముందు నువ్వు వేషం మార్చుకోవాలి. ఆ తర్వాత వజ్రాలున్న సూట్ కేస్ తీసుకోవాలి. విశ్వనాథపురం వెళ్ళాలి. అక్కడ బస్టాప్ దగ్గరే ఒక రెండతస్తుల మేడ వుంది. అందులో అడుగు పెట్టాలి. అక్కడ నీకు ఎవరు కనబడి ఏం చెప్తే అలా ప్రవర్తించాలి."

"ఆ తర్వాత?"

"నీకు రెండు లక్షలు ముడతాయి. నీ ఇచ్ఛ వచ్చిన రీతిలో జీవితాన్ననుభవించవచ్చు. ఇంక నిన్ను దొంగల ముఠావారు కానీ, స్మగ్లింగ్ రాకెట్ వారుకానీ బాధించరు. నీ ఫ్యాక్టరీ సాపు మూసేసినా బాధ లేదు. కాని..."

"ఊఁ...ఇంకా...కానీ ఏమిటి?" అన్నాను.

చిత్ర కళ్ళల్లో నీళ్ళు కనబడ్డాయి. "మరి చిత్ర నీకు కనిపించదు" అంది.

"అదేమిటి?"

"అదంతే! ఆ భవనంలోంచి నువ్వు బయట అడుగు పెట్టేక ఈ జన్మలో చిత్రను చూడలేవు."

నా మనసు బాధగా అయిపోయింది. "ఇటువంటిది అని వర్ణించి చెప్పడానికి వీల్లేని అనుబంధం మనది చిత్రా! నువ్వు మరి నాకు కనిపించవన్న విషయాన్ని నేను నిజంగా నమ్మలేను. నమ్మి బ్రతకలేను. నువ్వు చెప్పేదే నిజమైతే నేనా భవంతిలో అడుగే పెట్టను" అన్నాను.

"నువ్వా భవనానికి వెళ్ళితీరాలి. లేకపోతే చిత్ర ఈ లోకంలోనే వుండకపోవచ్చు" అంది చిత్ర.

"ఏమిటి నువ్వనేది?" అన్నానాశ్చర్యంగా, భయంగా.

"నన్నేమీ అడగొద్దు. నా వృత్తి రహస్యం ప్రాణం పోయినా చెప్పను నేను" అంది చిత్ర.

"ఏం చెప్పినా ప్రాణాలుండగానే చెప్పాలి. ప్రాణం పోయాక ఎవరు మాత్రం చెప్పగలిగేదేముంది?" అన్నాన్నేను.

"అలాగనకు. ఒకోసారి శవాలు కూడా మాట్లాడతాయి. అనుభవం తక్కువ నీకు. ఆవేశం ఎక్కువ. నేను చెప్పిన కార్యం ముగించేకనైనా తెలివిగా బ్రతకడం నేర్చుకోవాలి నువ్వు" అంది చిత్ర.

నా మనసు ఏదో తెలియని బాధకు లోనైంది. మన సంతా దిగులుగా వుండిపోయింది.

# 11

"సార్! టెలిగ్రామ్."

పోస్టుమాన్ నా చేత సంతకం చేయించుకొని, టెలిగ్రాం ఇచ్చి వెళ్ళిపోయాడు.

నాన్నగారి దగ్గర్నుంచి. తక్షణం బయలుదేరి రమ్మనమని వుంది.

ఏమిటో విశేషం. కాస్త భయం కూడా వేసింది.

అంతలోనే గుర్తొచ్చింది నా బాధ్యత.

సాయంత్రం అయిదు గంటలకు సరిగ్గా అయిదు గంటలకు విశ్వనాథపురంలోని ఒక భవనంలో ఉండాలి నేను.

టైము చూసుకున్నాను. పన్నెండు ముప్ఫై అయిదు అయింది.

ఎక్కువసేపు ఆలోచించలేదు నేను. అయిదు నిముషాల్లో డ్రెస్సయ్యాను. వజ్రాలున్న సూట్ కేస్ తీసుకున్నాను. రోడ్డు మీదకు వచ్చాను. హోటల్లో దొరికింది మెక్కాను. తర్వాత మా వూరికి రానూ పోనూ వచ్చే కండిషన్ మీద ఎనభై రూపాయలకో టాక్సీ బేరమాడాను.

సరిగ్గా పావు తక్కువ రెండు గంటలకు నేను మా వూరిలో వున్నాను.

నేను వెళ్ళేసరికి ఇంట్లో అందరూ నిద్ర పోతున్నారు. నన్ను చూసి ఆశ్చర్యాన్ని ప్రదర్శించారు. "టెలిగ్రాం చూసుకు వచ్చాను" అన్నాను.

"టెలిగ్రాం ఏమిటి?" అన్నారు నాన్నగారు.

నేను జేబులోంచి రెండువందల రూపాయల నోట్లు తీసి నాన్నగారికిచ్చాను. "అర్జంటు పనుంది. మళ్ళీవస్తాను. అన్ని వివరాలూ అప్పుడు మాట్లాడుకుందాం" అన్నాను.

వాళ్ళింకా ఆశ్చర్యంలోంచి తేరుకునే లోపల టాక్సీ ఎక్కాను.

టాక్సీ దూసుకుపోతోంది. ఇరవై నిముషాలు గడిచాయి. నిర్మానుష్యమైన ఆ రోడ్డు మీద ఎవరో అడ్డంగా నిలబడి ఉన్నారు. దూరాన్నుంచీ హారన్ మ్రోగిస్తున్నాడు టాక్సీ డ్రైవర్. కానీ పని జరగలేదు. ఆ వ్యక్తి అలాగే రోడ్డుకి

అడ్డంగా నిలబడి ఉన్నాడు. చేత్తో టాక్సీని ఆపమని సైగ చేస్తున్నాడు.

టాక్సీ ఆగింది. "దార్లో చిక్కిపోయాను. లిఫ్టుకోసం" అన్నాడతను.

"సరే ఎక్కండి!" అన్నాను.

అతను టాక్సీ ఎక్కాడు. టాక్సీ కదిలింది.

"టెలిగ్రాం అందిందా?" అనడిగాడు నూతనవ్యక్తి.

"ఏ టెలిగ్రాం?" ఆశ్చర్యంగా అడిగాను.

"మీకా టెలిగ్రాం నేనే ఇచ్చాను. కానీ అంతతొందరగా బయల్దేరి వెళ్ళిపోతారనుకోలేదు. ఏమైతేనేం తిరుగు ప్రయాణంలోనైనా దొరికారు" అన్నాడతను.

"ఎవరు మీరు?"

"పేరుమోసిన వజ్రాల దొంగని." అన్నాడతను.

టాక్సీ ఆగింది.

"మీ టాక్సీ డ్రయివర్ బుద్ధిమంతుడు. మీ దగ్గరున్న సూట్ కేస్ నా కిచ్చేయండి. మీ గది వెతికే వచ్చాను. అక్కడ లేవు. చెప్పిన మాట వినకపోతే మీ ప్రాణాలు గాల్లో కలిసిపోతాయి." అన్నాడతను.

అతని చేతిలో రివాల్వర్ ఉంది. నేను సీటు క్రిందకు చేయి పెట్టాను సూట్ కేసు లాగుదామని. చేతికి ఏదో కాగితం లాంటిది తగిలింది. తీశాను.

"దారిలో ఎవరైనా నిన్నటకాయిస్తే, నీ సూట్ కేసులో ఉన్నవి వజ్రాలు కాదు, బొమ్మ రాళ్ళని చెప్పు. నన్ను తల్చుకుని వాళ్ళ కళ్ళలోకి చూడు. —చిత్ర" అని ఉందా కాగితంలో.

"ఏమిటది?" అడిగాడా వ్యక్తి అనుమానంగా.

"ఏమీ లేదు. బొమ్మరాళ్ళున్న సూట్ కేసు దొంగలించడం కోసం రివాల్వర్ చూపించే మూర్ఖులుంటారా అని?" అన్నాను.

"ఇలాంటి కబుర్లు చాలా విన్నాను. ట్రిక్కులు చాలా చూశాం. మర్యాదగా సూట్ కేసు బయటకు తీయి." అన్నాడావ్యక్తి.

తీశాను. అతను రివాల్వర్ నా వంటికి తగిలించాడు. సూట్ కేసు మూత తెరిచాడు. నేను మాత్రం కళ్ళుమూసుకొని ఉన్నాను ఏం జరుగుతున్నదీ తెలియక. అతను మళ్ళీ సూట్ కేస్ మూసేశాడు. టాక్సీ దిగి, బై అన్నాడు. నేను ఒకసారి టాక్సీ దిగాను. అతనెటువెళ్ళాడో చూద్దామని. కానీ క్షణంలోనే అతను కనుమరుగై పోయాడు.

టాక్సీ కదిలింది.

సూట్ కేస్ నా దగ్గరే ఉంది. అందులో వజ్రాలూ ఉన్నాయి. ఆ వ్యక్తి సూట్ కేస్ ఎందుకు వదిలి పెట్టాడో తెలియదు. చిత్ర రాసిన ఉత్తరమెలావచ్చిందో తెలియదు. అన్నీ ఆశ్చర్యంగానే ఉన్నాయి.

గోపాలపురంలో టాక్సీ ఆగింది. నేను సూట్ కేస్‌తో టాక్సీ దిగాను. టాక్సీ డ్రైవర్ దగ్గరకు వెళ్ళాను డబ్బులివ్వడానికి. "నీ జీవితంలో అతి ముఖ్యమైన పని చేయబోతున్నావ్ గోపాల్! ఒళ్ళు దగ్గరుంచుకో. నీ జేబులో కాగితముంటుంది. ఆ ప్రకారం అన్నీ మాట్లాడి పని సక్రమంగా ముగించుకు రా" అన్నాడు డ్రైవర్. టాక్సీ కదిలి వెళ్ళిపోయింది బాడుగ తీసుకోకుండానే. నేను విస్తుపోయాను.

ఆ కంఠం పరిచితమైనదే. చిత్రది!

వాచీ చూసుకున్నాను. మూడుంపావు కావస్తోంది టైము.

# 12

సరిగ్గా అయిదు గంటలకు విశ్వనాథ పురంలోని రెడ్డి దంతస్తుల భవనం ముందు నిలబడి కాలింగ్ బెల్ మ్రోగిం-చాన్నేను. చేతిలో సూట్ కేస్! జేబులో రక్షించుకు నేందుకేవిధమైన ఆయుధం లేదు.

తలుపులు తెరచుకున్నాయి. పాంటూ షర్టు వేసుకున్న ఒక వృద్ధకాయుడు "రండి లోపలకు" అన్నాడు. లోపలకు అడుగు పెట్టాను. నా వెనుక తలుపులు మూసుకున్నాయి.

"అయ్యగారు మేడమీదున్నారు." అన్నాడా వృద్ధకాయుడు.

మెట్లెక్కాను. అక్కడొక అందమైన అమ్మాయి. నా చేయి పట్టుకుని "రండి. అయ్యగారి గదిలోకి తీసుకెడతాను" అందామె. ముందుకు నడిచాను.

ఇద్దరం ఒక ఎయిర్ కండిషన్డు గదిలో అడుగుపెట్టాం. అక్కడ చూశాను. మెత్తటి కుర్చీలో కూర్చున్న సుమారు నలభై ఏళ్ళ వ్యక్తిని. అతన్ని ఎప్పుడూ ఎక్కడా చూసిన గుర్తు లేదు.

"కమాన్ కింగాఫ్ స్మగ్లర్స్" అన్నాడతను.

ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ ముందడుగు వేశాను. ఆ అమ్మాయి నా చేయి వదలి పెట్టింది. గదిలోంచి బయటకు వెళ్ళిపోయింది.

ఆ గదిలో ఇప్పుడు ఇద్దరే ఉన్నాం. నేనూ, అతనూ!

"రండి. కూర్చోండి. మీకు నా హృదయపూర్వక సుస్వాగతం."

అతను లేచి నిలబడ్డాడు. నేను అతని దగ్గరగా వెళ్ళాను. ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చునే ముందు టీపాయ్ మీద సూట్ కేస్ పెట్టాను.

ఇద్దరం కూర్చున్నాం. అతను ఆత్రంగా సూట్ కేస్ పెన్ చేశాడు.

"ప్లీజ్. వాటిని తాకవద్దు." అన్నాను.

"ఏం?" అన్నాడతను.

"వజ్రాలన్నింటినీ స్పెషల్ పాయిజన్ లో ముంచి తీశాం. ముట్టుకోవటం మీ ఆరోగ్యానికి మంచిది కాదు." అన్నాను.

"మరి?" అన్నాడతను.

"ఎల్లుండి పోస్టులో మీకు ఉత్తరం వస్తుంది. అందులో విషానికి విరుగుడేమిటీ అన్నదాని గురించి వివరంగా ఉంటుంది. అంతవరకూ మీరా వజ్రాలను తాకలేరు."

"ఐసీ" అతను సాలోచనగా తలపంకించాడు. "అయితే ఆ ఉత్తరం వచ్చేవరకూ మీరిక్కడ బలవంతంగా ఉంచబడితే."

"నోనో. నేను బయటకు పడితే గాని ఉత్తరం రాదు. ఉత్తరం నేనే స్వయంగా రాసి పోస్టు చేస్తాను. ఎటొచ్చీ విషానికి సంబంధించిన వివరాలు తెలిసినతను వేరే ఉన్నాడు. అతను చెప్పగా నేను రాస్తానన్నమాట!"

"నన్ను నమ్మడం లేదన్న మాట మీరు."

"ఇది నమ్మకానికి సంబంధించిన విషయం కాదు. నా జాగ్రత్తలో నేనుంటున్నాను. నేను చెప్పిన అకౌంట్లకు డబ్బు క్రెడిట్ చేసినట్లు సమాచారం అందగానే మీ కుత్తరం రాస్తాను."

"ఇవి అసలు సిసలు వజ్రాలని నమ్మకమేమిటి?"

"అది తెలుసుకోగల సమర్థత నీ కున్నదని నాకు తెలుసు" అన్నాను.

అతను నవ్వి, తన జేబులోంచి ఏదో యంత్రం తీశాడు. దాని ద్వారా పెట్టెలోనికి చూశాడు. యంత్రాన్ని అడ్జస్టు చేస్తూ ఓ అయిదు నిముషాలు తంటాలు పడ్డాడు. యంత్రాన్ని జేబులోకి తోసేసి సూట్ కేస్ మూసేసి, "రెండు కోట్ల నలభై నాలుగు లక్షలు టూ మచ్" అన్నాడు.

నేను నవ్వి, "ఆ తర్వాత మీ కస్టమర్ కూడా ఆరు కోట్ల అరవై ఆరులక్షలు టూ మాచ్ అనవచ్చు"అన్నాను.

"నేను లాభానికమ్ముతా ననుకుంటున్నారా?" అన్నాడతను.

"మీరేం చేసుకున్నా నాకవసరంలేదు. నాకు కావలసింది డబ్బు."

అతను నవ్వాడు. "అలాగంటే సరిపోదు. మీరు నాకు కావాలి."

"అంటే?"

"మీలాంటి పార్టనర్ కోసం ఎదురు చూస్తున్నాను మనలాంటి వాళ్ళం యిద్దరం కలిస్తే" అంటూ తమాషాగా నవ్వాడతను.

"నేనేమిటి? పార్టనర్ ఏమిటి? మా బాస్ చెప్పిన ప్రకారం సూట్ కేస్ ఇవ్వటానికి వచ్చాను. ఇచ్చాను. అంతే నా పని అయిపోయింది." అన్నాను.

"నా దర్శనం కోసం ఎందరో ప్రయత్నించి విఫలులయ్యారు. నే నెవ్వరికీ దొరకను. నా అంతవారని గ్రహించాక నే మిమ్మల్ని స్వయంగా రిసీవ్ చేసుకోదలిచాను. మీ శక్తి సామర్థ్యాలు పూర్తిగా గ్రహించాక

నా కార్యక్రమాలకు మీబోటివారి సహకారం లభించక పోవడం ఒక పెద్ద లోపమని గ్రహించాను'' అన్నాడతను.

''ఏమిటి నా శక్తి సామర్థ్యాలు బాస్ చెప్పినప్రకారం నడచుకోవడమా?''

''కాదు. ఏ పరిస్థితుల్లోనూ ఎవ్వరూ అనుమాన పడలేని విధంగా నటిస్తూ మీ వ్యవహారాలను నడిపించగలగడం పెద్ద విశేషం.''

''అది నటన కాదు-నిజం'' అన్నాను.

''అవును-పోలీసాఫీసరింట్లో మీ అనుచరులను కలుసుకోవడం నిజం. మీ ఇంటికి వచ్చిన పోలీసులకు కనబడకుండా వజ్రాలను దాచడం నిజం. మరో పర్యాయం హఠాత్తుగా పోలీసులు వస్తే హిప్నొటైజ్ చేసి వజ్రాలను కనిపించకుండా చేయడం నిజం'' అన్నాడతను.

''నా సంగతులన్నీ తెలుసుకుంటూనే వస్తున్నారన్న మాట!'' అన్నాను.

''అవును. మీ ముఠా మీద నేను చాలా కాలంగా నిఘా వేస్తూనే వచ్చాను. అయితే బాస్ ఎవరో తెలుసుకోలేకుండా ఉన్నాను. మీరేనని చూచాయగా నాకు తెలిసింది. కానీ నమ్మడం చాలా కష్టమనిపించింది. ఇప్పటికీ కష్టంగానే ఉంది. కానీ ఆ రోజు టాక్సీలో నా అనుచరుణ్ణి హిప్నొటైజ్ చేసేసరికి మరి నమ్మకుండా ఉండడం కూడా కష్టమే.''

నే నాశ్చర్యంగా అతని ముఖంలోకి చూస్తూ ఉండిపోయాను.

''అదిగో—అదే ఆ అమాయకత్వమే నాకు గానీ నా

అనుచరులకుగానీ చేతకాకుండా వున్నది. ఈ ఒక్క క్వాలిటీ వుంటే ప్రపంచాన్నే జయించగలను నేను. మీ ఊహాలూ, వ్యూహాలూ అద్భుతం. మీ చేతలూ, తెలివి తేటలూ అద్భుతం. మీ తెలివి తేటలకు నా జోహారు" అన్నాడతను.

"మీరు పొరబడుతున్నారని చెప్పడానికి విచారిస్తున్నాను" అన్నాను.

"మిస్టర్ గోపాల్! మనమిప్పుడు చర్చించవలసిన విషయం మీరు బాస్ అవునా కాదా అన్నది కాదు. మీరు నాతో పార్ట్నర్‌గా ఉంటారా, వుండరా అన్నదే!" అన్నాడతను.

ఏం చేయాలో, ఏమనాలో నాకు తోచలేదు. ఒక్క క్షణం ఆగి "ఆలోచించుకునేందుకు వ్యవధి కావాలి" అన్నాను.

"ఆ వ్యవధి మీ కిక్కడే లభిస్తుంది. మీ ఇష్టం వచ్చినంతసేపు ఆలోచించుకోండి" అన్నాడతను.

నేనాలోచిస్తున్నాను. అతను నా వంకే తీక్షణంగా చూస్తున్నాడు.

పది నిముషాలు గడిచేక "ప్రపంచానికి బ్యాలన్సు అవసరం. అమెరికా, రష్యా ఒకటైతే ప్రపంచంలోని చిల్లర దేశాల గతేమిటి? అలాగే మీరూ నేనూ ఏకమైనా అంతే. ఈ దేశంలోని చిల్లర దొంగలేమైపోవాలి? యునైటెడ్ నేషన్స్‌లాంటి పోలీసు శాఖేమైపోవాలి?" అన్నాను.

"నో నో! దానికీ దీనికీ పోలిక కుదరదు. అమెరికా పాలసీ వేరు, రష్యా పాలసీ వేరు. వాళ్ళ దారులు వేరు. కానీ మన దారులు ఒకటే!" అన్నాడతను.

"మన దారులు ఒకటే అయిన పక్షంలో ఇద్దరిలో ఒకరు వెనకపడి వున్నామన్న మాట. అంటే ఒకరు వేగం పుంజుకోవలసి వుంటుంది" అన్నాన్నేను.

"మీకు వేళాకోళంగా వున్నట్లుంది. నాతో వ్యవహారంలో వేళాకోళాలకు తావు లేదు. మీ అభిప్రాయం చెప్పండి."

"చెబుతాను. కానీ మీ ముఠాకు మీరే బాస్ అని నమ్మక మేమిటి? సరిసమానులతో కానీ నేను మాట్లాడను."

అతను నవ్వాడు. "కొన్ని కొన్ని అనుమానాలకు అర్థం లేదు. మీరు నన్ను తర్వాత మోసం చేయరని నమ్మక మేమిటి? అయినా మిమ్మల్ని నా ముఠాలో చేర్చుకుందుకు నేను సిద్ధపడడంలేదూ-అలాగే కొన్ని కొన్ని విషయాలను నమ్మి వూరుకోవలసిందే."

నేను నవ్వాను "నా ముఠాలో చేరినవాడు నన్ను మోసం చేయలేడు. అందుకు కావలసిన ఏర్పాట్లు నేను చేసుకున్నాను" అన్నాను.

"సరే, ఇప్పటికైనా బాస్‌నని ఒప్పుకున్నారు" అన్నాడతను నవ్వుతూ.

"మరి చేయి చేయి కలుపుదామా?"

నేను చెయ్యి జాపాను. అతను షేక్‌హ్యాండ్ ఇచ్చాడు.

"మరి వెడదామా-మా స్థావరానికి?" అడిగాడు.

ఒక్క క్షణం సంకోచించి, "వెడదాం పదండి!" అన్నాను.

అతని స్థావరం వూరికి చివర్లో లేదు. వూరికి కేంద్రం

అయిన గోపాలపురంలో మామూలుగా కనిపించే ఒక పెద్ద పెంకుటింట్లో వుంది. మే మా ఇంటికి వెళ్ళిన పది నిముషా లకు తలుపులు దబ దబా బాదిన చప్పుడయింది. ఏవేవో చూస్తూన్న నేనూ, చూపిస్తున్న అతనూ కూడా ఉలిక్కి పడ్డం జరిగింది. మామూలుగా వెళ్ళి అతను తలుపు తీశాడు.

పోలీసులు!

క్షణాలలో అతని చేతులకు అరదండాలు పడ్డాయి.

ఇంటి చుట్టూ బారులు తీరి పోలీసులున్నారు.

# 13

చెల్లాయికి పెళ్ళవుతోంది.

బావగారిని చూస్తోంటే ఎప్పుడో ఎక్కడో ఒక పర్యాయం చూశానా అనిపించింది. ఆయన నన్ను చూసి నప్పుడల్లా ముసి ముసిగా నవ్వుతున్నాడు.

ఏ గొడవలూ లేకుండా పెళ్ళి ముగిసింది. అంతా సద్దు మణిగాక నేనూ, బావగారూ ఇంటి వరండాలో కూర్చున్నాం చెరో కుర్చీలో.

"మిమ్మల్నెక్కడో చూసినట్లుంది బావగారూ!" అన్నాను.

"మీ సంగతి నాకు తెలియదు గానీ నేను మాత్రం మిమ్మల్ని నిత్యం చూస్తూనే ఉండేవాడిని" అన్నా డాయన.

"ఇంపాసిబుల్" అన్నాను.

"మీరలా అనుకోవడమే మంచిది. లేకపోతే నీకు నిజం తెలిస్తే చాలా రహస్యాలు బట్టబయలైపోతాయి. చిత్ర నిజమే చెప్పింది" అన్నాడాయన నవ్వుతూ.

"ఎలాగ?"

"ఎలాగా! ఓ కోటీశ్వరుడికి గారాల పుత్రిక వుంది. ఆమెకో రోజున తన తండ్రి పెద్ద స్మగ్లరని తెలిసింది. అంతేకాదు తన తండ్రికి డబ్బు మీద తప్ప వేటి మీదా ఆఖరికి కూతురు, మాతృభూమి మీద కూడా ప్రేమ లేదని తెలుసుకున్నాక తనకు తెలిసిన కొద్దిపాటి రహస్యాలతో అతి రహస్యంగా పోలీసులకు ఫిర్యాదు చేసింది. నేను రంగంలోకి దూకాను.

ఒక నకిలీ బాస్‌ను సృష్టించాం. కుందేలు, సింహం కథ తెలుసు గదా. చాలా సరుకు నకిలీబాస్ చేతిలోకి జారి పోతున్నట్లు నమ్మించాం. అందువల్ల ఆయన నకిలీ బాస్ కోసం అన్వేషించ సాగాడు. మీరే ఆ నకిలీబాస్.

తన కూతురు పోలీసుల మనిషి అని ఆ తండ్రి ఊహించ లేదు. మాకు పూర్తిగా ఆమె సహకారముంది. అందువల్ల ఎన్నో వ్యూహాలు జయప్రదంగా వేశాం. నకిలీ బాస్‌ను గొప్పవాణ్ణి చేశాం. చిట్టచివరకు ఆ కోటీశ్వరుడు మిమ్మల్ని కలుసుకుని తనే రింగ్ లీడర్ నని బయట పెట్టుకున్నాడు. మిమ్మల్ని తన స్థావరానికి తీసుకు వెళ్ళి అన్ని విధాలుగా దొరికి పోయాడు."

"మరి చిత్ర ఏమయింది?"

"ఆత్మ హత్య చేసుకుంది. తన ఆస్తినంతా రాజేశ్వరి పేరున రాసింది."

"నిజంగా?"

"అంతే కాదు. మేమా కోటీశ్వరుణ్ణి పట్టుకోడానికి వేసిన పథకాన్ని వెలుగులోనికి రానివ్వలేదు. ఈ విష యంలో తన సహాయాన్ని బాగా మరుగున ఉంచమని

చిత్ర కోరింది. ఈ విధంగా ఆ అద్భుతత్యాగమయి కథ తెరచాటునే ఉండిపోయింది.''

నా మనస్సు బాధతో నిండిపోయింది. చిత్ర మరణించిందంటే ఏమిటోలాగుంది. ఎంత గొప్ప వ్యక్తి ఆమె.

''బావగారూ ఒక్క సందేహం, మిమ్మల్ని కలుసుకుని ఉండకపోతే నా అనుభవాలకు జవాబులు దొరికి ఉండేవి కావు. మీరు చేసిన చాలా మిస్టరీలు పోలీసుల సహకారంతో జరిగినవే నని తెలుస్తోంది. అంటే హిప్నాటిజమన్నది అసత్యమన్నమాట. అవన్నీ అలాగుంచితే నాకో సందేహముంది. చిత్ర టాక్సీ డ్రైవర్ గా నాకు తోడొచ్చి స్మగ్లర్ అనుచరుణ్ణి ఎలా హిప్నొటైజ్ చేయగలిగింది?''

బావగారు నవ్వారు. ''అసలు వజ్రాల సూట్ కేసు ముందు సీట్లో చిత్ర దగ్గరుంది. తిరిగి మీరు టాక్సీ దిగి అతన్ని గమనిస్తూన్న సమయంలో ఆమె మీ స్థానంలో అసలు సూట్ కేసు నుంచింది. అంతే!''

''పోలీసులు నేననుకున్న దానికంటె తెలివైన వాళ్ళు'' అన్నాన్నేను.

''అందుకే వాళ్ళతో చెలగాటం మంచిది కాదు' అన్నారు బావగారు.

''అవునవును. ఫ్యాన్సీ దుకాణం ఉన్నవాణ్ణి. ఆ సంగతి బాగా గుర్తించుకోవాలి!''

''ఇంక మీకు ఫ్యాన్సీ దుకాణం కర్మేమిటి బావగారూ లక్షల ఆస్తితో రాజేశ్వరి మీ స్వంతం కాబోతూంటేనూ'' అంటూ నవ్వాడు బావగారు.

* * *

"నాకు నిజం తెలిసిపోయింది. మా బావగారన్నీ చెప్పేశారు" అన్నాను రాజేశ్వరితో.

"అన్నీ అంటే."

"మొత్తం అన్నీ. ఆఖరికి మీ గురించి కూడా."

"అయితే మీరు నన్ను ఇంకా ప్రేమిస్తున్నారా?"

"ఈనాటికీ ఏనాటికీ ప్రేమిస్తూనే ఉంటాను" అన్నాను నేను.

"ఒక మోసానాయకుడి కూతుర్ని అసహ్యించుకుంటారనుకున్నాను. తండ్రికే ద్రోహం చేసిన దుర్మార్గురాలిగా తృణీకరిస్తారనుకున్నాను" అంది రాజేశ్వరి.

"వాట్" ఉలిక్కిపడ్డాను. "అయితే నువ్వు చిత్రవా?"

ఆమెకూడా తడబడుతూ, "మీ బావగారు అన్ని విషయాలు చెప్పారన్నారు?" అంది.

నాకు అప్పుడోలేనంత నవ్వురాగా, "చిత్రా అన్నీ వివరంగా చెప్పేయ్. నిన్ను కాదనగల ధైర్యం ఏ పరిస్థితుల్లోనూ నాకుండదు" అన్నాను.

"చెప్పడానికేముంది? మీ బావగారు మీ డ్యూటీ నాకు అప్పగించిన అతి కొద్దిరోజుల్లోనే మిమ్మల్ని నేను ప్రేమించాను. అప్పుడే నిర్ణయించుకున్నాను, రాజేశ్వరి అనే పాత్రను సృష్టించి, ఆ పేరుతో మీ భార్యగా స్థిరపడదామని. చిత్ర పాత్రను మధ్యలోనే తొలగించేయదల్చుకున్నాను. అందుకే ద్విపాత్రాభినయం చేశాను."

"అయితే పుట్టుమచ్చ..."

"అది మీలో చిత్ర, రాజేశ్వరి వేరు అని బలపడడం కోసం నేనాడిన నాటకం."

"ఇంత తెలివైనదానివి నా స్వంతమవుతున్నావంటే ఏదో భయంగా కూడా ఉంది."

"అలాంటి భయాలు పెట్టుకోకండి. అందుకే ముందు జాగ్రత్తగా మీ చెల్లెలు మీ బావగార్ని బుట్టలో వేసుకుంది. మీ కుటుంబ వ్యవహారాలు ఆచూకీ తీయడానికి మీ ఊరు వెళ్ళి మీ బావగారు ప్రేమలో పడ్డారు" అంది చిత్ర.

"అదిసరే. మీ ఇద్దరూ ఎక్కడ కలుసుకుంటూండేవారు" అనడిగాను.

"మర్చిపోయారా? ఆయన అసలుసిసలు పాకహోటల్ యజమానిలా గుండేవారు. నే నాయనక్కడే ఏదో వంకతో కలుసుకునేదాన్ని."

ఉలిక్కిపడ్డాను. మొత్తం కథంతా మంచులా విడిపోయింది.

నేను నా పరువు నిలబెట్టుకోవడంకోసం సింగిల్ టీ హోటల్ ప్రొప్రయిటర్ని పిలిచి చిత్రను చూపిస్తే, అతను ముందు భుజాలు తడుముకున్నాడు. ఆ తర్వాత నన్ను నకిలీబాస్‌ను చేశాడు.

ఆనందంతో రాజేశ్వరిని కాదు, కాదు చిత్రను హృదయానికి గట్టిగా హత్తుకున్నాను.

—: ఐపోయింది :—

# చావు కబురు

విజయ్

నరహరి టాక్సీ దిగాడు. పర్సుతీసి టాక్సీ డ్రైవర్ కి అయిదు రూపాయిల నోటు అందించాడు. చిల్లర తీసుకున్నాడు. ఇంటివైపు నడవసాగాడు.

అతడు చాల హుషారుగా ఉన్నాడు. భార్యను రైలెక్కించి అతడు స్టేషనునుండి తిరిగి వస్తున్నాడు. ఇక పదిరోజులవరకూ తను సర్వస్వతంత్రుడు. ఈ పదిరోజులు మేనక కౌగిలిలో స్వర్గసౌఖ్యాలు అనుభవించవచ్చు.

మరో గంటలో మేనక తన ముందుంటుంది. తన భార్య మరీ చాదస్తురాలు. ఆమెను లాలించి బండెక్కించేసరికి తాతలు దిగొచ్చారు.

గుమ్మం దగ్గరే ఆగిపోయాడు నరహరి.

తాళం తీసుంది. కొంపదీసి దొంగలు పడలేదుకదా? కంగారుపడ్డాడు. లోపల లైటు వెలుగుతోంది. తలుపులు ఓరగా తెరిచి ఉన్నాయి. సంశయిస్తూనే లోపలికి అడుగు పెట్టాడు.

"ఏమిటింత లేటుచేసారు? మీ గురించి చాల సేపటి నుండి ఎదురుచూస్తున్నాను" ఈ మాటలన్నది ఎదురుగా సోఫాలో కూర్చుని చిరునవ్వులు చిందిస్తున్న యువకుడు.

నరహరి తెల్లబోయాడు. ఆ యువకుడు తనకు పూర్తిగా అపరిచితుడు. ఇంతకు పూర్వం ఎప్పుడూ చూసిన గుర్తు కూడ లేదు.

మెల్లిగా తేరుకుని "మీరు...?" అంటూ ప్రశ్నార్థకంగా చూసాడు.

"కంగారుపడకండి. మీరు నన్ను ఇదివరలో ఎప్పుడూ చూడలేదు. నాపేరు కాళీ. మీతో చాల ముఖ్యమైన పని ఉండి వచ్చాను."

'కాళీయో? పాళీయో? ఇతని పేరు ఏదైతే తన కెందుకు? ఇతడు తాళంవేసి ఉన్న తన ఇంట్లోకి ఎలా రాగలిగాడు?' లోలోనే అనుకున్నాడు నరహరి.

"తాళంవేసి ఉండగా మీరు లోపలికి ఎలా రాగలిగారు?" తమాయించుకుని అడిగాడు.

బదులుగా చిరునవ్వు నవ్వాడా యువకుడు.

"ఒక మహత్తర కార్యసాధనకు పూనుకున్న నాకు మీ ఇంటి తాళం తెరిచి లోపల ప్రవేశించడం పెద్ద కష్టమైన పనేమీ కాదు."

నరహరి మనసులో సవాలక్ష సందేహాలు మెదులుతున్నాయి. ఎవరితడు? దొంగా? దొంగయితే అందినవి

పట్టుకుని పారిపోక తనకోసం ఎందుకు కాచుకున్నాడు? తన మనసులోని భావాలేవీ ముఖంలో ప్రస్ఫుటంకాకుండా తగిన శ్రద్ధ తీసుకుంటూ "ఇంతకీ మీకేం కావాలి?" అన్నాడు విసుగును ప్రదర్శిస్తూ.

"కోప్పడకండి. చెప్తాను. తప్పకుండా చెప్తాను. ముందు అలా కూర్చోండి" కుర్చీ చూపించాడు కాళీ.

ఒళ్ళు మండిపోయింది నరహరికి.

తన ఇంట్లో దొంగతనంగా జొరబడింది కాక, తనకు మర్యాదలు చేస్తున్నాడు.

"సిగరెట్ ఉందా?" అడిగాడు కాళీ.

నరహరి జేబులోనుండి సిగరెట్ పేకెట్ బయటకు తీశాడు.

"అరె! ఒక్కటే సిగరెట్ ఉంది" అంటూ అది కాళీకి అందియ్యబోయాడు.

"ఒక్కటే ఉందా? అయితే అది మీరే కాల్చండి" అన్నాడు కాళీ.

"ఫర్వాలేదు. మీరు కాల్చండి," అన్నాడు నరహరి.

"లేదు. ఆ సిగరెట్ మీరే కాల్చాల్సిన అవసరం ఎంతయినా ఉంది. ఇదిగో! ఈలోగా నేనిది తింటాను" జేబులోనుండి కాడ్బరీస్ ఫైవ్ స్టార్ చాక్లెట్ బయటకు తీశాడు కాళీ.

అయోమయంగా చూస్తూ సిగరెట్ ముట్టించాడు నరహరి.

చాక్లెట్ నవుల్తూ మెల్లిగా అడిగాడు కాళీ.

"సిగరెట్ ఎలా ఉంది."

గట్టిగా దమ్ములాగి ముక్కులగుండా పొగ వదుల్తూ,

"ఏం అలా అడిగారు? సిగరెట్ తాగడం నాకేమీ కొత్తకాదే? మామూలుగానే ఉంది" కాళీని విచిత్రంగా చూస్తూ అన్నాడు నరహరి.

"ఎందుకంటే...?" ఒక క్షణం ఆగి నరహరి కళ్ళల్లోకి సూటిగా చూసాడు కాళీ.

"ఎందుకంటే ఇది మీరు జీవితంలో కాల్చే ఆఖరి సిగరెట్ కాబట్టి," తాపీగా అన్నాడు.

ఉలిక్కిపడ్డాడు నరహరి.

"అంటే?" కలవరపాటుతో అన్నాడు.

"అంటే... మీరు కాస్సేపటిలో చావబోతున్నారు. నేను మిమ్మల్ని చంపబోతున్నాను."

ఒక క్షణం గుండాగినంత పనయింది నరహరికి. చేతిలోని సిగరెట్ జారిపోయింది.

"ఏమిటి నువ్వనేది?" తడబడుతూ అన్నాడు.

"ఏమీ లేదు. వెరీ సింపిల్. కాళీ అనబడే నేను, నరహరి అనబడే నిన్ను చంపబోతున్నాను." ఏమాత్రం తొణక్కుండా అన్నాడు కాళీ.

అతడు తమాషాకు అనడంలేదని, సీరియస్‌గానే అంటున్నాడనీ అర్థమవుతూనే ఉంది నరహరికి.

ఎలాగైనా తప్పించుకోవాలి. ఎలా? నాలుగు అడుగులు వేస్తే గుమ్మం చేరుకోగలడు. తరువాత తను వీధిలో ఉంటాడు. గట్టిగా అరిస్తే చాలమంది పోగవుతారు. రకరకాల ఆలోచనలు అతని మెదడులో మెదులుతున్నాయి.

"ఏమిటి ఆలోచిస్తున్నావు? ఎలా తప్పించుకోవాలనా? అలాంటి పిచ్చి ఆశలేమీ పెట్టుకోక. బ్రహ్మదేవుడు కూడ

నిన్ను రక్షించలేదు." గట్టిగా నవ్వాడు కాళీ.

బిక్క మొగమేసాడు నరహరి.

ఒక క్షణమాగి, ఒక్క ఉదాటున లేచాడు. మెరుపులా బయటకు పరుగెత్తబోయాడు. కాని అతనికన్నా ముందు జాగ్రత్తతోనే ఉన్నాడు కాళీ యముడిలా నరహరికి అడ్డంగా నిలబడ్డాడు. అతని చేతిలో మెరుస్తున్న కత్తి. నరహరికి చెమట్లుపడుతున్నాయి. గట్టిగా అరవాలనుకున్నాడు. గొంతు పెగల్లేదు. ఆపాదమస్తకం వణికిపోతున్నాడు.

"కూర్చో" అన్నాడు కాళీ అతని గొంతు చాల కర్కశంగా ఉంది. అతని కళ్ళల్లోకి చూడలేకపోయాడు నరహరి. కాళీ కళ్ళల్లో నిప్పులు కురుస్తున్నాయి.

యాంత్రికంగా కుర్చీలో కూలబడ్డాడు నరహరి.

కత్తిమొన అతని గడ్డంకింద పదునుగా గుచ్చుకుంటోంది.

"నన్నెందుకు చంపాలనుకుంటున్నావ్?" హీన స్వరంతో అన్నాడు.

"చెప్తాను. ఈ ఫోటో చూడు. ఈమెను ఎప్పుడైనా చూసిన గుర్తుందా?" కాళీ ఎడమచేతిలో ఒక స్త్రీ ఫోటో ఉంది.

ఆమెను ఎరగనన్నట్లు తల అడ్డంగా తిప్పాడు నరహరి.

"సరిగ్గా చూడు. తప్పకుండా గుర్తొస్తుంది."

నరహరి మళ్ళీ చూశాడు. కళ్ళు రెపరెపలాడాయి. ఆమెను గుర్తుపట్టినట్లు అతని ముఖకవళికలు తెలియజేస్తున్నాయి.

"అవును... ఈమె... ఈమెకు నీకు ఏమిటి సంబంధం" గొణిగాడు నరహరి.

నొసలు చిట్లించాడు కాళీ. జుట్టు పైకెగరేసాడు. పెదాలు అదురుతున్నాయి. చూపుడువేలు కసిగా కొరికాడు.

"గుర్తొచ్చిందా? నేనెవరో తెలిస్తే భరించలేవు. ఇదిగో! అనుభవించు" అంటూ నరహరి పొట్టలో గట్టిగా పొడిచాడు, ఎడమచేత్తో నరహరి నోటిమీద గట్టిగా అదిమిపట్టాడు. కళ్ళు తేలవేసాడు నరహరి. మరో పోటు పొడిచాడు. కసిగా మరో పోటు. మరింత కసిగా మరో పోటు.

అంతే! నరహరి పరలోకానికి పయనం కట్టాడు. జీవం లేని అతని శరీరం కుర్చీలో ఒరిగిపోయింది.

నిటారుగా నిలబడ్డాడు కాళీ. కత్తికున్న రక్తాన్ని నరహరి చొక్కాతోనే తుడిచాడు. కత్తిని మడిచి జేబులో పెట్టుకున్నాడు. కిందపడివున్న ఫోటోను తీసి జేబులో పెట్టుకున్నాడు.

## 2

టెలిఫోన్ మ్రోగడంతో చూస్తున్న ఫైలు పక్కకు నెట్టి రిసీవరు అందుకుని "హలో!" అన్నాడు కోణంగి.

"ఎవరు మాట్లాడేది?" అంది అవతలి కంఠం.

"ఇనస్పెక్టర్ కోణంగిని మాట్లాడుతున్నాను."

"ఇనస్పెక్టర్ గారూ! నేనిప్పుడే ఒక హత్య చేసాను. శవం మీకోసం ఎదురుచూస్తోంది. నేను చెప్పే ఎడ్రస్‌కి వచ్చి, శవాన్ని రిసీవ్ చేసుకోండి."

ఇనస్పెక్టర్ కనుబొమలు చిట్లించాడు. అంతలోనే

ఏదో గుర్తుకువచ్చి మెల్లిగా అన్నాడు.

"మిస్టర్! వేళాకోళాలాడ్డానికి మీ కింకెవరూ దొరక లేదా? ఈరోజు ఏప్రిల్ ఫస్టన్న సంగతి నాకు బాగా గుర్తుంది."

"ఓహ్! ఈరోజు ఏప్రిల్ ఫస్టన్న సంగతి నాకసలు గుర్తు లేనేలేదు. ఖర్మకాలి ఈరోజు ఏప్రిల్ ఫస్టయింది. నేను సీరియస్ గానే మాట్లాడుతున్నాను" అగాడు అవతలి వ్యక్తి.

కోణంగి ముఖం గంభీరంగా మారిపోయింది.

"మీరెక్కడనుండి మాట్లాడుతున్నారు?"

"నేను చంపిన వ్యక్తి పేరు నరహరి. ఆలస్యం చెయ్యక త్వరగా రండి. శవం ఆట్టే ఆలస్యాన్ని భరించలేదు," అడ్రస్ చెప్పి, ఫోన్ పెట్టేసాడు అవతలివ్యక్తి.

సీటులోనుండి చివాలున లేచి టోపీ అందుకున్నాడు కోణంగి.

పావుగంట తర్వాత, నరహరి ఇంటిముందు పోలీస్ జీపాగింది. కోణంగి బయటకు దూకాడు. చకచకా ముందుకు సాగాడు. కానిస్టేబిల్స్ అతన్ని అనుసరించారు. అతడు గుమ్మంలో అడుగుపెట్టేలోగా ఒక యువతి నరహరి ఇంట్లోనుండి బయటకు దూసుకువచ్చింది. ఇన స్పెక్టర్ని చూసి భయంతో ఆగిపోయింది.

"పరుగు పందాలలో పోటీ చెయ్యబోతున్నారా?" తాపీగా అడిగాడు కోణంగి.

"హ...త్య... హత్యజరిగింది. నరహరిగార్ని ఎవరో హత్యచేసారు" వణుకుతూ అందామె.

కోణంగి ఆమెను పరీక్షగా చూసాడు. ఆమెకు ఇరవై

ఏర్పడ్డాయి. అందంగా, నాజూకుగా ఉంది. విపరీతంగా భయపడిందన్న విషయం ఆమె ముఖకవళికలే తెలియ జేస్తున్నాయి.

"లోపలికి పదండి" అన్నాడు కోణంగి.

కుర్చీలో ఒరిగి పడివున్న శవాన్ని చూసాడు. గదంతా పరకాయించి చూసాడు. వంగి నేలమీద తన దృష్టి నాకర్షించిన వస్తువులను జాగ్రత్తగా తీసి భద్రపరిచాడు.

"మీ పేరు?" యువతివైపు తిరిగి అన్నాడు.

"మేనక" అంది ఆ యువతి మెల్లగా.

"మీకు నరహరి ఏమవుతారు?"

"ఆయన నా యజమాని. నేను ఆయన ఆఫీసులో స్టెనోగా పనిచేస్తున్నాను."

"అయితే ఈ టైంలో ఇక్కడేం చేస్తున్నారు?"

మేనక ఒకక్షణం మౌనంగా ఉండిపోయింది.

"ఏవో అర్జెంట్ లెటర్స్ డిక్టేట్ చెయ్యాలని నన్ను ఇంటికి రమ్మన్నారు. తీరా నేను వచ్చేసరికి ఆయన చచ్చి పడున్నారు. నాకు భయం వేసింది. ఏం చెయ్యాలో తోచలేదు. అలాగే బైటికి పరుగెత్తాను. అంతలో మీరు వచ్చారు. ఇంతకుమించి నాకేమీ తెలియదు" ఇనస్పెక్టర్ ముఖంలోకి భయంగా చూస్తూ అంది.

"నరహరిగారు ఒంటరిగా ఉంటున్నారా?"

"కాదు. భార్య, ఇద్దరు పిల్లలతో ఉంటున్నారు. వారికి సంబంధించిన దగ్గరబంధువులెవరో పోయారట. భార్యను, పిల్లల్ని ఈ సాయంత్రం బండికే ఊరు పంపిస్తున్నానని ప్రొద్దున్న మాటల సందర్భంలో నాతో అన్నారు."

"అలాగా!" అంటూ తల పంకించాడు కోణంగి.

"సార్! మరి ఇక నేను వెళ్ళవచ్చునా?" భయం భయంగా అడిగింది మేనక.

"నో! నో! అదెలా కుదురుతుంది. మీరు మాతో పోలీస్ స్టేషన్‌కి రావలసి ఉంటుంది. మీ వాంగ్మూలం తీసుకోవాలి. అలా కూర్చోండి," అనేసి రొటీన్ ప్రొసీడింగ్స్‌లో మునిగిపోయాడు కోణంగి.

## 3

రాత్రి పదకొండుగంటలు దాటింది.

పక్కమీద అసహనంగా అటునుండి ఇటు దొర్లాడు కాళీ. అతని మస్తిష్కం ఆలోచనలతో వేడెక్కిపోతోంది. అతనికి చాల చిరాకుగా ఉంది.

అతడు చంపాలని నిర్ణయించుకున్న రెండో జీవి రమణరావు కొద్దిలో తప్పించుకున్నాడు. తను చంపాలనుకున్న మొదటి వ్యక్తి నరహరిని ఏ ఆటంకమూ లేకుండానే మరో లోకానికి పంపించగలిగాడు.

వచ్చిన చిక్కల్లా ఈ రెండో కాతాతోనే. రమణారావు జైలుకువెళ్ళిన పక్షి. అంతకు క్రితంరోజే అతడు జైలునుండి విడుదల కావల్సిన రోజు. అలాగే అతడు విడుదలయ్యాడు కూడ. కాళీ చేసిన తప్పల్లా జైలుకు కొంచెం ఆలస్యంగా చేరుకోవడమే. ఈ లోపులోనే రమణారావు బయటకు రావడం, బయట ప్రపంచంలో కలిసిపోవడం రెండూ జరిగిపోయాయి.

జైలునుండి బయటకొచ్చిన ఖైదీ అతడు. అతనికి ఒక ఎడ్రస్ అంటూ లేదు. ఇప్పుడు అతన్ని ఎక్కడని వెదికి పట్టుకోవడం? వెదికి పట్టుకుని ఎలా తనకత్తి కెర చెయ్యడం?

జైలుకెళ్ళే దారిలో ఆ ఏక్సిడెంట్ జరక్కుండా ఉన్నట్లయితే తను సమయానికే అక్కడకు చేరుకుని ఉండేవాడు. ఇప్పుడిలా అతడ్ని వెదికి పట్టుకోవాలన్న సమస్యకూడ తనకు ఎదురై ఉండేదికాదు. ఏం చెయ్యాలి?

ఎంత ఆలోచించినా అతని ఆలోచనలు ఒకదారికి రాలేదు.

శాస్త్రి పక్కమీదనుండి లేచాడు. చాల దాహంగా ఉంది. ఫ్రిజ్ వైపు నడిచాడు. ఫ్రిజ్ తెరిచి కోకాకోలా ఒకటి తీసి తాగాడు. ఫ్రిజ్ మూసి మళ్ళీ పక్కవైపు నడిచాడు.

పక్కమీదకి ఒరగబోతూ ఉండగా ఏదో పడిన శబ్దం వినిపించింది.

శాస్త్రి అలాగే నిలబడి ఉండిపోయాడు. ఏమిటా శబ్దం? పక్కగదిలోనుండి వచ్చివుండాలి. చరచరా బైటికి నడిచాడు. పక్కగది తలుపులు ఓరగా తెరిచివున్నాయి. లోపలంతా చీకటిగా ఉంది.

ఒకఅడుగు లోపలవేసి తలుపు పక్కనేవున్న స్విచ్ నొక్కాడు. లైట్ ప్రకాశవంతంగా వెలిగింది. గదిలో ఎవ్వరూ లేరు.

స్టాండ్ మీద ఉండాల్సిన ఫ్లవర్ వేజ్ ముక్కలయి క్రింద పడివుంది. చుట్టూ పరీక్షగా చూసాడు. గదికి అవతలవైపున్న తెర కొద్దిగా కదలడంతో అటు తీక్షణంగా చూసాడు. తెరవెనుక రెండుపాదాలు కనిపిస్తున్నాయి.

నొసలు చిట్లించాడు శాస్త్రి. జుట్టు పైకెగరేసాడు. కుడి చేతి చూపుడువేలును గట్టిగా కొరికాడు. ఏదో అనబోయి ఒక క్షణం ఆగాడు.

"ఎవరక్కడ తెరచాటున? మర్యాదగా బయటకు రా! పిచ్చిపిచ్చి వేషాలేస్తే నిర్దాక్షిణ్యంగా కాల్చిపారేస్తాను. నా చేతిలో పిస్తోలుంది" బెదిరించాడు.

రెండు క్షణాలు మౌనంగా గడిచాయి.

"ఏమిటి ఆలస్యం? నిజంగానే కాలుస్తాను. చేతులు పైకెత్తి బయటకు రా!" మళ్ళీ హెచ్చరించాడు.

తెరచాటునుండి బయటకు వచ్చాడో వ్యక్తి. సంస్కారంలేని జుట్టు, మాసిన గడ్డం, వాడిన ముఖం, పెదాలపై విచిత్రమైన నవ్వు —

అతన్ని చూడగానే కాళీ కళ్ళు ఆనందంతో మెరిసాయి. వెదకబోయిన తీగ కాళ్ళకు తగిలింది. అతనెవరో కాదు. తనెవరి గురించి అయితే బుర్ర బద్దలు కొట్టుకుంటున్నాడో అతనే ఆ వ్యక్తి—తను చంపాలనుకుంటున్న రమణారావు. కాళీ బిగ్గరగా శ్వాసపీల్చి విడిచాడు.

"ఎవరు నువ్వు?"

"నేను.... నేను దొంగను" అదోరకంగా నవ్వాడతడు.

"లోపలికి ఎలా ప్రవేశించావు?"

"దొంగకు దార్లే దొరకవా? మురికినీటి గొట్టంద్వారా పైకివచ్చాను. కంగారులో ఫ్లవర్ వేజ్ పడేసాను. దొరికి పోయాను. ఇక తరువాత కథ మీరు చెప్పాలి" నిర్లక్ష్యంగా అన్నాడతడు.

"నీ పేరు?"

"రమణారావు. నేను మొన్న జైలునుండి విడుదల అయ్యాను. ఈ రెండురోజులనుండి తినడానికింత తిండి కూడ దొరకలేదు. చివరికి మీ ఇంట్లో దూరాను. మీరు మళ్ళీ పంపిస్తే తిరిగి జైలుకు వెళ్ళిపోతాను. ఇంకా తెలుసుకోవలసిన వివరాలేమైనా ఉన్నాయా?"

శాలీ అతణ్నే చూస్తూ ఒకక్షణం ఉండిపోయాడు. తరువాత మెల్లిగా అన్నాడు. "సరే పద! భోంచేద్దువు గాని."

రమణారావు కళ్ళు విచిత్రంగా మెరిసాయి. శాలీ డైనింగ్ హాల్ వైపు నడిచాడు. రమణారావు అతన్ని అనుసరించాడు.

# 4

ఆత్రంగా భోంచేస్తున్నాడు రమణారావు. అతణ్నే పరిశీలనగా చూస్తూ కూర్చున్నాడు శాలీ. "భోజనం చాల రుచికరంగా ఉంది. వంట ఎవరు చేసారు?" అన్నాడు రమణారావు.

"మా వంటమనిషి."

"ఆమె ఎక్కడ?"

"ఏం? ఎందుకు?"

"ఆమెకు నేను థాంక్స్ చెప్పాలి."

"ఆమె లేదు. రోజూ సాయంత్రం వంటచేసేసి, తన ఇంటికి కెళ్ళిపోతుంది."

రమణారావు, శాలీవంక చూస్తూ అన్నాడు—

"మీరు ఒక్కరే ఉంటున్నారా? మీకింకా పెళ్ళి కాలేదని అర్థమవుతూనేవుంది. నా ఉద్దేశం నాకల్లెవరూ లేరా అని!"

"నౌకరు రెండు రోజులు సెలవడిగి స్వగ్రామం వెళ్ళాడు. ప్రస్తుతానికి నేను వంటరినే."

"అలాగా!" సాలోచనగా అన్నాడు రమణారావు.

"భోంచేస్తూ ఉండు, నేనిప్పుడే వస్తాను."

"పోలీసులకు ఫోన్ చెయ్యడానికి వెళ్తున్నారా?"

కాళీ నవ్వాడు. "లేదు. నిన్ను పోలీసులకు అప్పగించే ఉద్దేశం నాకు లేదు."

"థాంక్స్!"

"నో మెన్షన్!"

కాళీ మళ్ళీ తిరిగి వచ్చేసరికి అతడింకా తింటూనే ఉన్నాడు.

"నీ కెవ్వరూ లేరా?"

"భార్యాపిల్లలు కారు ఏక్సిడెంటులో పోయారు. నేను స్మగ్లింగ్ రేకెట్ నడుపుతూ పట్టుపడ్డాను. నేను అలా పట్టుబడడానికి కారణం కూడ నేను ప్రాణస్నేహితుడని నమ్మిన ఒక మిత్రద్రోహి మూలంగానే.

ఇక పోతే. నన్నాదరించే స్నేహితుడొకడున్నాడు. అతని పేరు నరహరి. కాని నేను వెళ్ళేసరికే అతడ్ని ఎవరో ఘోరంగా పొడిచి చంపారన్న వార్త తెలిసింది."

"సరే సరే! భోజనం కానియ్!" అంటూ జేబులో నుండి కాడ్బరీస్ ఫైవ్ స్టార్ పేకెట్ బయటకు తీసాడు కాళీ.

"వంకాయకూర ఎలా ఉంది?" అడిగాడు కాళీ చాక్లెట్ కొరుకుతూ.

"బ్రహ్మాండంగా ఉంది. అసలు వంకాయకూరంటె నేను పడిచస్తాను."

"అయితే తృప్తిగా తిను. వంకాయకూర తినడం నీకిదే ఆఖరుసారి. మళ్ళీ మరోమారు వంకాయకూర తినడం నీకు కుదరదు."

అర్థంకానట్లు చూసాడు రమణారావు.

"ఫోనీలెండి. వంకాయకూర దొరక్కపోతే మిగతా

కూరలతోనే సర్దుకుంటాను,'' అంటూ నవ్వేసాడు.

రమణారావు భోజనం పూర్తయింది. చేతులు టవల్ కి తుడుస్తూ కాళీ వంకచూసి అన్నాడు.

"దొంగనైనా చాల మర్యాద చేసారు. మరి నాకిక సెలవిప్పించండి."

"సెలవా? అదెలా కుదుర్తుంది? నీతో నాకు చాల ముఖ్యమైన పని ఉంది."

"నాతో పనా? ఏమిటది?"

"ఏం లేదు. నిన్ను నేను చంపాలనుకుంటున్నాను" ఎంతో తేలికైన విషయం చెప్పినట్లు అన్నాడు కాళీ పళ్ళు కోసే కత్తి అటు ఇటూ త్రిప్పుతూ.

తలమీద పిడుగు పడ్డట్లు ఫీలయ్యాడు రమణారావు.

"ఏమిటి మీరనేది?" అదిరిపాటుతో అన్నాడు.

"కొద్దిసేపటిలో నేను నిన్ను చంపబోతున్నాను."

"అన్యాయం. తిండిపెట్టి ఆదరించిన మీరు ఇంత ఘోరంగా ప్రవర్తిస్తారంటే నేను నమ్మలేను. ప్లీజ్!... నన్ను చంపకండి," భయపడుతూ అన్నాడు రమణారావు.

"ఘోరంగా ప్రవర్తిస్తున్నది నేను కాదు. ఘోరాతి ఘోరంగా ప్రవర్తించింది నువ్వు. ఆ పాపానికే నువ్వు శిక్ష ననుభవించబోతున్నావు," చివాలున జేబులోనుండి ఫోటో బయటకు లాగాడు కాళీ.

"చూడు! ఈ ఫోటో సరిగ్గా చూడు. ఈమెను నువ్వు గుర్తు పట్టగలవా?" రమణారావుమీదకు ఒరుగుతూ అన్నాడు కాళీ.

రమణారావు దీక్షగా ఫోటోవైపు చూశాడు. ఫోటో

లోని స్త్రీని గుర్తు పట్టడానికి ప్రయత్నం చేస్తున్నాడు. అతని కళ్ళు పెద్దవయ్యాయి.

"ఆ...గుర్తొచ్చింది...ఇంతకీ..."

"మరి నన్ను గుర్తు పట్టగలవా?" నవ్వాడు శాళీ.

అయోమయంగా చూసాడు రమణారావు.

"గుర్తు పట్టలేవు. చెప్పినా విని భరించలేవు. అందుకే నిన్ను చంపబోతున్నాను" శాళీ చేతిలో కత్తి వాడిగా మెరిసింది.

నొసలు చిట్లించాడు శాళీ. జుట్టు పైకెగరేసాడు. చూపుడువేలు గట్టిగా కొరికాడు.

భయంతో వణకసాగాడు రమణారావు.

"నన్ను చంపొద్దు. దయచేసి క్షమించి వదిలిపెట్టు" అతని మాటలు పూర్తయ్యే లోపలే శాళీచేతిలో కత్తి అతని పొట్టలోకి విసురుగా దిగి, మళ్ళీ రెండోసారి దిగడానికి సిద్ధమైంది. కసిగా పోటుమీద పోటు పొడిచాడు శాళీ.

రమణారావు ప్రాణాలు బొందిని విడిచి బయటకు వచ్చేసి గాల్లో కలిసిపోయాయి.

బరువుగా శ్వాస విడిచాడు శాళీ. నుదురుకు పట్టిన చెమటలు తుడుచుకున్నాడు. పక్కనేవున్న కుర్చీలో కూలబడ్డాడు.

ఫొటోవంక రెండు క్షణాలు చూస్తూ ఉండిపోయాడు. అప్రయత్నంగా రెండు కన్నీటిబొట్లు అతని కళ్ళనుండి జారాయి. "భగవాన్! నన్ను క్షమించు," లోలోనే గొణిగాడు.

## 5

టేబిల్ లాంప్ ముందు కూర్చుని ఏదో వ్రాసుకుంటూ గట్టిగా ఆవులించాడు కోణంగి. నిద్ర వచ్చేస్తోంది. ఇక రాత సాగేట్లు లేదు. తల తిప్పి చూసాడు.

ఆ పక్కన భార్య అందంగా నిద్రపోతోంది. అలాగే చూస్తూ ఉండిపోయాడు. అలా చూస్తూవుంటే అతనిలో ఏదో తియ్యని ఊహ రేగింది. మంచంవైపు నడవ బోయాడు.

ఇంతలో చప్పుడుచేస్తూ టెలిఫోన్ మోగడంతో విసుగ్గా ఫోన్ అందుకుని హలో! అన్నాడు.

"కోణంగి గారేనా మాట్లాడేది?"

"అవును. ఇన్స్పెక్టర్ కోణంగినే మాట్లాడు తున్నాను."

"ఇన్స్పెక్టర్ గారూ! నేను మరో హత్య చేశాను. హతుడి పేరు రమణారావు. శవాన్ని రైల్వే వంతెనదగ్గర పారేసాను" అంటూ ప్రాంతం వివరాలు తెలియజేసాడు అవతలి వ్యక్తి.

ఇన్స్పెక్టర్ కోణంగి ఆ గొంతును గుర్తుపట్టాడు. నరహరి హత్య జరిగినప్పుడు తనకు ఫోన్ చేసిన వ్యక్తే అతడు.

"మిస్టర్! మీ రెందు కిలా హత్యలు చేస్తున్నారు?"

నవ్వాడు అవతలి వ్యక్తి. "కసి ఇన్స్పెక్టర్! కసి!! అందుకే చంపుతున్నాను."

"మీరు చట్టాన్నుండి తప్పించుకోలేరు. మీ అంతట మీరు చట్టానికి లొంగిపోతే మంచిది," సలహా ఇస్తున్నట్లుగా అన్నాడు కోణంగి.

"సారీ! కోణంగిగారూ! చట్టానికి లొంగిపోవడానికి నాకే అభ్యంతరమూ లేదు కాని, నేను చెయ్యాల్సిన హత్యలు ఇంకా రెండున్నాయి. ఆ రెండూ పూర్తిచేసిన తరువాత మీరు చెప్పిన విషయం గురించి ఆలోచిస్తాను."

"మీరింకా ఎవరిని చంపాలనుకుంటున్నారు?"

"పూర్తి వివరాలు చెప్పి నా అంతట నేనే నా లక్ష్యసాధనకు అవరోధాలు కల్పించుకునే సాహసం చెయ్యలేను. అయినా అడిగారు కాబట్టి, ఒక్క విషయం మాత్రం చెప్తాను. నేను ముందు నరహరిని చంపాను. అతని పేరులో వున్న మిగిలిన మూడుఅక్షరాలు పూర్తి చెయ్యడం నా లక్ష్యం. ఇప్పుడు రమణారావును చంపాను. అంటే 'నర' పూర్తయింది. ఇక హరి మిగిలుంది. నేను చంపాలనుకున్న నలుగురి పేర్లలో మొదటక్షరాలు కలిపితే నేను చంపిన మొదటి వ్యక్తి పేరు వచ్చింది. ఇది కేవలం కాకతాళీయమే ననుకోండి. ఇక ఉంటాను. 'హ' ను హతం చేసిన తరువాత మళ్ళీ ఫోన్ చేస్తాను."

అవతల ఫోన్ పెట్టేసిన శబ్దం రాగానే ఒక చిన్న నిట్టూర్పు విడిచి, తనూ ఫోన్ పెట్టేసాడు కోణంగి.

మెలుకువ వచ్చింది కాబోలు, అతని భార్య లేచి అతనివైపే దీక్షగా చూస్తోంది.

"ఏమిటిది?" అంది.

"ఏముంది? మామూలే! చావు కబురు" అని వినుక్కుంటూ యూనిఫారం వేసుకోసాగాడు.

కోణంగి మందీమార్బలంతో శవమున్నచోటికి చేరుకునే సరికి మరోగంట గడిచింది.

శవం ఒక చెట్టుకింద పడివుంది. చుట్టూ చీకటిగా

వుంది. ఆ చోటంతా నిర్మానుష్యంగా వుంది. శవాన్ని పరీక్షించాడు కోణంగి.

శరీరం నిండా కత్తిపోట్లు. సరిగ్గా నరహరి చంపబడ్డ విధంగానే ఇతడూ చంపబడ్డాడు. శవం పడివున్న చోట రక్తం కారిన ఛాయలేమీ లేకపోవడం గమనించాడు కోణంగి. ఎక్కడో హత్యచేసి ఇక్కడకు తీసుకువచ్చి పారేసి వుండాలని తేలికగానే ఊహించాడు.

ఇంతలో అతనిదృష్టి నాకర్షించింది అక్కడే పడి వున్న 'కాడ్‌బరీస్ ఫైవ్‌స్టార్' కాగితం. దాన్ని తీసి భద్రం చేసాడు కోణంగి.

నరహరి శవంవద్దకూడ సరిగ్గా ఇలాంటి రేపరే దొరికింది. అక్కడ దొరికిన సిగరెట్ పేకపైవున్న వేలిముద్రలు హతుని వేలిముద్రలతో సరిపోయాయి. చాక్లెట్ రేపర్ మీదున్న వేలిముద్రలు బహుశా హంతకుడివై వుంటాయని తను అనుకున్నాడు. దీన్నిబట్టి హంతకుడికి ఫైవ్‌స్టార్ చాక్లెట్ తినే అలవాటు బాగా వుందని తెలుస్తోంది. హంతకుడ్ని పట్టిచ్చేందుకు తన కుపకరించే 'క్లూ' ఇది ఒక్కటి మాత్రమే.

హంతకుడు తరువాత చంపబోయేది 'హ' అక్షరంతో మొదలయ్యే పేరున్న వ్యక్తిని. కాబట్టి 'హ, రి' అక్షరాలతో పేరు మొదలయ్యే వ్యక్తులు జాగ్రత్తగా ఉండాలని వెంటనే ప్రకటన చెయ్యాలి అనుకున్నాడు ఇన్‌స్పెక్టర్ కోణంగి.

## 6

సిగరెట్ వెలిగించి షాప్ దగ్గరే నిలబడి ఆ సాయంత్రం పేపర్ చూస్తున్నాడు కోణంగి.

"ఆరు కాడ్‌బరీస్ ఫైవ్‌స్టార్ చాక్లెటివ్వండి."

పిడుగు మీదపడ్డట్లు ఫీలయ్యాడు కోణంగి, ఆ మాటలు తన చెవికి సోకగానే.

పేపరులో ముఖం దాచుకుంటూ ఓరగా ఆవైపు చూసాడు. షాపులో నిలబడివున్నాడు ఓ యువకుడు. షాపువాడిచ్చిన చాక్లెట్లు తీసుకుని బిల్లు చెల్లించాడు. మెల్లిగా వెనుతిరిగాడు.

పాతికేళ్ళుంటా యతనికి. అందంగా వున్నాడు. చాల అమాయకమైన ముఖం. అతడు హత్యలు చేస్తాడంటే ఎవరూ నమ్మలేరు.

అతడు రోడ్డెక్కాడు. కోణంగి అతన్నే గమనిస్తున్నాడు. కాస్సేపాగి పేపరు మడిచి అతడ్ని అనుసరించాడు. తను మఫ్టీలో వున్నాడు. అతడు తనను చూడకుండా జాగ్రత్తపడ్డాడు.

ఆ యువకుడు బస్‌స్టాప్‌లో ఆగాడు. అతనికి కొంత దూరంలో ఆగాడు కోణంగి. రెండు బస్‌లు వచ్చాయి. వెళ్ళిపోయాయి. వాటిలో యువకుడు ఎక్కలేదు. కాచుకున్నాడు కోణంగి.

మరో బస్ వచ్చింది. యువకుడు బస్సెక్కాడు. మెరుపులా పరుగెత్తి కోణంగికూడ బస్సెక్కాడు. ఆ యువకుడు కూర్చున్న రెండుసీట్లు వెనుక కూర్చున్నాడు. యువకుడు ఎక్కడికి టికెట్ అడిగిందీ జాగ్రత్తగా గమనించాడు. తనూ అక్కడికే టికెట్ తీసుకున్నాడు.

బస్ వేగంగా పరుగెడుతోంది. కోణంగి మనసులో ఆలోచనలుకూడ అంతకుమించిన వేగంతో పరుగెడుతున్నాయి.

ఎక్కడో బస్ ఆగడంతో కోణంగి ఆలోచనల్లోనుండి బయటపడ్డాడు. ముందుకు చూసాడు. యువకుడు లేడు. బస్సంతా చూసాడు. లేడు. అతడు టికెట్ తీసుకున్న బస్‌స్టాప్ ఇంకా చాలదూరం ఉంది.

కిటికీలోనుండి బయటకు చూసాడు. అంతదూరంలో కనిపించాడు యువకుడు. అమ్మయ్య! ఫర్వాలేదు. అంత వరకూ తను అదృష్టవంతుడే. దిగ్గున లేచాడు. ఈలోగా బస్ కదిలింది. పరుగెడుతున్న బస్‌లోనుండి దూకేసాడు కోణంగి.

మధ్యలోనే ఎందుకు దిగిపోయాడతడు? తను అనుసరిస్తున్నట్లు పసిగట్టాడా? ఏమో?

యువకుడు రోడ్డుమీద నిలబడి అటూ ఇటూ చూసాడు. అతని దృష్టిలో పడకుండా తప్పుకున్నాడు కోణంగి. రోడ్డు క్రాస్ చేసాడతడు. ఎదురుగావున్న పోస్ట్‌బాక్స్‌వైపు నడిచాడు. ఏదో ఉత్తరం పోస్టుచేశాడు. మళ్ళీ ముందుకు కదిలాడు. ఒక బస్‌స్టాప్‌లో ఆగాడు. కోణంగికూడ ఆగిపోయాడు.

యువకుడు వెళ్తోన్న ఆటోను ఆపాడు. మెరుపులా ఎక్కి కూర్చున్నాడు. ఆటో కదిలింది.

ఉలిక్కిపడ్డాడు కోణంగి. వెంటనే అటు వస్తున్న ఖాళీ టాక్సీ ఆపి ఎక్కాడు. ఆటోను అనుసరించమన్నాడు. ఆటో మలుపులు, సందులు తిరుగుతోంది. వెనకనే అనుసరిస్తున్నాడు కోణంగి. ఒక చిన్న మేడ ముందు ఆగింది ఆటో. కొంతదూరంలోనే టాక్సీ ఆపించాడు కోణంగి.

యువకుడు దిగి డబ్బిచ్చి ఆటోను పంపించేసి తిన్నగా మెట్లెక్కసాగాడు.

కోణంగి మేడ ముందుకు వచ్చి ఆగాడు. ఒక క్షణం ఆలోచించి తనూ మెల్లెక్కాడు. మేడపైన రెండు వాటాలున్నాయి. ఒక వాటాకు బయట తాళంవేసి వుంది. కాబట్టి రెండో వాటాలోకే యువకుడు వెళ్ళివుండాలి.

తలుపులు మూసి వున్నాయి. తోసి చూశాడు. తెరుచుకోలేదు. లోపలినుండి గడియపెట్టి వుండాలి. గది గుమ్మంపక్కనే వున్న నేమ్‌ప్లేట్ చూసి అదిరిపడ్డాడు కోణంగి.

"ఎన్. హనుమంతరావు, ఎమ్.యస్‌సి." అని వ్రాసి వుంది.

'హ' అంటే హనుమంతరావు. మూడో హత్య జరగబోతోంది. ఎలాగయినా ఆపాలి. ఇక ఆలస్యం చేస్తే ఊహించిన అనర్థం కాస్తా జరిగిపోతుంది. కాబట్టి తను త్వరపడాలి.

ఇంకా పైకి టెర్రస్‌మీదకి వెళ్ళడానికి మెట్లున్నాయి. చకచకా మెట్లెక్కి పైకి వెళ్ళాడు. బాగా పరిశీలించాడు.

గోడపక్కగా వున్న గొట్టం సాయంతో క్రింద బాల్కనీలోకి దూకడానికి అవకాశముంది. ఇక ఆలస్యం చెయ్యలేదు కోణంగి. గొట్టంపట్టుకుని క్రిందకు దిగజారాడు బాల్కనీలోకి దూకాడు. గదిలోనుండి బాల్కనీలోకి వచ్చే తలుపుకూడ మూసివుంది.

ఆ పక్కనే ఒక పెద్ద పాతడ్రమ్ము వుంది. ఆ డ్రమ్ము ఎక్కితే వెంటిలేటరు అందుకోవచ్చు. జాగ్రత్తగా డ్రమ్ము పైకి ఎక్కాడు. జాగ్రత్తగా బాలెన్సు చేస్తూ వెంటిలేటర్ అందుకుని లోపలికి తొంగిచూసాడు.

అంతే! అతని కళ్ళు పెద్దవయ్యాయి. లోపలి దృశ్యం చూసి ఒక్కక్షణం ఊపిరిపీల్చడం మానేసాడు.

ఆ గదిలో డబుల్ కాట్ వుంది. ఆ మంచంమీద ఒక వైపు ఆ యువకుడు మోచేతులమీద ఆనుకుని పడుకుని వున్నాడు. అతనికి అభిముఖంగా ఒక యువతి అదేవిధంగా పడుకుని వుంది.

యువకుడు తన పళ్ళమధ్య ఫైవ్ స్టార్ చాక్లెట్ ఇరికించి పట్టుకుని వున్నాడు. ఆ యువతి ముందుకు జరిగి ఆ చాక్లెట్ను కాస్త కొరికి తింది. ఆ తరువాత చాక్లెట్ను తన పళ్ళమధ్య ఇరికించి పట్టుకుంది. ఈసారి రెండో చివర యువకుడు కొరికాడు. కొరికి తింటూ అంటున్నాడు.

"విమలా! నేను ఆలస్యం చేస్తే నువ్వు భరించలేవని నాకు తెలుసు. అందుకే వీలైనంత త్వరగానే బయలు దేరాను. బస్సెక్కాను. తీరా బస్సెక్కిన తరువాత గుర్తొచ్చింది. ప్రొద్దున్న నువ్వు పోస్టుచెయ్యమని యిచ్చిన ఉత్తరం పోస్టు చెయ్యలేదని. అసలే నా మతిమరుపు గురించి నువ్వు ఆటలుపట్టిస్తూ ఉంటావు. ఈసారి మరీ ఎగతాళి చేస్తావని పోస్టుబాక్స్ కనిపించినచోట బస్ దిగేసి ఆ ఉత్తరం పోస్టు చేసేసాను. నీ ముందు వాలాలన్న తొందర. అందుకని బస్ కోసం టైం వేస్ట్ చెయ్యడం ఇష్టంలేక ఆటోలో వచ్చేసాను. ఈసారి మతిమరుపును జయించినందుకు నువ్వు నాకు స్పెషల్ ప్రెజెంట్ ఇవ్వాలి."

"ఏమిటది?" అస్పష్టంగా అంది విమల.

"తెలీదూ? ఇది" ఆమె బుగ్గమీద గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు యువకుడు.

విమల కిలకిలా నవ్వింది.

ఆ శృంగారం చూస్తుంటే ఇక్కడ కోణంగికి నరాలు వేడెక్కుతున్నాయి.

చాక్లెట్‌ను మళ్ళీ యువకుడు కరిచి పట్టుకున్నాడు. విమల చాక్లెట్ కొరికింది.

తింటూ అంది. "నేనంటే మీకెంత ప్రేమండీ! ఏది మర్చిపోయినా ఈ చాక్లెట్లు తేవడం మాత్రం మరిచిపోరు కదా!"

నవ్వుతూ యువకుడు చాక్లెట్ కొరికాడు. మళ్ళీ విమల కొరికింది. ఆ తరువాత అతడు. చాక్లెట్ చివరిముక్క విమల కొరికేసి తినేసింది. "మరి నాకేది చాక్లెట్? చివరి ముక్క నువ్వు కొరికేసావు కాబట్టి నీ పెదాలు నేను కొరికేస్తాను" అంటూ ఆమెమీద పడ్డాడతడు. ఆమె నవ్వుతూ తప్పుకోబోయింది. అతడు సాగనివ్వలేదు.

కోణంగికి పిచ్చెక్కిపోయినట్లవుతోంది. ఆ ప్రేమజీవుల వింతధోరణి కళ్ళప్పగించి చూస్తూ తన ఒళ్ళు తానే మరిచిపోయి బాలెన్స్ తప్పాడు. పెద్ద చప్పుడుచేస్తూ డ్రమ్ము దొర్లింది. దాంతోపాటు కోణంగీ క్రింద పడ్డాడు.

ఛీ! పూర్తిగా రాంగ్ ట్రాక్! తను అనవసరంగా ఇతడ్ని అనుసరించి ఫూలయ్యాడు. ఇక ఫూల్ కాకుండ చూసుకోవాలి. మెల్లిగా లేవడానికి ప్రయత్నం చెయ్య సాగాడు.

ఈలోపుగానే బాల్కనీ తలుపు తెరుచుకుంది. ఆ యువకుడు తొంగిచూసాడు. కోణంగిని ప్రశ్నార్థకంగా చూసాడు.

కోణంగి ముఖం సీరియస్‌గా మార్చుకున్నాడు.

"అయామ్ ఇన్‌స్పెక్టర్ కోణంగి!" అంటూ డాంబికాన్ని ప్రదర్శిస్తూ జేబులోనుండి ఐడెంటిటీ తీసి యువకుడి కందించాడు.

అది చూడగానే యువకుడి ముఖంలో రంగులు మారాయి.

"రండి సార్! లోపలికి రండి" అన్నాడు తడబాటుతో.

ఠీవిగా లోపలికి అడుగుపెట్టాడు కోణంగి.

భయపడుతూ ఒకమూలకు ఒదిగి నిలబడ్డ విమలవైపు తీక్షణంగా చూసాడు.

"ఈమె ఎవరు?"

"నా భార్య సార్."

"ఈ ఇంట్లో ఇంకా ఎవరెవరుంటున్నారు?"

"మేమిద్దరమే సార్! మాకీ మధ్యనే పెళ్ళయింది."

"మీ పేరు?"

"హనుమంతరావు."

"ఏం చేస్తుంటారు?"

"లెక్చరర్‌గా పనిచేస్తున్నాను."

"సరే! నేను మీ ఇల్లు ఒకసారి పరిశీలించాలి" గంభీరంగా అన్నాడు కోణంగి.

కోణంగికి తెలుసు అదంతా అనవసరమని. అయినా తప్పదు. తను పొరబడ్డానని, తను వెధవనయ్యానని వాళ్ళకు తెలియకుండా వుండాలని, నమ్మించాలని ఈ తాపత్రయం. తన పరువు కాపాడుకోవాలి మరి.

అన్ని గదులు గాలించాడు కోణంగి. బాత్‌రూమ్, లెట్రిన్ కూడ తెరిచిచూసాడు. సాలోచనగా తల పంకిస్తూ హనుమంతరావువైపు తల తిప్పాడు.

"చూడండి హనుమంతరావుగారూ! మీరు చాల జాగ్రత్తగా ఉండాలి. ఒక హంతకుడ్ని వెంబడిస్తూ నేనిక్కడికి

వచ్చాను. అతడు మీ మెట్లెక్కినట్లు గమనించి నేను మీ బాల్కనీలో ప్రవేశించాను. డామిట్! తప్పించుకున్నాడు. 'హ' అనే అక్షరంతో మొదలయ్యే పేరుగల వ్యక్తిని అతడు చంపాలనుకుంటున్నాడు. కాబట్టి మీరుకూడ జాగ్రత్తగా ఉండడం అవసరం. రాత్రిళ్ళు జాగ్రత్త. తెలియని వ్యక్తులెవ్వరికీ తలుపులు తియ్యొద్దు. ఇక నేను వెళ్తాను. బట్ బి కేర్‌ఫుల్" అంటూ బయటకు నడిచాడు.

దంపతులిద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకుంటూ ఉండిపోయారు.

రోడ్డుమీదకు వచ్చి అనుకున్నాడు కోణంగి-'చాక్లెట్ ఎంత పని చేసింది? నన్ను ఫూల్‌ని చేసిపారేసింది. ఐనా, ఇతడిమీద ఎందుకైనా మంచిది—నిఘా వేసి వుంచాలి.'

## 7

మూన్‌లైట్ బార్ చాల సందడిగా వుంది.

లోపల పాశ్చాత్య సంగీతం వినవస్తోంది. నిజానికి ఆ సంగీతాన్ని విని ఆనందించే పరిస్థితుల్లో ఆ బార్‌లో ఉన్న వాళ్ళెవ్వరూ లేరు. ఎవరి లోకంలో వాళ్ళున్నారు.

ఒకమూలగా ఉన్న టేబిల్ దగ్గర కూర్చుని విస్కీ తాగుతున్నాడు హరిగోపాల్.

గ్లాసులోఉన్న చివరిపెగ్గు మింగేసి సిగరెట్ పేకట్ కోసం టేబిల్ మీద చెయ్యిపెట్టి తడిమాడు. అతి కష్టం మీద అందుకుని సిగరెట్ తీయాలని ప్రయత్నించాడు. కాని సిగరెట్ రాలేదు. తల గట్టిగా విదిలించి బరువుగా ఉన్న కళ్ళను గట్టిగా చిట్లించి తనచేతిలో వున్న వస్తువును పరీక్షగా చూసాడు. అది సిగరెట్ పేకట్ కాదు. ఫైవ్ స్టార్ చాక్లెట్ పాకెట్.

అప్పుడే తలెత్తి ఎదురుగా కూర్చునివున్న కాళీని చూసాడు. చూసి "నమస్తే! నమస్తే!" అన్నాడు బిగ్గరగా నవ్వుతూ.

కాళీకూడ నవ్వి "నమస్తే" అన్నాడు.

"మీరు మాంత్రికులా?"

"కాదే?"

"మరి మీకు మెస్మరిజం వచ్చా?"

"ఏం అలా అడుగుతున్నారు?"

"మరి నా సిగరెట్ పేకెట్ చాక్లెట్ గా యెలా మారిపోయింది?"

నవ్వాడు కాళీ. "అదేం మారలేదు. ఆ చాక్లెట్ నాది. మీ సిగరెట్లు ఆ పక్కగా వున్నాయి. సరిగ్గా చూడండి."

హరిగోపాల్ తల పక్కకుతిప్పి చూసాడు. సిగరెట్ పేకెట్ చూసి గట్టిగా నవ్వాడు. "నమస్తే! నమస్తే" అంటూ పలుకరించాడు.

"ఇందాకటినుండి వంటరిగా తాగుతున్నానని బెంగ పడిపోయాను. ఇక నాకు బెంగలేదు. మీరు నాకు కంపెనీ ఇస్తారు కదూ?" కళ్ళు చికిలిస్తూ అన్నాడు హరిగోపాల్.

"ష్యూర్" అన్నాడు కాళీ.

ఇద్దరి గ్లాసులూ తనే నింపాడు. గ్లాసెత్తి ఛీర్స్ అన్నాడు. "ఛీర్స్ కాదు. నమస్తే! నమస్తే! అనాలి" అన్నాడు హారగోపాల్, తన గ్లాసును కాళీ గ్లాసుతో తాకిస్తూ.

కాళీకూడ నవ్వుతో "నమస్తే! నమస్తే!" అన్నాడు.

"అదీ! అలా రండి దారికి" బిగ్గరగా నవ్వాడు హరిగోపాల్.

"అవునూ! ఇంతకీ మీ పేరు చెప్పనేలేదు."

"నా పేరు కాళీ."

"నా పేరు హరిగోపాల్. మరి మీరేం చేస్తుంటారు?"

"అప్పుడప్పుడూ ఇలా తాగుతుంటాను."

"నేనూ అంతే! కాని అప్పుడప్పుడూ కాదు. ఎప్పుడూ! ఎల్లప్పుడూ!" హరిగోపాల్ నవ్వాడు.

కాళీకూడ నవ్వాడు.

"కాళీగారూ! మిమ్మల్ని చూస్తుంటే నాకెంతో ముద్దేసుకొస్తుంది. ఒక ముద్దు పెట్టుకోనా?"

"దానికేం పెట్టుకోండి."

హరిగోపాల్ ముందుకి వంగి కాళీని గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు.

ఆ తరువాత హరిగోపాల్ ఉపన్యాసం మొదలెట్టాడు. చాల విషయాల గురించి అనర్గళంగా మాట్లాడేడు. అలా ఏవేవో చెప్తూనే వున్నాడు. మధ్యమధ్యలో నవ్వుతున్నాడు. నమస్తే! నమస్తే! అంటున్నాడు. కాళీ అతడు చెప్తున్నదంతా వింటున్నట్లే ఊకొడుతున్నా అతని మనసు మరెక్కడో వుంది. అతని ఆలోచనల్లో అతడున్నాడు.

హరిగోపాల్ సీసా గ్లాసులోకి వంచాడు. ఒక చుక్క కూడ పడకపోయేసరికి సీసా పక్కకు నెట్టేసి అన్నాడు.

"చూసారా కాళీగారూ! ఇంకా సగం కిక్కయినా ఎక్కలేదు. అప్పుడే మందు నమస్తే! నమస్తే అంటోంది. మనదేశం సరుకు ఇంతే. ఎంతయినా ఫారిన్ లిక్కర్ ఇచ్చే మజాయే మజా."

కాళీ ముందుకు వంగాడు. రహస్యం చెప్తున్నట్లుగా అన్నాడు. "నా దగ్గర మంచి స్కాచ్ విస్కీ ఉంది. కొడదామంటారా?"

"ఎక్కడుంది?" కళ్ళు చికిలించి జుట్టు పైకెగరేస్తూ అడిగాడు హరగోపాల్.

"ఇక్కడే" తన బ్రీఫ్ కేస్ చూపించాడు శాలీ.

"నమస్తే! నమస్తే! మరింకేం? ఇప్పుడొద్దు. మా ఇంటికి పోదాం రండి. అక్కడెవరూ వుండరు. ఫ్రెష్‌గా మొదలెట్టొచ్చు" అపరిమితమైన ఆనందంతో అన్నాడు హరిగోపాల్.

బిల్ చెల్లించి, ఇద్దరూ బయటికి వచ్చారు.

టాక్సీలో హరిగోపాల్ ఇల్లు చేరుకున్నారు.

శాస్త్రపు తాళంతో కుస్తీపట్టి ఎలాగయితేనేం తలుపులు తెరిచాడు హరిగోపాల్.

తలుపులు తెరిచి, తలుపులకి నమస్తే! నమస్తే చెప్పాడు. అతని వెనుకే శాలీ ఇంటిలో అడుగు పెట్టాడు.

లోపలికి అడుగు పెట్టగానే చుట్టూ పరిశీలనగా చూస్తూ ఉండిపోయాడు.

"రండి కూర్చోండి! అలాగే నిలబడిపోయారేం?" అంటూ మందు పూజకు కావల్సిన సరంజామా సమకూర్చడంలో మునిగిపోయాడు హరిగోపాల్.

ఏర్పాట్లన్నీ పూర్తిగావించి, "మరి ఇక మొదలెడ్దామా?" అన్నాడు.

ఇద్దరూ "నమస్తే! నమస్తే" అనుకుని త్రాగడం మొదలెట్టారు.

మొదటి రౌండ్ పూర్తయింది.

రెండో రౌండ్‌లో వుండగా శాలీ అన్నాడు:

"మీ భార్యా పిల్లలూ ఎవరూ లేరా ఇంటిలో?"

"ఎవ్వరూ లేరు. నేనొక్కడినే. నా మొదటి భార్య

నా కెప్పుడో నమస్తే చెప్పేసింది."

"అంటే?"

"ఈ లోకాన్ని వదిలి వెళ్ళిపోయింది."

"మొదటి భార్య అంటున్నారు. అంటే మరి రెండో..."

"ఆ! రెండో భార్య కూడా నమస్తే నమస్తే అనేసింది."

"పాపం! ఆమె కూడా చనిపోయిందా?"

"అబ్బే! చావలేదు! దివ్యంగా వుంది. నాకు విడాకు లిచ్చేసింది" హరిగోపాల్ కి ముద్దగా వస్తున్నాయి మాటలు.

సిగరెట్ పెట్టె తీసి ఒక సిగరెట్ అతి కష్టంమీద పెదాల మధ్య ఇరికించి అగ్గిపుల్ల వెలిగించడానికి తంటాలు పడుతున్నాడు.

శాలీ అగ్గిపుల్ల వెలిగించి అతనికి సహాయం చేశాడు.

నమస్తే! నమస్తే!! అంటూ పకపక నవ్వేశాడు హరిగోపాల్.

మూడో రౌండ్ లో పడ్డా రిద్దరూ.

సరిగ్గా అప్పుడే అన్నాడు శాలీ:

"మందు ఎలా ఉంది?"

"భేష్షుగ్గా వుంది. ఏం?"

"ఏం లేదు! తనివితీరా తాగండి. మందుకొట్టడం మీ జీవితంలో ఇదే ఆఖరుసారి. ఇకపై మందు కొట్టాల్సిన అవసరం నేను కలుగనివ్వను."

"ఎందుకనో?" గ్లాసు పెదాలకు తాటిస్తూ మత్తుగా అన్నాడు హరిగోపాల్.

"ఎందుకంటే... ఈ మందు పూర్తయిపోయిన తరువాత నేను మిమ్మల్ని చంపబోతున్నాను."

ఈ మాటకు హారిగోపాల్‌లో ఏ మాత్రం సంచలనం కలిగించలేకపోయాయి. గ్లాసులోని ద్రవాన్ని గటగటా తాగేసి, మత్తు కళ్ళతో కాళీ వైపు చూసేడు.

"ఏమిటి చంపుతావా? నమస్తే! నమస్తే! ముందు మందు పూర్తయిన తర్వాతకదూ నన్ను చంపుతానన్నావ్ మందు ఇంకా చాలా వుంది. అంతవరకూ మాత్రం చంపకు గురూ! నీకు పుణ్యముంటుంది. మందు పూర్తవకుండా చంపేవంటే నేను నిజంగానే చచ్చిపోతాను" నవ్వేస్తూ అన్నాడు.

కాళీ మరేమీ మాట్లాడలేదు. కాళీ అయిన తన గ్లాసు నింపుకోలేదు. హారిగోపాల్ గ్లాసులో మాత్రమే విస్కీ పోసాడు.

ఇదేమీ పట్టించుకోనట్లు హారిగోపాల్ గ్లాసు అందుకుని నమస్తే నమస్తే అని తాగసాగాడు.

సమయం గడుస్తున్నకొద్దీ కాళీ ముఖంలో రంగులు మారుతున్నాయి. మౌనంగా జేబులో నుండి ఫైవ్‌స్టార్ చాక్లెట్ తీసి నోట్లో పెట్టుకున్నాడు.

విస్కీ అంతా అయిపోయింది.

హారిగోపాల్ గ్లాసులో చివరి బొట్లు మాత్రం మిగిలున్నాయి.

ఏదో గుర్తుకు వచ్చినట్లు కళ్ళు చికిలిస్తూ అన్నాడు హారిగోపాల్ చివరి బొట్లతో పెదాలు తడుపుకుంటూ.

"ఇందాకేదో చంపుతానన్నావ్! నిజంగానే చంపుతావా గురూ?"

"అబద్ధాలు చెప్పడం నా కలవాటు లేదు. నిన్ను నిజంగానే చంపుతాను" కళ్ళు చికిలించాడు కాళీ. జుట్టు పైకెగరేసాడు. అతని పెదాలు అదురుతున్నాయి. చూపుడు వేలు కసిగా కొరికాడు.

మరుక్షణంలో అతని చేతిలోని కత్తి తళుక్కున మెరిసింది.

కంగారుపడ్డాడు హరిగోపాల్. అతని మత్తు దాదాపు దిగిపోయింది.

"అదేమిటి? నన్ను చంపితే నీకేం వస్తుంది?"

"నాకా? నా కసి తీరుతుంది. ఇదిగో ఈమెకు జరిగిన అన్యాయానికి ప్రతిగా నిన్ను చంపి నా పగ తీర్చుకుం టాను" తన జేబులోనుండి స్త్రీ మూర్తి ఫోటో తీసి చూపిస్తూ అన్నాడు.

ఫోటో వంక భయం భయంగా చూసాడు హరి గోపాల్.

"గుర్తుపట్టగలవా?"

ఫోటో వంకే తేరిపార జూస్తున్నాడు హరిగోపాల్. అతని మెదడులో జ్ఞాపకాల పుటలు తిరిగిపోతున్నాయి. తిరిగి తిరిగి ఒకచోట ఆగిపోయాయి.

"అవును...అవును...ఈమె...ఆమే" తడబడుతూ అన్నాడు.

"మరి నన్ను గుర్తు పట్టావా?"

తల అడ్డంగా తిప్పాడు హరిగోపాల్.

భయంతో కళ్ళు చిన్నవైనాయి హరిగోపాల్ కి. పెదాలు అదురుతున్నాయి. జుట్టు పైకెగరేసాడు. అదే పనిగా తనుకూడ చూపుడువేలు కొరుకుతున్నాడు.

"నమస్తే! నమస్తే! నన్ను చంపకు! ఇది నిజమైన నమస్తే! నమస్తే" చేతులు జోడిస్తున్నాడు.

కాళీ ఆగలేదు. ఎత్తినకత్తి బలంగా హరిగోపాల్ పొట్టలో దించాడు. భయంకరంగా కేక వేసాడు హరిగోపాల్. మరోపోటు పొడిచాడు కాళీ.

# 8

బద్ధకంగా వళ్ళు విరుచుకుంటున్న ఇన్‌స్పెక్టర్ కోణంగి 'చావుకేక' విని ఉలిక్కిపడ్డాడు.

ఏమిటా కేక? తన పక్కవాటాలోనుండి వచ్చిందది. పక్కవాటాలో వున్న తాగుబోతు హరిగోపాల్ ఎందుకలా అరిచాడు?

చటుక్కున స్ఫురించిందతనికి, అతని పేరు 'హ' తో మొదలవుతుందని. ఇక అతడు ఆలస్యం చెయ్యలేదు.

రివాల్వర్ తీసుకుని సుడిగాలిలా బయటకు పరుగెత్తాడు.

హరిగోపాల్ ఇంటి తలుపులు ఓరగా తెరిచివున్నాయి. లోపలంతా చీకటిగా వుంది. గడప దగ్గరే ఆగిపోయాడు కోణంగి. హంతకుడింకా లోపలే వున్నాడా?

కేక వినిపించిన వెంటనే తను మెరుపులా ఇక్కడకు చేరుకున్నాడు. హంతకుడు పారిపోవడానికి తగిన వ్యవధి లేదు. కాబట్టి హంతకుడు లోపలే వున్నాడు.

చెవులు గట్టిగా రిక్కించి ఏమైనా శబ్దం వినిపిస్తుందేమోనని యెదురుచూసాడు. ఎలాంటి అలికిడి లేదు. నిముషాలు గడుస్తున్నాయి. ఓపికగా కాచుకున్నాడు కోణంగి.

అంతలోనే అతని మెదడులో మరో ఆలోచన మెరిసింది. ఒకవేళ హంతకుడు వెనుకనున్న ద్వారంగుండా పారిపోతే?

ఈ ఆలోచన రాగానే కోణంగి విసురుగా లోపలకు జొరబడ్డాడు. లైటు వెయ్యాలని స్విచ్ బోర్డు వైపు జరిగాడు.

అంతలోనే అతని నెత్తిపై బరువైన దెబ్బ పడింది. కళ్ళ ముందు చుక్కలు కనబడ్డాయి. తల పట్టుకుని ఉన్న పాటున కుప్పలా కూలిపోయాడు.

మరునాడు పదకొండు గంటలకు కోణంగి పోలీస్ స్టేషన్‌లో కూర్చుని ఉన్నాడు. తలంతా బరువుగా, బాధగా ఉంది.

'హ' ఎక్కడో చంపబడతాడని తను అనుకున్నాడే కాని ఆ 'హ' తన పక్కింట్లో హరిగోపాల్ అని, హంత కుడు తను సమీపంలో వుండగానే హత్య చేస్తాడని తను ఊహించనైనా లేదు. పైగా తెలివిగా తనను దెబ్బ కొట్టి పారిపోయాడు.

తను తేరుకుని లేచి సిబ్బందిని పిలిపించి జరగవలసిన తతంగమంతా జరిపించి, స్టేషనుకు చేరుకున్నాడు.

హంతకుడు హత్య చేసిన తరువాత తనకు ఫోన్ చేసి' చావు కబురు తెలియజేసేవాడు. రాత్రి ఆ అవసరం లేక పోయింది. కాబట్టి ఈసారి తనకు ఫోన్ చెయ్యకపోవచ్చు అయినా చేస్తాడేమోనన్న ఆశతో కాచుకున్నాడు కోణంగి.

ఇంతలో ఫోన్ మ్రోగనే మోగింది.

కోణంగి రిసీవర్ అందుకుని "హలో! ఇన్‌స్పెక్టర్ కోణంగి స్పీకింగ్" అన్నాడు ఆదుర్దాగా.

"మీరు నన్ను క్షమించాలి కోణంగిగారూ! రాత్రి తప్పనిసరి అయి మిమ్మల్ని దెబ్బ తీసాను."

"ఇప్పుడింతకీ ఎందుకు ఫోన్ చేస్తున్నట్లు?" గొంతులో కర్కశత్వాన్ని కొని తెచ్చుకుంటూ అన్నాడు కోణంగి.

"కేవలం మీకు క్షమాపణలు చెప్పుకోవాలనే."

"మిస్టర్! ఇంతటితో ఈ హత్యలు చెయ్యడం ఆపడం మంచిది. చట్టానికి లొంగిపోవడం శ్రేయస్కరం."

నవ్వాడు అవతలి వ్యక్తి. "ఆపేస్తాను ఇన్స్పెక్టర్! ఇంకొక్క హత్య చేసేస్తే నా లక్ష్యం నెరవేరుతుంది. "ర" ని కూడ చంపేస్తే ఆ నలుగురి పాపానికి తగిన శిక్ష విధించినవాణ్ణవుతాను. ఇంకొక గంట తరువాత మిగిలిన హత్యకూడ చెయ్యబోతున్నాను. మీ చేతికి చిక్కకుండ ఈ హత్యకూడ చెయ్యగలనన్న ధీమా నాకుంది" ఫోన్ పెట్టేసాడతడు.

కోణంగి ఫోన్ పెట్టేసి, తీక్షణంగా ఆలోచిస్తూ ఉండిపోయాడు. ఒక గంట వ్యవధి ఇచ్చాడు హంతకుడు. ఈలోగా 'ర' ఎవరో కనుక్కోవాలి. అతడ్నయినా చావునుండి రక్షించాలి.

'ర' మీద మొదలయ్యే నేమ్స్ గురించి ఆలోచించసాగాడు.

అతనికి ఎక్కువ పేర్లేమీ తట్టలేదు. ర మీద మొదలయ్యే పేర్లు చాల తక్కువగా ఉంటాయి.

హంతకుడు చెప్పిన మాటలన్నీ మననం చేసుకుంటున్నాడు.

"నలుగురి పాపానికి తగిన శిక్ష" అంటే ఈ నలుగురూ కలిసి హంతకుడికి ఏదో అన్యాయం కలిగించి ఉండాలి. ఈ నలుగురికి లింక్ ఉందని [illegible] మాటలద్వారా అర్థమవుతూనే ఉం

కాబట్టి నరహరి, రమణారావు, హరిగోపాల్, 'R' మధ్య కొన్నాళ్ళ క్రితం మంచి సంబంధ బాంధవ్యాలే ఉండివుండాలి. 'R' ని గురించిన వివరాలు తనకెలా తెలుస్తాయి?

హరిగోపాల్ ఇంటిని పరిశోధిస్తే. ఏమైనా లాభముంటుందా? ఇంకా టైము లేదు. ఈ గంటలోనే ఏదో ఒకటి చెయ్యాలి. ఏది ఏమైనా మరో చావుకబురు రాకుండానే దానిని అరికట్టాలి! వెంటనే జీపుతీసుకుని బయలు దేరాడు, ఇన్‌స్పెక్టర్ కోణంగి.

మరో కొద్దినిముషాల్లో తన ఇంటిముందు దిగాడు. హరిగోపాల్ గుమ్మం ముందు కాపలావున్న కానిస్టేబిల్ సెల్యూట్ కొట్టాడు. ఆ సెల్యూట్ అందుకుంటూ గబగబా ముందుకు నడిచాడు.

తాళం తెరిచి హరిగోపాల్ ఇంట్లో ప్రవేశించాడు. ఇంట్లో వస్తువులన్నీ అస్తవ్యస్తంగా పడివున్నాయి. తన పరిశోధనకు ఉపకరించే వస్తువులకోసం చకచకా వెదకసాగాడు.

# 9

రిచర్డ్ తన ఎయిర్‌కండిషన్డ్ రూమ్‌లో కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

అతడు నగరంలో పేరుమోసిన ఇండస్ట్రియలిస్ట్. అతులకధికారి. అతని ముఖంలో అశాంతి గోచరిస్తోంది.

హరిగోపాల్ హత్యగురించి విన్న తరువాత అతనిలో తలెత్తిన అనుమానం ధృవపడింది. నరహరి చంపబడ్డాడు. రమణారావు హత్య చెయ్యబడ్డాడు. ఆ తరువాత హరిగోపాల్.

పోలీసుల ప్రకటన ప్రకారం వాళ్ళతో సంబంధం ఉన్న '8' తనే. అందులో సందేహంలేదు. కాబట్టి, మృత్యువు ఏ క్షణంలోనైనా తన ముందు ప్రత్యక్షం కావొచ్చు. తామందరూ ఒకనాటి మిత్రులు. ఎన్నో అరాచకాలకు బాధ్యులు.

లక్షలు గడించి తనేం అనుభవిస్తున్నాడు? తనకంటూ ఎవరున్నారూ? భార్యా? పిల్లలా? పెళ్ళి చేసుకోవడం మాని తనెంత పెద్దతప్పు చేసాడో అతని కిప్పుడిప్పుడే అర్ధమవుతూ ఉంది. జీవితమంతా తీరని వెలితి.

వరుసగా తన మిత్రులందరూ చంపబడడానికి కారణ మేమిటి? అతని మనసు కారణాలు వెదుక్కుంటూ కొన్ని సంవత్సరాల వెనక్కి పరుగెడుతోంది. కాని ఎంత ఆలోచించినా అతని ఆలోచనలు ఒక స్పష్టమైన రూపాన్ని దాల్చడంలేదు. ఆలోచించి ఆలోచించి బుర్ర వేడెక్కుతోంది.

ఏది ఏమైనా వేళ మించిపోక ముందే తను పోలీసుల సహకారం కోరడం మంచిదనే నిర్ణయానికి వచ్చాడు.

అప్పుడే మెల్లిగా తలుపులు తెరుచుకుని అతని మేనేజర్ లోపలికి అడుగుపెట్టాడు. అతని రాకనుకూడ రిచర్డ్ గమనించలేదు.

"సార్!" అన్నాడతడు.

తల తిప్పి, "యస్! కాళీ!" అన్నాడు రిచర్డ్.

"మీరు చెప్పినట్లే ఈరోజు బోర్డ్ మెంబర్స్‌తో మీటింగ్ కేన్సిల్ చేయించాను సార్!" అన్నాడు కాళీ.

"ఓ. కె. ఎందుకో ఈరోజు మనసేమీ బాగాలేదు. పిచ్చిపట్టినట్లు వుంది. కాసేపు కార్డ్స్ ఆడదాం. ఇలా

కూర్చో'' అన్నాడు రిచర్డ్.

ఆట మొదలయింది. నిజానికి వాళ్ళిద్దర్లో ఎవరికీ ఆట మీద సరయిన ఇంట్రెస్ట్ లేదు. ఎవరి ఆలోచనల్లో వాళ్ళున్నారు.

శాలీ, రిచర్డ్ ముఖంలోకి చూసాడు. రిచర్డ్ తన ముక్కలు సర్దుకుంటున్నాడు. అతని ముఖం చూస్తుంటే శాలీలో అంతర్గతంగా దాగివున్న క్రోధం, కసి పైకి తన్నుకువస్తున్నాయి. ఇక మిగిలింది వీడొక్కడే. వీడ్ని కూడ యమపురికి పంపించేస్తే తరువాత ఏమయినా ఫర్వాలేదు.

"ఏమాలోచిస్తున్నావ్ శాలీ? నేను ముక్క వేసి చాల సేపయింది'' అన్నాడు రిచర్డ్.

"ఏమీ లేదు సార్!'' తన భావాలు పైకి కనిపించకుండా సర్దుకుంటూ పేకలోనుండి ముక్క లాగాడు శాలీ.

ఆట సాగుతూనే ఉంది. ఉన్నట్లుండి శాలీ రిచర్డ్ రెక్కపట్టుకుని బలంగా తనవైపు లాగాడు. రిచర్డ్ పిల్లిమొగ్గ లేస్తూ అంతదూరంలో పడ్డాడు.

రిచర్డ్‌కి పట్టరాని కోపం వచ్చింది.

"నీకేమైనా పిచ్చి పట్టిందా?'' అని అరవబోయి, భయభ్రాంతులతో కళ్ళు పెద్దవిచేసి, అలాగే నోటమాట రాక ఉండిపోయాడు.

రిచర్డ్ అంతకుముందు కూర్చునివున్న సోఫాకు అవతల ఒక నల్లత్రాచు పడగవిప్పి బుసలు కొడుతోంది.

శాలీ గనుక తనను లాగి ఉండకపోతే ఈ పాటికి అది తనను తప్పకుండా కాటువేసి వుండేది. తను అంతిమ ఘడియలు లెక్కపెడుతూ ఉండివుండేవాడు.

ఈలోగా కాళీ అందుబాటులో ఉన్న కర్ర ఒకటి పాముమీదకి బలంగా విసిరాడు. ఆ దెబ్బ పాముకు బలంగానే తగిలింది. అయినా సర్దుకుని పడగవిప్పి కాళీని కాటు వెయ్యడానికి ముందుకు వంగింది. కాళీ స్ప్రింగ్‌లా గెంతాడు.

మరుక్షణంలో అతని బూటుకాలు పాము పడగపై పడింది. తన శక్తినంతా ఉపయోగించి బూటుతో బలంగా పాము తలపై అదిమాడు. గట్టిగా నేల రాచాడు. రెండో కాలితో పామును గట్టిగా తన్నుతున్నాడు. అతని తాపులతో పాము తల చితికిపోయింది. విలవిలా కొట్టుకుని ఇక కదలడం మానేసింది.

పామును దూరంగా తన్నేసి, గట్టిగా శ్వాస విడిచాడు కాళీ.

రిచర్డ్ ఇంకా అలాగే నిలబడి వణికిపోతున్నాడు. అనుకోకుండ జరిగిన ఈ సంఘటననుండి తేరుకోవడానికి అతనికి మరి కాస్త టైము పట్టింది.

అతనికి కాళీ మనిషిలా కనిపించడంలేదు. దేవుడే దిగి వచ్చి తనను రక్షించినట్లు ఫీలయ్యాడు.

గబగబా ముందుకు నడిచి తన ప్రాణదాత రెండు చేతులు పట్టుకున్నాడు.

"కాళీ! నువ్వీరోజు నిజంగా నా ప్రాణాన్ని కాపాడావు. నీ ఋణం నేనెప్పటికీ తీర్చుకోలేను. నువ్వే లేకపోయినట్లయితే..." ఇక అతడు మాట్లాడలేకపోయాడు. కాళీపట్ల కృతజ్ఞత అతని కళ్ళల్లో స్పష్టంగా కనబడుతోంది.

కాళీ అదోరకంగా నవ్వాడు.

"దీనిలో నేను చేసిందేముందండీ! పదండి! ఆట మధ్య లోనే ఆపేసాం," అంటూ జేబులోనుండి 'ఫైవ్ స్టార్' చాక్లెట్ బయటకు తీసాడు.

## 10

ఇనస్పెక్టర్ కోణంగి తన చేతికి చిక్కిన డైరీలు ఆత్రంగా తిరగేయసాగాడు.

ఒక డైరీలో ఇలా ఉంది—

రమణారావు మరీ ప్రతిబంధంగా తయారయ్యాడు. ఇక ఉపేక్షిస్తే లాభంలేదు. అడ్డు తొలగించుకోవాలి.

కొన్ని పేజీలు తిరిగాయి.

పోలీసులకు ఫోన్ చేసి రమణారావు సరుకుతో రెడ్ హేండెడ్ గా దొరికేటట్లు చేసాను. రమణారావు జైలు కెళ్ళాడు. చాల తేలికగా అతనికి నమస్తే చెప్పేసాను.

"తన ఊహ కరెక్టే. రమణారావుతో హరిగోపాల్ కి కాంటాక్ట్ ఉంది" మరో డైరీ తీసాడు కోణంగి.

నరహరి దుర్మార్గుడు. రమణారావు జైలుకెళ్ళడానికి కారణం నేనేనని దుమ్మెత్తిపోసాడు. మా ఇద్దరికీ ఘర్షణ జరిగింది. నీ అంతు తేలుస్తానని నన్ను బెదిరిస్తాడా? వాడి నిలా వదలకూడదు.

పేజీలు తిప్పుతున్నాడు కోణంగి. తనకు కావాల్సిన ముఖ్యమైన సమాచారమేమీ లేదందులో.

టైము చూసుకున్నాడు. ఇంకా అరగంటే ఉంది. ఖంగారుగా కాస్త కొత్తదిగా కనిపిస్తున్న డైరీ అందుకున్నాడు.

మంచి పనే జరిగింది. నరహరి చచ్చాడు. ఎవడో వాడిచేత నమస్తే నమస్తే చెప్పించేశాడు.

మరికొన్ని పేజీల తరువాత—

వ్యాపారం లాభసాటిగా లేదు. అప్పులవాళ్ళ ఒత్తిడి ఎక్కువవుతూంది. రిచర్డ్ దగ్గరకు వెళ్ళాను.

కోణంగి కళ్ళు మెరిసాయి.

'రి' అంటే రిచర్డ్ చకచకా చదవసాగాడు.

పదివేలు కావాలని అడిగాను. స్నేహితుడనిపించు కున్నాడు. ఇచ్చాడు. తనవల్ల ఏమైనా అవసరముంటే ఫోన్ చెయ్యమన్నాడు. రిచర్డ్ నెంబర్ 74482.

డైరీ మూసేసాడు కోణంగి. రిచర్డ్‌ని రక్షించాలి. రాకెట్ వేగంతో బయటకు పరుగెత్తాడు.

# 11

"ఆట ఎలా ఉంది సార్" అడిగాడి కాళీ.

"ఇంకా బ్రతక లేదోయ్! కౌంట్ అర్ షోలో ఉంది."

"నా ఆట అయిపోవచ్చింది. టచ్ కోసం ఎదురుచూస్తు న్నాను. నేను ఆట ముగించేలోగా ఆట బ్రతికించ డానికి ట్రై చెయ్యండి. పైగా ఇది మీరు జీవితంలో ఆడే చివరి ఆట."

రిచర్డ్ చురుగ్గా చూసాడు కాళీని.

ఏమనుకున్నాడో! నవ్వేసాడు.

"గుడ్ జోక్" అంటూ ముక్క లాగాడు.

నిరుత్సాహంగా ముఖంపెట్టి ఇదీ పనికిరాదు అన్నాడు. కాస్సేపు ఆలోచించి ముక్క కొట్టాడు.

ఆ ముక్క అందుకుని 'షో' అన్నాడు కాళీ.

"ఛీ! కౌంటయిపోయింది" ఓకులు లెక్కెట్టసాగాడు రిచర్డ్.

"ఓకులుకాదు మిస్టర్ రిచర్డ్! మీ అంతిమ క్షణాలు

లెక్కబెట్టండి,'' అన్నాడు కాళీ కఠినంగా.

కాళీ చేతిలో మెరుస్తున్న కత్తిని చూడగానే రిచర్డ్ అవాక్కయిపోయాడు.

"ఏమిటిది?'' అన్నాడు తత్తరపాటుతో.

"కత్తి! రిచర్డ్! కత్తి! ఇంకా కొద్దిక్షణాల్లో నిలువునా విషం నిండుకున్న నీ దేహంలోకి దూసుకుపోయే పదునైన కత్తి'' వెటకారంగా నవ్వాడు కాళీ.

"డోంట్ బి ఫూలిష్! ఆ కత్తి దూరంగా ఉంచు'' అరిచాడు రిచర్డ్.

"అరవాలని ప్రయత్నించకు రిచర్డ్! నిన్నెవరూ ఆదుకో లేరు. నీ స్నేహితులు నరహరి, రమణారావు, హరిగోపాల్ నీకోసం యమలోకంలో ఎదురుచూస్తూ ఉంటారు. నిన్ను వాళ్ళదగ్గరకే పంపిస్తాను.''

"అయితే వాళ్ళను నువ్వేనా చంపింది'' నమ్మలేనట్లు అడిగాడు రిచర్డ్.

"అవును. నిన్నూ నేనే చంపుతాను.''

"నేను నమ్మలేను. ఇంతకుముందే పాముకాటు నుండి నన్ను రక్షించావు. నా ప్రాణాలు కాపాడావు. నువ్వే నన్ను చంపుతావంటే నమ్మశక్యం కావటంలేదు,'' పిచ్చిగా చూస్తూ అన్నాడు రిచర్డ్.

"ఆ పాము నిన్ను కాటువేసి చంపితే నా పగ ఎలా తీరుతుంది? నా చేతులతో నిన్ను చంపి నా కసి తీర్చు కోవడం కోసమే పాము బారినుండి నిన్ను రక్షించాను'' ఈసడింపుగా చూస్తూ అన్నాడు కాళీ.

"ఎందుకు నీకు నామీదంత కసి,'' వాపోయాడు రిచర్డ్.

"ఎందుకా? ఇందుకు" జేబులోనుండి ఫోటో బయటకు లాగాడు కాళీ.

"ఈమె గుర్తుందా?"

రిచర్డ్ కళ్ళార్పకుండా ఫోటో వంక చూసాడు. "గుర్తుంది. ఈమెకూ నీకూ ఏమిటి సంబంధం."

"ఆ సంబంధం నీకు తెలియజేయడం నా కిష్టంలేదు. ఆ విషయం తెలియకుండానే నువ్వు చావడం నా కిష్టం."

"నన్ను గుర్తుపట్టగలవేమో ప్రయత్నించి చూడు."

అర్థంకానట్లు ముఖంపెట్టాడు రిచర్డ్.

"చెప్పినా విని భరించలేవు. చావు" అంటూ కత్తితో బలంగా పొడిచాడు కాళీ. భయంకరంగా ఆర్తనాదం చేసాడు రిచర్డ్.

కాళీ జుట్టు పైకెగరేసాడు. చూపుడువేలు కసిగా కొరికాడు. మరింత కసిగా మరో నాల్గు పోట్లు పొడిచాడు.

# 12

జీపులోనుండి క్రిందకు ఉరికాడు ఇన్స్పెక్టర్ కోణంగి. శరవేగంతో రిచర్డ్ ఇంట్లోకి పరుగెత్తాడు. నౌకర్లిద్దరు ఎదురొచ్చారు. భయంతో వణుకుతూ "సార్! అయ్యగారిని..."

వాళ్ళ మాటలకు ఎదురొచ్చి "ఎక్కడ" అని గట్టిగా అరిచాడు కోణంగి.

వాళ్ళు చూపించిన వైపుగా పరుగెత్తాడు. గదిలో ప్రవేశించి అలాగే నిలబడిపోయాడు. రిచర్డ్ శవం సోఫాలో ఒరిగిపడుంది. మరికొంత దూరంలో ఒక యువకుడు చచ్చి పడున్నాడు. అతని గుండెల్లో కత్తి దిగబడి ఉంది. అతని ఎడమచేతిలో ఏదో కవరుంది.

మెల్లిగా అటువైపు నడిచాడు ఇన్‌స్పెక్టర్. వంగి కవరందుకున్నాడు. తెరిచి చదివాడు.

"ఇన్‌స్పెక్టర్ కోణంగిగారికి—

ఈ ఉత్తరం మీకు నా చావు తరువాత అందాలన్న ఉద్దేశంతో ముందే వ్రాసి ఉంచాను.

నరహరి, రమణారావు, హరిగోపాల్, రిచర్డ్— ఈ నలుగుర్నీ నేనే చంపాను. సరదాకోసం నేను వీళ్ళను చంపలేదు. నేనెందుకు వీళ్ళను చంపాల్సి వచ్చిందీ మీకు తెలియాలనే అంతా విపులంగా వ్రాస్తున్నాను.

ఇప్పటికి ఇరవైమూడేళ్ళనాటి సంగతి. వీళ్ళు నలుగురూ ఆ రోజుల్లో ప్రాణమిత్రులు పేరుమోసిన రౌడీలు. పొగరు మోత్తనంతో తామేంచేసినా ఎదురులేదని విర్రవీగే వాళ్ళు.

ఒకరోజు అడివిప్రాంతానికి వేటకు వెళ్ళారు. సాయంత్ర మయ్యేవరకూ వేటాడారు. చీకటి పడింది. దారి తప్పారు. ఎలాగోలా దగ్గరలో ఉన్న పల్లెకు చేరుకున్నారు.

ఒక ఇంట్లో ఆ రాత్రికి ఆశ్రమం కోరారు.

ఆ ఇంట్లో ఆ సమయంలో ఒక అమాయకురాలు ఒంట రిగా ఉన్న ఆడది కనిపించేసరికి వారిలోని పైశాచికత్వం ద్విగుణీకృతమైంది. ఆమెను వాళ్ళ కామాని కెరచేసారు.

అమానుషంగా ఆమె శీలాన్ని కొల్లగొట్టారు. వాళ్ళ రాక్షస రతికి బలయిపోయింది. ఆమెనలాగే వదిలేసి వాళ్లు పారిపోయారు. ఆ తొందరలో హరిగోపాల్ తన డైరీ నక్కడే వదిలి పారిపోయాడు. అందులో వాళ్ళు తీయించు కున్న గ్రూప్ ఫోటో కూడ ఉంది.

పాపం ఆ అమాయకురాలు మూగదికూడ. తనకు జరిగిన

అన్యాయాన్ని ఎవరికీ నోరు తెరిచి కూడ చెప్పుకోలేని పరిస్థితి ఆమెది.

ఆమెకు ఒక అన్నయ్య ఉన్నాడు. చుట్టుపక్కల ఊర్లలో బొమ్మలమ్ముకొని అతడెప్పటికో ఇల్లు చేరుకున్నాడు. పరిస్థితుల నర్థం చేసుకున్నాడు.

డైరీలోని వివరాలద్వారా పట్నం వెళ్ళి వాళ్ళ గురించి కూపీతీసాడు. కాని బదులుగా ఏమీ చెయ్యలేని నిస్సహాయుడతడు. అతనికి ఒక చెయ్యిలేదు. పోలీస్ రిపోర్టు చేశాడు. కాని ఫలితం కనిపించలేదు. ధైర్యం కూడగట్టుకుని చెల్లెల్ని ఊరడించాడు.

ఆమెకు జరిగిన అన్యాయం చాలదన్నట్లుగా ఆమె గర్భం దాల్చింది. నన్ను కన్నది. లోకులు కాకుల్లా పొడిచినా లెక్కచేయక నన్ను సాకింది. ఎంతో ప్రేమతో పెంచింది. చదివించింది.

నేను కాలేజీలో ఉండగా మా అమ్మ కన్నుమూసింది. అంతేగాని, ఈ వివరాలేవీ నా కప్పట్లో తెలియవు. నేను బాగా చదువుకున్నాను. కాకతాళీయంగా రిచర్డ్ దగ్గరే నాకు ఉన్నతోద్యోగం దొరికింది.

సరిగ్గా నెలరోజుల క్రితం మా మామయ్యకూడ మరణించాడు. ఆయన పోయేముందు నాకీ ఘోరమైన నిజాన్ని వెల్లడించి మరీపోయాడు.

నాకు పిచ్చెక్కినంత పనయింది. ఇంతకీ నే నెవరి బిడ్డను? వాళ్ళలో నా తండ్రి ఎవడు? వాళ్ళలో ఫలానా వాడు నా తండ్రి అని తెలిసినా నేను భరించలేను. ఆ భయంకరమైన నిజాన్ని నేను ఒప్పుకోలేను. సహించలేను.

అందుకే బాగా ఆలోచించి ఒక నిర్ణయానికొచ్చాను.

వాళ్ళందర్నీ వెంటనే చంపేయాలనుకున్నాను. నా తల్లి బ్రతికినన్నాళ్ళూ అనుభవించిన నరకయాతనకు కారణమైన వాళ్ళమీద కసి తీర్చుకోవాలనుకున్నాను.

ఒకరి తరువాత ఒకరిని హత్యచేసాను. నా తల్లికి జరిగిన అన్యాయానికి తగిన ప్రతీకారం చెయ్యగలిగాననే అనుకుంటున్నాను.

నా లక్ష్యం నెరవేరింది. ఇక నేను బ్రతికి సాధించాల్సిందేదీ లేదు. నేను చేసింది చట్టం దృష్టిలో నేరమనీ తెలుసు. అందుకే ఆత్మహత్య చేసుకుంటున్నాను.

నా కసికి వెనక దాగున్న వ్యథను సానుభూతితో అర్థం చేసుకోగలిగితే నాకంతే చాలు. సెలవ్.

—కాళీ.''

ఉత్తరం పూర్తి చేసిన కోణంగి కళ్ళనుండి అప్రయత్నంగానే రెండు కన్నీటిబొట్లు రాలిపడ్డాయి.

—: ఐపోయింది :—

# టైం బాంబ్!

ఏ. వీ. మోహన్రావ్

అర్థరాత్రి ఆరో నెంబరు ఇంటిముందు టాక్సీ ఆగింది. వెనుక తలుపు తెరచుకొని దిగింది అందంగా వున్న పాతికేళ్ళ స్త్రీ. చేతిలోవున్న హాండ్ బ్యాగ్ బరువుగా వున్నట్లు ఆమె పట్టుకొన్న తీరును చూచి ఎవరైనా ఊహించవచ్చు.

"మేడమ్! వెయిట్ చెయ్యమంటారా?" అడిగాడు డ్రైవరు.

"పదినిముషాల్లో వస్తాను!" అంటూ మెట్లెక్కింది.

కాలింగ్ బెల్ నొక్కింది.

రెండు క్షణాల తర్వాత తలుపులు తెరచుకొన్నాయి. అవతలివేపు నైట్ డ్రెస్‌లో వున్న అందమైన అమ్మాయి

నిలుచుని వుంది.

"ఎవరు కావాలి?" అడిగింది లోపలున్న అమ్మాయి.

"నువ్వే!" చెప్పింది టాక్సీలోంచి దిగినావిడ.

"మీరెవరో నాకు గుర్తురావడం లేదు! అసలు ఇంతకు ముందెప్పుడూ చూచినట్లు కూడా లేదు. నాతో ఏం పని?" అడిగిందా అమ్మాయి మళ్ళీ.

"ఇలా వీధిలో మాట్లాడుకోవడం నాకు నచ్చదు. లోపలికెళ్ళి మాట్లాడుకుందాం!" అంది.

"రండి!" అంటూ ఆ అమ్మాయి వెనక్కి నడిచింది.

టాక్సీలోంచి దిగిన అమ్మాయి అనుసరించింది.

ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు సోఫాల్లో.

"చెప్పండి!" అంది నైట్ డ్రెస్‌లో వున్న అమ్మాయి.

"అరుణారాణివి నువ్వే కదూ!" అడిగింది టాక్సీలోంచి దిగినావిడ.

"అవును! నేనే! మీరెవరో చెప్పండి!"

"శాంతిలాల్ జైన్‌ను నీకు తెలుసుగా?"

"తెలుసు!"

"నేనతని భార్యను. అతను నన్ను అగ్నిసాక్షిగా పెళ్ళాడాడు. మాకు ఇద్దరు పిల్లలుకూడ వున్నారు."

"మీ పేరు!"

"విజయ కౌర్! అందరూ విజయనే అంటారు. ఆ పేరుతో పిలిస్తే చాలు!"

"ఇంతకూ నా దగ్గర కెందుకొచ్చారు."

"అరుమాసాలనుండి నా భర్త నాతో సరిగా కాపరం చెయ్యడం లేదు. వ్యాపారపు పనులంటూ రోజుల తరబడి ఇంటికి దూరంగా వుంటున్నాడు. నష్టం వస్తుందంటూ

చాలా నగలు, తీసుకెళ్ళి అమ్మివేశాడు. ఇన్నాళ్ళు హాయిగా బ్రతికాం. ఇప్పుడు తిండికి కూడా వాచిపోయే ప్రమాదం వచ్చి పడింది. అందుకే ఇల్లు వదలి ఇలా వీధిన పడవలసి వచ్చింది!" చెప్పింది విజయ.

"మీ సమస్యలకు పరిష్కారం నా యింట్లో దొరుకుతుందని ఎలా అనుకున్నారు?" అడిగింది అరుణారాణి.

"నీ జాణతనం నాదగ్గర చూపించకు. ఆయన్ని నువ్వు వల్లో వేసుకోలేదూ?" అడిగింది విజయ అసూయగా చూస్తూ.

"మాటలు తిన్నగా రానీ! అవాకులూ చెవాకులూ పేలావంటే పళ్ళు రాలగొడతాను?" అంది అరుణారాణి కోపంగా.

"కానీ! చేసి చూపించు!!" అంటూ కుర్చీలోంచి లేచి దగ్గరకంటా వెళ్ళింది విజయ ఆమెకు.

అరుణ వెనక్కి నడచింది.

"భయపడిపోతున్నావేం వెనక్కి?" అంటూ పైపైకి పోయి అరుణజుట్టు పట్టుకుంది. ఆమెకూడా విజయతో కలబడింది.

ఇద్దరూ ఒకర్నొకరు త్రోసుకున్నారు.

పట్లు విడవకుండా క్రిందపడ్డారు. తమాయించుకొని లేచారు. కాళ్ళతో కుమ్ముకున్నారు. ఆపకుండా ఒకర్నొకరు తిట్టుకుంటూనే వున్నారు.

ఇంట్లోనుండి ఎవరన్నా అరుణకు సాయంవచ్చి తన్నుతంతారేమోనని అనుమానంగా లోపలినుండి హాల్లోకి వచ్చే గుమ్మంకేసి కన్నువేసే వుంచింది విజయ. కానీ ఎవ్వరూ వస్తున్న జాడలేకపోవడంతో ధైర్యం ఎక్కువయిందామెకు.

"మర్యాదగా నన్నొదలి వెళ్ళిపో! లేకుంటే నీ అంతు చూస్తాను!" అంది అరుణ.

"నీ అంతు చూడకుండా మాత్రం పోను నేను!" అంది విజయ జుట్టు ఇంకొంత గుంజి ఘట్టిగా క్రిందకు లాగుతూ.

అరుణకు తన బలం ఆమెను ఎదుర్కొనేందుకు చాల లేదన్న విషయం అర్థమైంది. అలానే వుంటే విజయ చావ చితకతన్నిపోవటం తథ్యమని కూడా తెలుసుకుంది. తోడుగా వుండే తల్లి ప్రొద్దున్నే బజారు వెళ్ళింది. ఆమె ఇంట్లో వుండివుంటే కొంతలో కొంత సాయంగా వుండి వుండేదనుకొంది.

పెద్దగా గావుకేకలు పెట్టడం మొదలెట్టింది. ఆ శబ్దం వీధిలోకి వినిపిస్తే, రోడ్న వెళ్ళే జనం వచ్చి అల్లరవుతుందని విజయకు భయంపుట్టింది. ఒక చేత్తో అరుణ నోరు మూసింది. అయినా ఆమె ఆగకుండా ఆ చేతిని విదలించి వేసి అరుపులు పెట్టింది.

ముందు విజయను తీసుకొచ్చిన టాక్సీ డ్రైవరు, ఆ తర్వాత మరో ముగ్గురు నలుగురు వీధివెంట వెళ్ళే మగాళ్ళు లోనికొచ్చారు, ఇద్దర్ని విడదీసి చెరోవైపుకు లాగేశారు.

లోనికొచ్చిన జనానికి ఈ కొట్లాట ఎందుకొచ్చిందో తెలుసుకోవాలన్న ఉత్సుకత కలిగింది. ఇద్దర్ని అడిగారు. ఇద్దరూ చెప్పకుండా తప్పించుకున్నారు.

విజయ వెలుపలికొచ్చి టాక్సీ ఎక్కి కూర్చుంది. టాక్సీ డ్రైవరు వచ్చి స్టార్ట్ చేశాడు.

"ఎందుకమ్మా ఆమెనలా అల్లరిపెట్టావ్?" అడిగాడు టాక్సీ డ్రైవరు విజయను.

"నువ్వు నీ భార్యను వదిలేసి ఇంకెవరితోనన్నా తిరుగుతున్నావా?" అడిగింది విజయ.

"లేదమ్మా!"

"అయితే నీ కర్థంకాదు" అంది ముక్తసరిగా.

టాక్సీ డ్రైవరు తన కేదో అర్థమైనట్లుగా నవ్వటం అద్దంలోంచి చూచి గమనించింది విజయ.

"అమ్మా!" పిలిచాడు డ్రైవరు.

"ఏమిటి?"

"మీ సమస్య నా కర్థమైంది. కానీ మగణ్ణి అదుపులో పెట్టుకోవాలిగాని, ఇలా సాటి ఆడదానిపైకి వెళ్ళడం తప్పనిపిస్తూంది నాకు!"

"నువ్వన్నది నిజమే, కానీ ఆ దరిద్రుడు నా కొంప ఛాయలకయినా రావడంలేదు సరిగా. ఏంచేసేది? ఎటూ తోచక ఇటొచ్చాను."

టాక్సీ విజయ కాపురముంటున్న రోడ్ మొదట్లోకి రాగానే ఆపించి డబ్బిచ్చి దిగి నడచి వెళ్ళింది.

## 2

ఆ రోజు సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో విజయ వంటపని చేసుకొంటూ వుంటే తలుపుతట్టిన చప్పుడయి వచ్చి తెరచింది. ఎదురుగా సాక్షాత్తు తన భర్తయిన శాంతిలాల్ దర్శనమిచ్చాడు. ఆమె మనస్సు ఆనందంతో గంతులు వేసింది. అంతలోనే తనపట్ల అతను ఇన్నాళ్ళనుంచి చూపుతున్న అనాసక్తత, అశ్రద్ధ గుర్తుకొచ్చి, అసహ్యం పుట్టుకొచ్చింది.

"లోనికి రావచ్చా?" అడిగాడు శాంతిలాల్ బిక్కపోయినట్లు.

"రావటానికికూడా అర్హత పోయిందేమోనని మీకు అనుమానంగా వుందా?" అడిగింది విజయ.

"అదికాదు!"

"ఇంకేది?"

"కోపంగా వున్నావేమోనని" నసిగాడు శాంతిలాల్.

"అలా గడపబైటే నిలుచుని ఎంతసేపు మాట్లాడుతారు. లోనికి రండి!" అంటూ గదిలోకి దారితీసింది విజయ.

"ఆ వగలాడి మిమ్మల్ని వదలిపెట్టిందా?"

"ఎవరే నువ్వు చెప్పే వగలాడి?"

"తెలీనట్లు అమాయకుల్లా మాట్లాడుతారే. ఆ అరుణా రాణి పూర్తిగా మిమ్మల్ని గోరిగి మరీ పంపిందిగదూ!"

"ఛా! ఏమిటా మాటలు. అలాంటి పేరుగలవాళ్ళెవరూ నాకు తెలీదు. నేను వ్యాపారపు వ్యవహారాల్లో ఊళ్ళు తిరుగుతూండిపోయాను."

"వ్యాపారంలో మళ్ళీ నష్టం వచ్చిందిగదూ! నా దగ్గర మిగిలిందేమైన ఉందేమో అదికూడా లాక్కుపోదామని వచ్చి వుంటారు. ప్రాణాలు మాత్రం వున్నాయి. కానే వాళ్ళుంటే వాట్నికూడా అమ్ముకోండి" అంది విజయ కోపంగా.

"విజయా! మరీ నన్ను రాక్షసుడిలా చిత్రించకు. వ్యాపారం అన్న తర్వాత లాభాలు రావడంతో నష్టాలు వస్తాయి. నష్టాల తర్వాత లాభాలు వస్తాయి. అది సహజం పోయినదఫా నష్టంవచ్చి నీ నగలు తీసుకొన్నాను. ఈసారి విపరీతమైన లాభాలు వచ్చాయి. నిన్ను బంగారంలో ముంచి తేలుస్తాను." అన్నాడు గర్వంగా శాంతిలాల్.

"నన్నెందుకు? ఆ రంగేళీ రంకుముండ అరుణారాణిని ముంచండి. ఆనందిస్తుంది!" అంది విజయ కోపంగా.

శాంతిలాల్ కు ఆమెను ఎలా ఊరడించాలో, ఎలా తనవేపు ప్రసన్నంచేసుకొని, త్రిప్పుకోవాలో అర్థంగాక అయోమయంగా ఆమె కళ్ళలోకి చూడసాగాడు.

"జరిగింది చెప్తాను. వినే ఓపికుందా నీకు?"

"చెప్పండి వింటాను."

"నీ నగలు అమ్మి డబ్బుతీసుకొని గోవా వెళ్ళాను. అక్కడ నాకో పెద్ద స్మగలర్ పరిచయమయినాడు. అతన్ని ఏదైనా మంచి వ్యాపారం చూపించమని బ్రతిమలాడాను. నామీద దయతలచి గంజాయి కొని సేకరించుకొని తెచ్చి ఇస్తే, అది తీసుకొని బంగారు బిస్కెట్లు ఇస్తానన్నాడు. అతను చెప్పిన ప్రకారం చాలా ఊళ్ళు తిరిగి గంజాయి సేకరించి తెచ్చి ఇచ్చాను. అది తీసుకొని బంగారం ఇచ్చాడు. ఆ బంగారం అమ్మి మళ్ళీ గంజాయి తెచ్చాను. ప్రస్తుతం నా దగ్గర నలభై కిలోల బంగారం వుంది."

అంత బంగారం గురించి వినగానే విజయకు నీరుగారిపోయింది. భర్తపైనున్న కోపమంతా అంతర్ధానమైంది.

"ఎక్కడ దాచారు" అడిగింది రహస్యంగా.

"అక్కడే ఒకచోట దాచాను. ఆ వ్యాపారంలో స్థిరపడిపోదా మనుకుంటున్నాను. గంజాయి తెచ్చి ఇచ్చే ఏజంట్లను నియమించుకుంటే చాలు. ఒక క్రమపద్ధతిలో వ్యాపారం జరిగిపోతుంది." అన్నాడు శాంతిలాల్.

"అంతా బంగారేనా? క్యాష్ కూడా ఏమైనావుందా?"

"లక్షదాకా వుంది. నీ కిద్దామని పదివేలు తెచ్చాను ఖర్చులకోసం." అంటూ జేబులోంచి వందరూపాయల

నోట్లకట్టొకటి తీసి అందించాడు. విజయ దాన్ని అందుకుని, జాకెట్‌లో దోపుకోను ప్రయత్నించింది. రొమ్ములను అదిమి పట్టుకొనివున్న జాకెట్, ఆ కట్ట పట్టడానికి కావలసినంత స్థలం ఇవ్వకపోవడంతో తన ప్రయత్నం మానుకొంది విజయ.

"ఇప్పటికైనా కోపం తగ్గిందా?" అడిగాడు శాంతిలాల్.

"తగ్గలేదు! మీరు వెళ్ళి మొహం కడుక్కురండి. కాఫీ ఇస్తాను!" అంటూ హడావుడిగా వెళ్ళి కాఫీ, టిఫను తయారుచేసి తెచ్చి ఇచ్చింది.

పకోడీలు నములుతూ భార్యవేపు చూశాడు శాంతిలాల్. తన కళ్ళలోకి ఆమె చూస్తున్నట్లు అనిపించింది.

"ఏమిటి విజయా? అలా చూస్తున్నావ్?"

"ఏంలేదు! మీకూ ఆ అరుణారాణీకి అసలు సంబంధం లేదా?"

"నీమీద ఒట్టు! ఆమె ఎవరో కూడా నాకు తెలీదు!" ప్లేటు తన నెత్తిన పెట్టుకుంటున్నట్లుగా చూపించి అన్నాడు శాంతిలాల్.

"మరి మన ప్రక్కింటి రతన్‌లాల్ భార్య విమల చెప్పిందే నాకు, మిమ్మల్ని చాలాసార్లు ఆ అమ్మాయితో చూచినట్లు, వాళ్ళాయన చెప్పాడట" అంది విజయ.

"వాడి రహస్యం నేనెక్కడ బైటపెడతానోనని, భయంతో ఇలా ముందే నాగురించి లేనిపోనివి చెప్పాడన్న మాట! రాస్కెల్. వాడి అంతు తేలుస్తాను రేపు!" పళ్ళు కొరికాడు శాంతిలాల్.

"అయిందేదో అయింది. అతని జోలికి వెళ్ళకండి.

ఇంతకూ అతనికేమిటి రహస్యం!'' మరో రెండు పకోడా పలుకులు ప్లేట్లో వేస్తూ అడిగింది.

''వాడు అసలు ఆ అరుణారాణిని ఉంచుకొనున్నాడు. వాళ్ళిద్దరూ ఒకసారి నాకు పూనాలో కలిశారు. వాణ్ణి దూరంగా పిలిచి చీవాట్లు పెట్టాను. ఇంట్లో వాడి పెళ్ళాంతో చెప్పి చీపురుదెబ్బలు వేయిస్తానన్నాను.''

''అలాగా! అయినా ఇంత పచ్చిగా అబద్ధాలు చెప్తాడనుకోలేదు!'' అంది విజయ.

ఆ రాత్రంతా ఇద్దరూ హాయిగా గడిపారు. శాంతిలాల్ భార్యకు ముందు ముందు తాము ఎలాంటి జీవితం గడపబోయేది ఊహించి అందంగా చెపుతూంటే ఆమె ఊరి ఉబ్బి తబ్బిబ్బయి తన్నుతనే మరచిపోయి మసలుకొంది.

తెల్లారాక బజారు వెళ్ళి భోజనానికి తిరిగొస్తానని చెప్పాడు శాంతిలాల్. ఆరోజు అతని కిష్టమైన వంటకాలన్నీ చేసింది విజయ.

ఒంటిగంట కొచ్చి భోజనం చేశాడు.

కాసేపు పడుకుని విశ్రాంతి తీసుకున్నాడు.

నిద్రలేచి కాఫీ త్రాగి భార్యను పిలిచి, వెంటతెచ్చిన బ్రాండ్ కేస్‌లోంచి కొన్ని కాగితాలు తీసి, అక్కడక్కడ సంతకాలు చేయించాడు.

ఆ ఫారాలు ఏమిటో అర్థంగాలేదు. అడిగింది భర్తను. ఆమె పేర ఇల్లు కొంటున్నట్లుగా చెప్పాడు గోపాలో.

''పెద్దదేనా?'' అడిగింది పేనా మూత పెడుతూ.

''ఆ పెద్దబంగళా. మొత్తం నలభై గదులున్నాయి. మరీ చౌకగా దొరికింది. దాని ఓనరు ఇక్కడున్నాడు.

ప్రొద్దున్నే వెళ్ళి చెక్ రాసిచ్చి, కాగితాలు తయారు చేయించి తెచ్చాను" అన్నాడు శాంతిలాల్.

"మనం ఎప్పుడు వెళ్దాం?"

"నేను రేపు వెళ్తాను. నీకు వైనెల పదో తేది గోవా వచ్చేందుకు విమానంలో టిక్కెట్టు కొన్నాను. ఈలోగా నేను చాలా ఊళ్ళు తిరిగి ఏజంట్లను నియమించాలి. ఆ రోజుకు గోవాకు చేరుకుంటాను. ఎయిర్ పోర్ట్ లో రిసీవ్ చేసుకుంటాను. ఇక్కడి సామానంతా వదిలేసెయ్. అన్నీ అక్కడ కొందాం క్రొత్తగా" అన్నాడు శాంతిలాల్.

"పైనెల పదో తేదీ అంటే సరిగ్గా నెలరోజుల కన్న మాట!"

"అవును!"

"ముందుగా రాలేరా?"

"వీలుకాదు విజయా! దాదాపు వంద ఊళ్ళు తిరగాలి నేను."

"సరేలెండి! మీరు రావడం మరచిపోయేరు. తీరా విమానం దిగాక మీరు కనిపించకుంటే నా పని ఏమైనా వుంటుంది!" అంది భయంగా విజయ.

"అలాంటి భయమేమీ పెట్టుకోకు. నేను హాజరుగా వుంటాను అక్కడ నీకోసం!" అన్నాడు శాంతిలాల్.

విజయ సంతకాలు చేసిన కాగితాలన్నీ ఒక పెద్ద కవరులో పెట్టుకున్నాడు అది తీసి బ్రాండ్ కేస్ లో జాగ్రత్తగా సర్దుకున్నాడు.

మధ్యాహ్నం మూడుగంటలకు ముస్తాబై బజారు కెళ్లారు. విజయ ఇంట్లోకి కావలసినవన్నీ కొనుక్కుంది.

ఆ తర్వాత ఇద్దరూ సినిమాకు వెళ్ళారు.

సినిమా వదిలాక హోటల్‌లో భోజనంచేసి ఇల్లు చేరు కున్నారు. తెల్లారాక బట్టలు సర్దుకుని భార్య దగ్గర శెలవు తీసుకుని వెళ్ళిపోయాడు శాంతిలాల్. విజయ అతను కనుపించినంత దూరం చూస్తూ వుండిపోయింది గుమ్మంలో.

# 3

పదో తేదీ వచ్చింది.

విజయకు మొత్తం హడావుడిగా వుంది.

ఆరోజే ఆమె విమానంలో గోవాకు వెళ్ళాలి. పిల్లలిద్దర్నీ తల్లిదగ్గర ముందే దిగవిడిచివుంది. ముందు వాళ్ళనుకూడా పిల్చుకొని వెళ్దామనుకుంది గోవాకు. కానీ ఇల్లు సర్దుకుని, వచ్చి తీసుకెళ్ళటం మంచిదన్న నిర్ణయాని కొచ్చింది.

తొమ్మిదింటికల్లా ఎయిర్‌పోర్ట్ చేరుకొంది విజయ. సెక్యూరిటీ చెకింగ్ ముగిసేసరికి పదయింది.

మరో అరగంటలో విమానం బయలుదేరుతుందని తెలుసుకొంది. ఆ విమానం కలకత్తానుండి వచ్చి, ఇక్కడ ఆగి ఆ తర్వాత గోవా వెళుతుందని కూడా అడిగి తెలుసు కొంది.

వాతావరణం బాగులేనందువల్ల గోవాకు పోవలసిన విమానం కలకత్తానుంచి ఆలస్యంగా బయలుదేరిందనీ, మరో రెండుగంటల్లో శాంతాక్రజ్ కు చేరుకుంటుందనీ, చేసిన అనౌన్స్‌మెంట్ విని కాస్త నిరుత్సాహపడింది.

ఆమెకు వీలైనంత త్వరగా గోవాకు చేరుకొని, తమ కోసం భర్తకొన్న క్రొత్త ఇల్లు చూడాలనీ, భర్త దాచి పెట్టిన బంగారం ఒకమారు చేత్తో తాకి, ఆనందించాలనీ, ఆరాటంగా వుంది.

మధ్యలో విమానం ఆలస్యంగా వస్తుందనేసరికి విసుగు పుట్టుకొచ్చింది.

విమానం పన్నెండుగంటలా ముప్పై నిముషాలకు వచ్చింది. రన్ వే పైన ఆగగానే, నిచ్చెనలాంటి దొకటి పదిమంది నెట్టుకెళ్ళి దానికి అనుకునేట్లు వేశారు. లోప ల్నుండి తలుపులు తెరచుకున్నాయి. పాసెంజర్లు ఒక్కొ క్కరే దిగిరావటం మొదలెట్టారు.

అందరికన్నా వెనుకగా దిగివచ్చిన సూట్ వాలాను దాదాపు వందమంది చుట్టివేయటం గమనించింది. అతని మెడనిండా దండలు వేశారు. ఫోటోలు తీశారు. చేతుల వ్రేళ్ళు కరిగిపోయేట్లు వరుసగా కరచాలనం చెయ్యసాగారు అంతా.

దూరంనుంచే చూస్తున్న విజయకు అతనెవరో తెలుసు కోవాలనిపించింది. ఆ గుంపులోంచి ఆమె వేపుగా వచ్చిన మనిషిని చూసి "ఆయన ఎవరండీ?" అడిగింది మెల్లగా.

"వారు ప్రఖ్యాత డిటెక్టివ్ సుధాకర్ గారు!" అన్నాడు.

ఆమెకు చిన్నప్పటినుండి డిటెక్టివ్ పుస్తకాలుచదవడం అలవాటు. సుధాకర్ సాధించిన కొన్ని కేసులు వివరంగా పుస్తకాల రూపంలో ప్రచురించబడ్డాయి. వాటిన్ని చదివిందామె. ఆయన్ని చూసినందుకు అమితమైన ఆనందం కలిగింది. ఓమారు మాట్లాడితే బాగుండుననిపించింది. సూట్ కేస్ పట్టుకొని ఆ గుంపువేపు వెళ్ళింది.

విజయ వెళ్ళేసరికి జనం పల్చపడ్డారు. మొత్తం పది మంది మాత్రం వున్నారు. అందరూ మగవాళ్ళే. దూరంగా నిలుచున్న ఆమెను గమనించినట్లున్నాడు సుధాకర్. వాళ్ళను వదిలేసి ఆమెవైపు వచ్చాడు.

"నమస్తే!" అంది విజయ.

ప్రతి నమస్కారం చేస్తూ "మీరు నాకోసం నిలుచున్నారా?" అడిగాడు సుధాకర్.

అవునన్నట్లు తలూపింది విజయ.

"నాతో ఏమైనా ప్రత్యేకమైన పనివుందా?"

"లేదు! మీరని తెలిశాక ఓమారు పలకరించి పోవాలనిపించింది" అంది విజయ.

"థాంక్స్! మీరు ఎక్కడికైనా వెళ్తున్నారా?"

"గోవాకు పోతున్నాను."

"అక్కడేనా వుండటం!"

"లేదండీ! ఇప్పటిదాకా ఇక్కడే వున్నాం. ఈ మధ్యనే మావారు వ్యాపారరీత్యా అక్కడ సెటిలయినారు. అందువల్ల వెళ్ళిపోతున్నాను" అంది విజయ.

"నేను గోవాకు టికెట్ కొన్నాను. ఫ్రెండ్స్ అంతా మూగి రేపు వెళ్ళమంటున్నారు. ఈ దినమంతా నా ప్రాణం తీస్తారు విందులనీ, వినోదాలనీ. నేను రేపొస్తాను. ఓమారు కాసినో హోటల్‌లో అడగండి. నా రూం నెంబరు చెప్తారు. మీ వార్ని కూడా తీసుకురండి!" అన్నాడు సుధాకర్.

"అలాగేనండి!" అంది విజయ.

"థాంక్స్! వస్తాను!" అంటూ ఆమెదగ్గర శెలవు తీసుకున్నాడు. అతను వెళ్ళినంత దూరం చూస్తూ నిలుచుంది.

ఆ తర్వాత లౌడ్ స్పీకర్‌లో గోవాకు వెళ్ళే పాసెంజర్లు వెంటనే, విమానం చేరుకోవలసిందన్న హెచ్చరిక

వినిపించింది. హడావుడిగా పరుగెత్తుకుంటూ వెళ్ళి మెట్లెక్కి లోనికి చేరుకుంది.

చాలా సీట్లు ఖాళీగా వున్నాయి. అక్కడ వున్న వాళ్ళని కళ్ళతోనే లెఖగట్టింది. మొత్తం పదకొండు మంది వుండివుంటారనుకొంది పిల్లా జెల్లాతో కలిపి.

విజయకు మనస్సులో భయంభయంగా, గందరగోళంగా వుంది. ఇంతకుముందెప్పుడూ విమానం ఎక్కలేదు. ఇదే మొదటిసారి. కళ్ళు త్రిప్పినా, కడుపులో దేవినట్లయినా, చెమటలు క్రమ్మినా, తలనొప్పి వచ్చినా, వాడుకునేందుకు వీలుగా అవసరమైన అన్నిరకాల మందులూ వెంట తెచ్చుకుంది.

పైలట్లు పైకిరావటం, కాక్‌పిట్‌లోకి వెళ్ళడం గమనించింది. ఎయిర్‌హోస్టెస్ వచ్చింది.

ఆ తర్వాత రెండు నిముషాలకు తలుపులు మూశారు.

ఎయిర్‌హోస్టెస్ ప్రయాణీకులకు ఏవేవో సూచనలు చేసింది.

విమానం బయలుదేరుతున్న వార్త, లోపలవైపునున్న స్పీకర్లద్వారా వినిపించింది.

విజయకు అంతా వింతగా, విచిత్రంగా వుంది.

కారులా మెత్తటి తారురోడ్‌పైన పోతున్నట్లనిపించింది ముందు. ఆ తర్వాత బరువు తేలినట్టుగా తోచింది. విమానం గాలిలోకి లేచిపోయి వుంటుందనుకొని తల వెనక్కి వాల్చుకుని కూర్చుంది.

## 4

తాజ్ షెరతాన్ హోటల్‌లోని రెండో అంతస్తులో వున్న స్పెషల్‌రూంలో కూర్చున్న సుధాకర్, ముందున్న

ప్లేట్లోంచి వెజిటబుల్ బిరియానీ స్పూన్‌తో తీసి, పెరుగు పచ్చడితో ముంచి నోట్లో వేసుకున్నాడు.

రేడియోలోంచి వస్తున్న వార్తలను వింటూ వున్నాడు.

ఇప్పుడే వచ్చిన వార్త అంటూ బొంబాయినుంచి గోవాకు వెళ్ళవలసిన విమానం బెల్గాంకు ఇరవై మైళ్ళ దూరంలో క్రాష్ అయిపోయిన వైనం చెప్పాడు అనౌన్సరు.

స్పూన్ టేబుల్‌పైన పడేసి ఎడంచేతి వేపున్న ఫోన్ రిసీవరు అందుకుని "శాంతాక్రజ్ ఎయిరో డ్రోమ్ కంట్రోలు కనెక్టు చెయ్యండి!" అన్నాడు సుధాకర్.

రెండు నిముషాల్లో కనెక్షన్ వచ్చింది.

"నేను డిటెక్టివ్ సుధాకర్‌ను మాట్లాడుతున్నాను. రేడియోలో విన్నాను. గోవాకు వెళ్ళిన విమానం కూలి పోయిందా?"

"యస్. ప్లీజ్!"

"ఎక్కడ?"

"బెల్గాం అవతల. సెర్చిపార్టీని పంపాము. ఇంకా వివరాలు తెలీలేదు."

"ఐ. సీ. గంట తర్వాత ఫోన్‌చేస్తే వివరాలు తెలుస్తా యనుకుంటాను."

సుధాకర్ నెంబరు ఇచ్చాడు. ఆ తర్వాత ఫోన్ కట్ చేశాడు.

కలకత్తానుంచి తనా విమానంలో వచ్చాడు. పైలట్‌తో బాతాఖానీ వేశాడు. ఆ విమానం ఇంగ్లాండులో తయారుచేసినట్లు, ఇండియన్ ఎయిర్‌లైన్స్‌కున్న విమానాల్లో ఏవిధమైన రిపేరుచేయకుండా, ట్రబుల్ ఇవ్వకుండా

పనిచేస్తున్నది ఆ ఒక్క విమానమేనని గర్వంగా చెప్పాడు పైలట్.

కలకత్తాలో గ్రౌండ్ ఇంజనీర్లు దాన్ని పూర్తిగా చెక్ చెయ్యడం కళ్ళారా చూశాడు. శాంతాక్రజ్ లో కూడా ఫ్రెండ్స్ తో మాట్లాడుతూ, ఇంజనీర్లు చేస్తున్న చెకింగ్ ను గమనించాడు.

అలాంటి మంచి విమానం ఎందుకలా ఉన్నట్టుండి కూలిపోయి వుంటుందాని ఊహించసాగాడు.

గంట తర్వాత ఫోన్ వచ్చింది.

సెర్చిపార్టీకి ఆ విమానం జాడ తెలీలేదని చెప్పారు కంట్రోలు వాళ్ళు. రేడియోలో కూలిపోయిన విమానాన్ని ఎవరైనా చూస్తే వెంటనే దగ్గరేవున్న పోలీసుస్టేషనుకు రిపోర్టు చెయ్యమన్న అభ్యర్ధనలు దేశమంతా ప్రసారమైనాయి.

సుధాకర్ కు తన్ను ఎయిర్ పోర్ట్ లో పలకరించిన విజయ గుర్తొచ్చింది. క్రొత్త స్థలంలో భర్తతో క్రొత్త కాపురం పెట్టడానికి బయలుదేరిన ఆమెను విధి ఎంత క్రూరంగా బలి తీసుకొని వుంటుందో ఊహించి బాధపడ్డాడు.

ఆ రాత్రంతా మేలుకునే వున్నాడు సుధాకర్.

నాలుగైదుసార్లు ఎయిర్ పోర్ట్ కు ఫోన్ చేశాడు, కానీ ఏ విధమైన సమాచారం అందలేదని చెప్పారు.

తెల్లారాక సుధాకర్ ఎయిర్ పోర్టు చేరుకున్నాడు.

ఇండియన్ ఎయిర్ లైన్స్ చైర్మన్ గారు అక్కడే కనుపించారు. ఆయన విచారంగా వున్నారు. సుధాకర్ ను చూడగానే నవ్వు తెచ్చిపెట్టుకున్నాడు మొహాన.

"ఏమీ తెలీలేదా?" అడిగాడు సుధాకర్.

"లేదు! విమానం కూలిపోయినందుకు విచారంగా వుంది. దాన్ని మించి ఎక్కడ కూలిపోయిందో తెలుసుకోనందుకు మాకంతా చాలా ఆతృతగా వుంది" అన్నాడు ఛైర్మన్.

"సెర్చిపార్టీ వెళ్ళివచ్చారుగా!"

"హెలికాప్టర్లు కూడా పంపాం. వాటికూడా ఆ విమానం ఇంకా కనుపించలేదు!"

"చిత్రంగా వుంది. అదేం చిన్నవస్తువుకాదు మాయం కావటానికి. మనం నిరుత్సాహపడి లాభంలేదు. వెయిట్ చేద్దాం! ఏదైనా సమాచారం రాకుండా వుండదు!" అన్నాడు సుధాకర్.

అంతలోనే ఫోన్ మ్రోగింది.

ఛైర్మన్ అందుకున్నాడు.

అవతలివేపునుండి చెప్పిన విషయాన్ని విని "థాంక్స్!" అని రసీవరు పెట్టేశాడు ఛైర్మన్.

"రైల్వే ఎమర్జన్సీనుండి ఫోన్ చేశారు. బెల్గాంకు మూడు మైళ్ళదూరంలో రైల్వేట్రాక్ పైన పనిచేస్తూవుండిన కొంత మంది, వెనుకభాగాన నిప్పంటుకొన్న విమానం ఒకటి ట్రాక్ కు కుడివేపుగానే వున్న అడవులవేపు కూలిపోవటం చూశామని రిపోర్టు పంపారట."

"గుడ్! సెర్చిపార్టీని తయారుచెయ్యండి. నేను కూడా వాళ్ళతో వెళ్తాను!" అన్నాడు సుధాకర్.

"మీరూ వెళ్తారా?" ఆశ్చర్యంగా అడిగాడు ఛైర్మన్.

"అవును!"

"ఇది డిటెక్టివ్ పనికాదు. చాలా కష్టమైన పని."

"కాబట్టే వెళ్ళాలనుకుంటున్నాను."

"గుడ్! అలాగే వెళ్ళిరండి!" అన్నాడు ఛైర్మన్.

# 5

చిన్న విమానంలో ఇద్దరు ఎయిర్ లైన్స్ ఆఫీసర్లు, ఒక ఇంజనీరు, మరో ఫైరాఫీసరూ, సుధాకర్, మొత్తం ఐదుగురు బయలుదేరారు.

వాళ్ళెక్కిన విమానం గంటసేపట్లో బెల్గాం చేరుకుంది. అక్కడ్నుంచి కారులో రైల్వేట్రాక్ వద్దకు చేరుకున్నారు. అంతకుముందు రోజు పనిచేసిన గాంగు అక్కడే వుంది.

వాళ్ళను అడిగి, విమానం కూలిపోయింది ఎటువైపన్నదీ వివరంగా తెలుసుకున్నారు.

కారును అక్కడే వదలిపెట్టారు. అంతా కాలినడకన బయలుదేరారు.

అదంతా అడవి ప్రాంతం. చెట్లు చాలా ఎత్తుగా, చిక్కగా ఎదిగివున్నాయి. సాయంత్రం నాలుగుగంటల ప్రాంతంలోనే వెళ్ళినా, అడుగు ముందుకు వెయ్యడం అత్యంత కష్టంగా కనుపించింది అందరికీ.

వాచీలు చూసుకుంటూ అడుగులో అడుగు వేసుకుంటూ నడవసాగారు. చెట్లుకొన్న ముళ్ళకు తగులుకుని వేసుకున్న బట్టలు చీలికలు, పేలికలుగా మారాయి. టార్చి వెలిగించి చూసుకుంటూ ముందుకు పోసాగారు.

గంట ఐదయింది.

మరో గంటసేపు నడిచారు.

ఘాటైన వాసనేదో ముక్కులకు తగిలింది.

"ఏదో వాసన వస్తుందికదూ!" అడిగాడు సుధాకర్.

"అవును!" అన్నారు మిగిలినవాళ్ళు.

"అల్యూమినియంను కాల్చితే వచ్చే వాసనలాగుంది నాకు."

"అంటే ఆ విమానం ఇక్కడకు దగ్గరలోనే వుండి వుండాలి!" అంటూ ఉత్సాహంగా ముందుకు అడుగు వేశారు.

ఫర్లాంగు దూరంలో పెద్ద గొయ్యిలాంటి ప్రదేశంలో విమానం పడివుంది. వెనుక భాగమంతా నల్లగా తారులా మాడిపోయింది. ముందువేపు మొత్తం బాగుంది.

ఏదైనా ఫైర్ బర్స్ట్ అవుతుందేమోనని దూరంగా నిలుచునే చూచారు కాసేపు. అలాంటిదేమీ లేకపోవడంతో ముందు ఇంజనీర్లు, వాళ్ళవెంట వున్న మిగిలిన ఎక్స్‌పర్టులు విమానంవేపు వెళ్ళారు. సుధాకర్ ఒక్కడే మిగిలిపోయాడు.

అరగంట తర్వాత అంతా వెళొచ్చారు.

"ఏమైంది?" అడిగాడు సుధాకర్.

"పాసింజర్లు మొత్తం కాలి బూడిదయినారు. విమానంలో భాగాలన్నీ కూలిపోయేదాకా బాగా పనిచేసిన గుర్తులున్నాయి. టాంక్‌లో గాసొలిన్ వుంది. దానికి నిప్పంటుకోలేదు. అగ్నిప్రమాదం వెనుకవేపు జరిగింది. కాని అలా జరగడం అసాధ్యం. ఆ భాగంలో మండటానికి ఏవిధమైన అవకాశంలేదు!" అన్నాడు ఇంజనీరు.

"ఆ భాగంలో ఏముంటాయి?"

"పాసింజర్ల లగేజీ, దాంతోపాటు పార్శిళ్లు వుంటాయి" అన్నాడు ఇంజనీరు.

"అసాధ్యం! పెట్రోలు, ఫిల్ములు, ఆసిడ్స్, మొదలైన సామగ్రి అసలు బుక్ చెయ్యరు" అన్నాడు ఇంజనీరు.

సుధాకర్ ఆలోచించసాగాడు.

టార్చిలు వెలిగించి కార్గో కాబిన్‌లో మిగిలివున్న

పాకేజీల లిస్టు తీశారు. చాలావరకు యథాతథంగా వున్నాయి.

సుధాకర్ కూడా గోతిలోకి దిగి విమానం చుట్టూ తిరిగాడు. అక్కడినుండి వస్తున్న వాసన అతని ముక్కులను అదరగొట్టింది. చక్కెరతో చేసిన చాక్లెట్లను కాలిస్తే వచ్చే వాసనలాగుంది అది. అలాంటి వాసనే ఇంతకు ముందు ఎక్కడో గమనించాడు.

బుర్ర గోక్కున్నాడు. గుర్తొచ్చింది.

ఇండో-పాకిస్తాన్ యుద్ధంలో భారత సైన్యానికి అండగా వుండేందుకు ఆర్మీ హెడ్ క్వార్టర్సులో పని చేశాడు శత్రుసైన్యపు రహస్యాలను తెలుసుకోవటానికి. ఆ సమయంలోనే కొన్నాళ్ళు యుద్ధం జరుగుతున్న ప్రాంతాల్లోకూడా తిరిగాడు.

బాంబ్‌లు ప్రేల్చినప్పుడల్లా ఇలాంటి వాసనే వచ్చింది. ఆ వాసన తనకు సుపరిచితంగా మొదట్లోనే అనిపించింది.

"ఈ వాసన చూస్తే మీకేమనిపిస్తుంది?" అడిగాడు ఎక్స్‌ప్లోజివ్స్ ఎక్స్‌పర్ట్.

"బాంబ్ ప్రేల్చినట్లనిపిస్తూంది" అన్నాడతను.

తన అనుమానాన్ని అతను ధృవపరచినందుకు ఆనందం కలిగింది.

బొంబాయిలో విమానాన్ని మొత్తం చెక్ చేశారు. అందరి లగేజీ చూశారు. అలాంటప్పుడు దొంగతనంగా బాంబ్ ఎవరు పెట్టివుంటారు విమానంలో? అర్థం గాలేదు.

ప్రమాదం జరిగింది కార్గో నిల్వచేసే కాబిన్‌లో. అంటే అది లగేజీరూపంలో వచ్చివుండాలి.

సుధాకర్ మెదడు చకచక పనిచెయ్యడం మొదలెట్టింది.

విజయ గుర్తొచ్చింది. వెళ్ళి చూశాడు సుధాకర్.

నల్లగా బొగ్గులా కాలిపోయివుంది ఆమె, చీరమాత్రం కొంత మిగిలివుంది. దాన్నిబట్టే ఆమెను పోల్చుకున్నాడు.

ఆ ఉదయం అందరూ తిరిగి బొంబాయి వచ్చేశారు.

# 6

శాంతాక్రజ్ ఎయిర్‌పోర్టు ఎంక్వాయిరీ ఆఫీసువద్ద జనం గుమిగూడారు.

కొందరు పెద్దగా ఏడుస్తున్నారు. మరికొందరు బిగ్గరగా ఏడవలేక గుడ్లనీళ్ళు కుక్కుకున్నారు. విమానం కనుపించ లేదని చెప్పినంతసేపు, అదెటు పోయివుంటుందనీ, తమ వాళ్ళంతా క్షేమంగానే వుండివుంటారనీ, ఊహించారు.

విమానం కాలిపోయిన ప్రదేశం, దాని ఫొటోలు పేపర్లలో వేశాక జనాన్ని ఆపడం పెద్ద కష్టమైపోయింది ఎయిర్‌లైన్స్ అధికారులకు.

ప్రభుత్వం చనిపోయినవారి దగ్గరి బంధువులకు వెంటనే లక్షరూపాయల చొప్పున నష్టపరిహారం చెల్లించాలని నిర్ణయించింది. ఆ డబ్బు తీసుకోనేందుకు వచ్చిన జనాన్ని గమనించి చూడాలన్న ఉద్దేశ్యంతో సుధాకర్ ముందే వచ్చి కూర్చున్నాడు.

ఎయిర్‌లైన్స్ అధికారితోపాటు, లైఫ్ ఇన్సూరెన్స్ అధికారికూడా ఒకతను కూర్చున్నాడు.

ఒక్కొక్కరే లోపలకు రావడం మొదలెట్టారు. వచ్చిన మనిషిని సవాలక్ష ప్రశ్నలువేసి, రకరకాల కాగితాలపైన సంతకాలు తీసుకొని ఆతర్వాత డబ్బివ్వడం గమనించాడు సుధాకర్. ఒక్కొక్క మనిషినీ కళ్ళతోనే పరిశోధన చెయ్యడం మొదలెట్టాడు.

డబ్బు అందుకుంటున్నప్పుడు ఆనందం, త్వరగా అంద బుచ్చుకుని బైటపడదామన్న ఆతృతలాంటి వేవన్నా కను పిస్తాయేమోనని ఆశగా గమనించాడు. అలాంటి వేవీ ఉన్నట్లు తోచలేదు చాలామంది మొహాల్లో. ఆ డబ్బు పోయిన ప్రాణానికి విలువ కాదన్నట్లే వుంది వాళ్ళ ధోరణి.

ఆఖరులో వచ్చాడు శాంతిలాల్.

"నీ భార్య పేరు!" అడిగాడు ఎయిర్‌లైన్స్ అధికారి.

"విజయ!"

"ఆమెను గుర్తుపట్టగలవా?"

"ఊఁ!"

కొన్ని ఫొటోలు తీసి పడేశాడు ముందు. ఆ బొత్తి లోంచి తన భార్య ఫొటో తీసిపెట్టాడు.

"నీ భార్య విమానం ఎక్కడం ఇదే మొదటిసారా?"

"అవునండీ!"

"ఆమె మీ భార్యేనని ఋజువుపరచే సర్టిఫికెట్లు తెచ్చారా?"

"ఇవిగో!" అంటూ అందించాడు శాంతిలాల్.

"ఈ కాగితాలపైన సంతకాలు చెయ్యండి" అంటూ కొన్ని ఫారాలు అందించాడు ఎయిర్‌లైన్స్ అధికారి శాంతిలాల్‌కు. అన్నింటిపైనా చకచక సంతకాలు చేసి అందించాడు. తిరిగి తీసుకున్నాడు అధికారి. లెక్కపెట్టి లక్షరూపాయలు కాష్ అందించాడు.

"ఇది మేము ఏకాయెకిన ఇస్తున్న డబ్బు. ఆ తర్వాత లెక్కగట్టి మీకు రావలసిన మిగిలినడబ్బు యిస్తాం!" అన్నాడు అతను.

"థాంక్స్!" అన్నాడు శాంతిలాల్.

"మిస్టర్ శాంతిలాల్. మీ భార్యపేర ఇన్స్యూరెన్సు పాలసీ వుందా?"

"ఉందండీ!"

"ఏమాత్రం?"

"రెండులక్షల రూపాయలకు?"

"అంత మొత్తానికి ప్రీమియమ్ డబ్బు చెల్లించేందుకు ఆమెకు నికరమైన సంపాదనేదన్నా వుందా?"

"నా వ్యాపారంలో సగం భాగముంది" అన్నాడు శాంతిలాల్.

"సంవత్సరానికి నీ టర్నోవర్ ఎంత?" అడిగాడు సుధాకర్ కల్పించుకుని.

"రెండు లక్షలు."

"ఎంత ఇన్‌కంటాక్సు కడతావ్?"

"మూడ్వొందలు!"

"అంటే మీ ఆదాయం 16 వేలకు మించివుండదు. దాంట్లో మీ ఖర్చులు గడుపుకొని ఇంత పెద్ద పాలసీకి డబ్బు కట్టడం అంత సులభం కాదనిపిస్తుంది నాకు!" అన్నాడు సుధాకర్.

"నా భార్య ఆడది!" అన్నాడు శాంతిలాల్ వెక్కిసంగా.

"అందరి భార్యలూ ఆడవాళ్ళే!" నవ్వుతూ అన్నాడు ఇన్స్యూరెన్సు ఆఫీసరు.

"అది కాదు! అందంగా వుంటుంది. అడ్డదారుల్లో కూడా కొంత సంపాదించుకొంటూంటుందని నా అనుమానం!" చెప్పాడు శాంతిలాల్.

సుధాకర్‌కు వొళ్ళు మండుకొచ్చింది అతని మాటలకు.

"ఆమె పాలసీ మీ దగ్గర వుందా?"

"లేదు!"

"ఎన్నేళ్ళయింది తీసుకుని."

"గుర్తులేదు! చూడాలి."

"ఆమె తదనంతరం డబ్బు ఎవరికివ్వాలని కోరిందో తెలుసా?"

"ఇంకెవరికి? భర్తనైన నాకే!" అన్నాడు శాంతిలాల్.

సుధాకర్‌కు అతని మాటలు కాస్త వింతగా తోచాయి. అంతకుముందే అతను విజయను చూసి మాట్లాడి వుండడంతో, ఆమెగురించి శాంతిలాల్ చెప్పే మాటల్ని నమ్మాలనిపించలేదు.

"మీ అడ్రసు ఇవ్వండి!" అన్నాడు సుధాకర్.

శాంతిలాల్ కాగితంపైన వ్రాసి ఇచ్చాడు.

"మీరు కనీసం నాలుగురోజులపాటు ఈ ఊళ్ళోనే ఉండవలసి వుంటుంది" అన్నాడు సుధాకర్ కాగితాన్ని అందుకొంటూ.

"ఎందుకు?"

"మీతో మాకు పని పడవచ్చు. అందుకు."

"నాకు అవసరమైన పనులున్నాయి."

"మీకై మీరు వుండటానికి ఇష్టపడకపోతే, మిమ్మల్ని ఇక్కడే వుండే ఏర్పాటు చేస్తాను" అన్నాడు సుధాకర్ కోపంగా.

"అంటే అరెస్టు చేస్తారా?"

"అంతే అనుకోండి!"

"ఏ నేరం చేసినందుకు?"

"చేసినందుకు కాదు! చేశారేమోనని అనుమానించి నందుకు. చెయ్యనట్లు ఋజువయితే సగౌరవంగా పంపించి వేస్తాం!"

"నేను వ్యాపారస్తుణ్ని. అనవసరంగా అల్లరి పెట్టకండి. మీరు కోరినట్లే వుంటాను నాల్రోజులు. ఎవరుస్టులాడ్జిలో రూం తీసుకుంటాను" అన్నాడు శాంతిలాల్.

"గుడ్! అలా చెయ్యండి! మంచిది!" అన్నాడు సుధాకర్.

శాంతిలాల్ వెళ్ళిపోయాడు.

"అతనితో అలా మాట్లాడారేం?" అడిగాడు ఎయిర్ లైన్స్ ఆఫీసరు.

"అతనెలా మాట్లాడాడో చూశారా?"

"మామూలుగానే మాట్లాడాడు!"

"లేదు! సుధాకర్ ప్రశ్నలకతను సరయిన సమాధానాలు చెప్పలేదు. ముఖ్యంగా అంత పెద్ద ఇన్సూరెన్సు పాలసీ ఎలా వాళ్లకిచ్చారో చిత్రంగా వుంది!" అన్నాడు ఇన్సూరెన్సు ఆఫీసరు.

"మీరు కాస్త వాకబు చెయ్యండి. దాని వివరాలు తెలియగానే నాకు తెలియపరచండి!" అన్నాడు సుధాకర్.

## 7

"కార్గో లిస్టంతా సరిచూశాం. అమృతలాల్ కపాడియా పేర బుక్ చేసిన ప్యాకెట్ ఒకటిమాత్రం కనుపించడం లేదు. మిగిలినవాటి తాలూకు మనుషుల్ని ఎంక్వయిరీ చేయించాం. అందులో వాళ్ళకు వస్తున్న సామగ్రి వివరాలు సేకరించాం. అమృతలాల్ కపాడియా అనే మనిషి గోవా

లోనే ఉన్నట్లు ఎవ్వరూ చెప్పడంలేదు!" అన్నాడు ఎయిర్ లైన్స్ ఆఫీసరు.

"ఇంకెక్కడినుంచి ఎవరు పంపారు దాన్ని!" అడిగాడు సుధాకర్.

"కిరణ్మయి, థానా, బొంబాయి అని వుంది."

"దాన్ని బుక్ చేసేందు కెవరొచ్చారో, బుకింగ్ ఆఫీసులోవాళ్ళు చెప్పగలరా?"

"అదీ ప్రయత్నించాం! నల్లటి చీర కట్టుకున్న ఎర్రటి అమ్మాయి వచ్చిందట. అందులో ఖరీదైన వాల్ క్లాక్ ఉందని చెప్పిందట. 'టక్' 'టక్'మంటూ శబ్దంకూడా వినవచ్చిందట."

"ఐ. సీ. అది ఖచ్చితంగా టైంబాంబయి వుండాలి! ఆ టక్ టక్ మన్న శబ్దం బాంబుకు అమర్చిన క్లాక్ ది. అనుమానం లేదు!"

"అవును! నాకూ్కడా అలానే అనిపిస్తూంది!"

"అది బుక్ చేసిన ఆ కిరణ్మయి ఎవరో మనం కనుక్కోవాలి! అప్పుడుగాని అసలు నేరస్తులు దొరకరు" అన్నాడు సుధాకర్.

ఇద్దరు కలసి కార్గో బుకింగ్ కౌంటర్ వద్దకు వెళ్ళారు. అక్కడున్న మనిషిని చూసి "ఇతనేనా ఆరోజు డ్యూటీలో వుంది" అడిగాడు సుధాకర్.

"అవును!"

"వాల్ క్లాక్ బుక్ చేసిన స్త్రీని చూస్తే నువ్వు మళ్ళీ గుర్తుపట్టగలవా?" అడిగాడు సుధాకర్.

"సులభంగా! ఆమె చాలా అందంగా వుంటుంది సార్. వెళ్ళేప్పుడు రజాక్ టాక్సీలో వెళ్ళిపోయింది" అన్నాడు అతను.

"రజాక్ ఇక్కడే వుంటాడా?"

"ఆc! ఎప్పుడూ ఎయిర్‌పోర్టులోనే వుంటాడు. ఉన్నాడేమో చూడమంటారా?"

"చూడు!"

అతను లేచి వెలుపలికి వెళ్ళాడు.

"ఆ శాంతిలాల్‌కూ, ఎయిర్‌క్రాష్‌కూ సంబంధం వుందంటారా?" అడిగాడు ఎయిర్‌లైన్స్ అధికారి.

"చెప్పలేము! వుండేందుకు అవకాశం వుంది. అతని భార్యపేర అతను అంత పెద్ద మొత్తంలో ఇన్స్యూరెన్స్ తీసుకోవటం, వాల్‌క్లాక్ అమృతలాల్ అనే వ్యక్తికి బుక్ చెయ్యబడటం వాటినిబట్టి శాంతిలాల్‌కు ఇందులో సంబంధముందనిపిస్తూంది. శాంతిలాల్ వెనుక సి. ఐ. డి లను నియమించాను. వాళ్ళు తెచ్చే సమాచారాన్నిబట్టి మనమేం చెయ్యవలసిందీ తేల్చుకుందాం!" అన్నాడు సుధాకర్.

ఆలోగా ఖాకీ యూనిఫాంలో వున్న మధ్య వయస్సు వ్యక్తి ఒకతను వచ్చి నిలుచున్నాడు.

"నాపేరు రజాక్ సార్!" అన్నాడు సుధాకర్‌తో.

"రా! ఆరోజు కార్గో బుకింగ్ ఆఫీసునుంచి తీసుకెళ్ళిన నల్లచీర అమ్మాయిని ఎక్కడ దించావో గుర్తుందా?" అడిగాడు.

"ఆc! ఉంది సార్!"

"అక్కడికి నన్ను తీసుకెళ్తావా?"

"జీసాబ్!" అన్నాడు రజాక్.

"పద వెళ్దాం."

# 8

టాక్సీ జోరుగా వెళ్ళసాగింది. చాలాదూరం పోయి ఒక సన్నటి వీధిలో చిన్న ఇంటి ముందాగింది.

"ఇక్కడే దిగిందా?" అడిగాడు సుధాకర్.

"అవును సార్!"

"ఇప్పుడే వస్తాను! ఉండు!" అంటూ దిగి వెళ్ళి తలుపు తట్టాడు. తలుపులు తెరచుకున్నాయి.

ఎదురుగా అందమైన స్త్రీ కనుపించింది.

"ఎవరు కావాలి?" అడిగింది ఆమె.

"తెలీదు! బహుశా నువ్వే నేమో?" అన్నాడు సుధాకర్.

"ఏమిటా తలతిక్క మాటలు? ఇంతకీ మీరెవరు?"

"నా పేరు సుధాకర్! డిటెక్టివ్‌ను. కిరణ్మయిని వెతుక్కుంటూ వచ్చాను, ఆమె నువ్వు కాదుగా?"

"కాదు! నా పేరు అరుణారాణి" అందామె.

"కిరణ్మయి ఎక్కడుంటుంది? నీతో కాదా?"

"అసలలాంటి పేరుగల ఆమె నాకు తెలీదు!" అందామె.

"కానీ ఆమె టాక్సీలో వచ్చి దిగి ఈ యింట్లోకి వెళ్ళింది మూడురోజుల క్రితం. తీసుకొచ్చిన టాక్సీవాలా నావెంట వున్నాడు. పిలిచేదా?"

"అవసరం లేదు!"

"అయితే చెప్తావా?"

"ఏమని?"

"ఆ కిరణ్మయి ఎవరో ఏమిటో?" అడిగాడు సుధాకర్.

"ఆమె నాతోపాటు స్కూల్లో చదువుకుంది. అప్పు

డప్పుడూ వచ్చిపోతూ వుంటుంది. పోయిన దఫా వచ్చి నప్పుడు చెప్పింది. తన్ను అమృతలాల్ అనే వ్యక్తి ప్రేమించాడనీ, అతని దగ్గరకు గోవాకు వెళ్ళిపోతున్నాననీ చెప్పింది,'' అంది అరుణారాణి.

''అమృతలాల్ దగ్గరకు వెళ్ళిపోయిందా?''

''ఆ తర్వాత ఆమె నాకు కనుపించలేదు!'' అంది అరుణారాణి.

''ఈ వూళ్ళో వుండగా ఎక్కడుండేదామె?''

''ఏదో అడ్రసు చెప్పింది. నేనెప్పుడూ వెళ్ళలేదు. తనే వచ్చిపోయేది?''

''నువ్వేం చేస్తూంటావు?''

''అంటే...?''

''ఇంట్లో వేరే ఎవ్వరూ లేనట్లుంది. ఏదైనా ఉద్యోగం చేస్తున్నావా? లేక...''

''ఆగిపోయారేం? కూటికోసం కోటి విద్యలు. నాది ఒక విద్య. మీలాంటివాళ్ళను సుఖపెట్టి, మీరు ఆనందించిన దానికి బదులుగా ఇచ్చే డబ్బుతో బ్రతుకు తుంటాను'' చెప్పిందామె.

''నీ దగ్గర కెప్పుడైనా శాంతిలాల్ అనే అతను వచ్చాడా?'' అడిగాడు సుధాకర్.

''చాలా పేర్లు విన్నాను. అందరినీ గుర్తుపెట్టుకోనే అవకాశంగానీ, అవసరంగానీ, నాకుండదని మీకు తెలుసను కుంటాను.''

''పోనీ ఈ రూపంగల మనిషిని చూశావా?'' అంటూ శాంతిలాల్ ఫోటోతీసి చూపించాడు.

ఆ ఫోటో చూడగానే క్షణకాలం అవాక్కయి పోయింది అరుణారాణి. అంతలోనే తమాయించుకొంది.

"లేదు!" అంది తల ప్రక్కకు త్రిప్పుకొని.

"సరిగ్గా చూసి చెప్పు."

"చూశాను! అతన్ని నేను చూడలేదు!" అంది నిక్కచ్చిగా.

అంతలో "సాబ్" అంటూ వచ్చాడు రజాక్ లోనికి.

"ఏమిటి?" అడిగాడు సుధాకర్.

"మీతో ఒక చిన్నమాట చెప్పాలి సార్," అన్నాడు రజాక్.

"చెప్పు!" అన్నాడు సుధాకర్.

"ఇలా బయటకు రండి చెప్తాను" అన్నాడు రజాక్.

సుధాకర్ అతనితో వెలుపలకు వచ్చాడు.

"ఏమిటి?" అడిగాడు సుధాకర్.

"మొన్న టాక్సీలో వచ్చినది ఆమెనే సార్! నెల రోజుల క్రితం ఒకసారి టాక్సీలో మొన్న విమాన ప్రమాదంలో చచ్చిపోయిన ఆమెను ఇక్కడకు నేను తీసుకొచ్చాను సార్. ఆమే, యీవిడ కొట్టుకున్నారు. ఆదేదో ఆమె భర్తను ఈమె వల్లో వేసుకుందని తిట్టినట్లు జ్ఞాపకం" అన్నాడు.

సుధాకర్‌కు ఆ సమాచారం వినగానే ఏనుగెక్కినట్లయింది.

"రజాక్! నువ్వు చెప్పింది చాలా విలువైన విషయం. నాపని చాలా సులభం చేశావ్! ఇప్పుడే వస్తానుండు!" అంటూ లోనికి వెళ్ళాడు సుధాకర్.

"నీకు శాంతిలాల్ తెలియదన్నావ్? పోనీ అతని భార్య విజయ కార్‌ను తెలుసా?"

తెలీదన్నట్లు తలూపింది అరుణారాణి.

"బాగా గుర్తుచేసుకొని చెప్పు!"

"తెలీదన్నానుగా?" అంది అరుణారాణి.

"కానీ వెలుపలున్న టాక్సీ డ్రైవరు నిన్ను ఇంతకు ముందు చూశాడట. ఎయిర్ క్రాష్‌లో చచ్చిపోయిన విజయకౌర్‌ను అతనే ఇక్కడకు టాక్సీలో తీసుకొచ్చాడట. ఆరోజు మీరిద్దరూ కొట్లాడుకున్నారట. మొన్న నిన్ను విమానాశ్రయంనుంచి కూడా అతనే తీసుకొచ్చాడట."

మౌనంగా వుండిపోయింది అరుణారాణి.

"నేనివన్నీ ఎందుకడుగుతున్నానో తెలుసా? ఘోరమైన విమానప్రమాదం జరిగింది. అనేకమంది అమాయకులు చనిపోయారు. వాళ్ళ బంధువులు ఆర్తనాదాలు చేస్తున్నారు. ఆ విమానప్రమాదం యాదృచ్ఛికంగా జరిగింది కాదు. ఎవరో పథకంవేసి దాన్ని ప్రమాదానికి గురిచేశారు.

అమృతలాల్ అనే వ్యక్తి పేర బుక్ చెయ్యబడ్డ వాల్ క్లాక్ పాకెట్‌లో టైంబాంబు పెట్టారు. దాన్ని కిరణ్మయి పేరుతో బుక్ చేసింది నీవు. ఆ ప్రమాదంలో విజయ కౌర్ అంటే శాంతిలాల్ భార్య చనిపోయింది. ఆమెకూ నీకూ తగూ వుంది. మీరిద్దరూ కొట్టుకున్నారు. అందువల్ల ఆమెను చంపాలన్న ఉద్దేశ్యంతో ఆ పాకెట్‌ను నువ్వే పంపించి వుండాలి. దీనికి శిక్ష ఏమిటో తెలుసా? ఉరి" అన్నాడు సుధాకర్.

అరుణారాణి బిక్క చచ్చిపోయింది.

"విజయకౌర్‌ను నాకు తెలుసు. కానీ ఆమెను చంపాలని నాకు లేదు. ఆ పాకెట్‌లో టైంబాంబు వున్న సంగతి కూడా నాకు తెలీదు. శాంతిలాల్ దాన్ని పంపించాడు, అతనే దాన్ని అమృతలాల్ అనే వ్యక్తికి ఎయిర్ పార్శిల్ చేయించమన్నాడు."

"నీకు తెలీకుండానే నీచేత అతను పెద్ద నేరం చేయించాడు."

"నాకెన్నో అబద్ధాలు చెప్పాడు. స్వర్గం చూపించాడు అరచేతిలో. అతని మాటల మత్తులోపడి మోసపోయాను. ప్రాణాలమీదకి తెచ్చుకొన్నాను" అంది ఏడుస్తూ అరుణారాణి.

"అలా విచారించకు. నిజంగా నీకు తెలీకుండానే ఆ పార్శిల్ పంపి వుంటే నిన్ను కోర్టు క్షమించే అవకాశం వుంది. కానీ బోనెక్కి నాకు చెప్పినట్లే, నువ్వు మొత్తం నిజం చెప్పాలి!" అన్నాడు సుధాకర్."

"చెప్తాను! ఆ దుర్మార్గుడు చేసినదానికి తగిన శాస్తి కావాలి!" అంది కోపంగా అరుణారాణి.

వెనక్కి తిరిగొచ్చి టాక్సీ ఎక్కాడు. శాంతిలాల్ కోసం వెళ్ళాడు ఎవరెస్టు హోటల్ కు.

అతను వుంటున్న గది తాళంవేసి వుంది.

# 9

"వదులు! నన్నొదలు! నీ పాపం పండింది!" అంటూ అరుస్తూంది అరుణారాణి.

"నిన్ను బ్రతకనిస్తే నేను చావాలి! నిన్ను వదలను!" అరుస్తున్నాడు శాంతిలాల్.

"నీ సంగతి మొత్తం డిటెక్టివ్ సుధాకర్ కు చెప్పాను. నన్ను చంపినా నువ్వుమాత్రం తప్పించుకోలేవు."

"అందుకే నిన్ను చంపి సాక్ష్యం లేకుండా చేసుకుంటాను."

సుధాకర్ పక్కన తలుపులు త్రోసుకుని, లోపలకు

దూకి, శాంతిలాల్ పైకి లంఘించి, వెనుకనుంచి మెడ దొరకపుచ్చుకున్నాడు.

శాంతిలాల్ తిరగబడటానికి ప్రయత్నించాడు. కానీ సుధాకర్ పట్టు ఉడుంపట్టులా మెడమీద బిగుసుకుపోయింది. దాంతో పిట్టలా చిక్కిపోయి గిలగిల కొట్టుకున్నాడు.

శాంతిలాల్ కోర్టులో చెప్పాడు. తనకు భార్యపైన ప్రేమ లేదని, అరుణారాణితో ఆనందంగా బ్రతకాలని కోరుకున్నానని, భార్య అనకు అడ్డులేకుండా వుండేందుకు చంపాలని నిశ్చయించుకున్నట్లు చెప్పాడు.

నాటుబాంబు సంపాదించి, గడియారాల మెకానిక్ నొకణ్ణి మంచి చేసుకొని, దానికి టైమింగ్ డివైజ్ తయారు చేయించానని కూడా చెప్పాడు.

అసలు విషయం చెప్పకుండా అరుణారాణి ద్వారా దాన్ని అమృతలాల్ అనే పేరుకు బుక్ చేయించినట్లు కూడా ఒప్పుకున్నాడు శాంతిలాల్ కోర్టులో.

భార్యను ఎటూ చంపదలచుకున్నందువల్ల, ఆమె చేత సంతకాలు చేయించుకొని ఆమె పేర నెల రోజులు క్రితం రెండు లక్షల రూపాయలకు లైఫ్ పాలసీ తీసుకున్నట్లు కూడా ఒప్పుకున్నాడు.

కోర్టు శాంతిలాల్ కు ఉరి శిక్ష విధిస్తూ, ఇంతకన్న పెద్ద శిక్షకు శాంతిలాల్ పాత్రుడయినా, అలాంటిది లేనందువల్ల ఉరి శిక్ష విధిస్తున్నామన్నారు.

——:ఐపోయింది:——

# మరో ప్రపంచ ప్రమాదం!!

డా॥ పెందుర్తి మాస్టర్జీ

బొంబాయి షణ్ముఖానంద హాలులో...

రాత్రి ఎనిమిది గంటలయింది. రంగుల తోరణాలతో, వివిధరకాలయిన విద్యుద్దీపాలతో కోలాహలంగా వుంది.

డిఫెన్స్ మినిస్టర్, టెక్నికల్ యింజనీర్లు, ఓషనిక్ రిసెర్చి ప్రొఫెసర్లు, నావి ఆఫీసర్లు, ఓషనాలజి చదివిన రిసెర్చిస్టులు ఎందరో ఆ హాలులో సమావేశమయ్యారు.

కార్యక్రమం ప్రారంభమయింది.

"డియర్ ఫ్రండ్స్. ఇప్పుడు మీకు టెక్నికల్ ఇంజనీర్ ప్రొఫెసర్ జాన్సన్‌ను పరిచయం చేస్తున్నాను."

అనటంతో జాన్సన్ వేదికపైకి ఎక్కాడు. తన సీట్లో కూర్చుంటూ అందరికి నమస్కరించాడు.

"ఈ ప్రపంచ చరిత్రలో ఒక ప్రముఖమయిన మిషనరీ జాన్సన్ తయారుచేశారు. 'వాగ్ 15' అని ఆ మిషన్‌కి నామకరణం చేశాం. దానిని గురించి జాన్సన్ మాట్లాడ తారు."

జాన్సన్ మైక్ దగ్గరకు నడిచి గొంతు సవరించుకొని అంతా కలయచూశాడు.

"జంటిల్‌మన్. మన భూమియొక్క విశాలత 197 మిలియన్ల స్క్వేర్ మైళ్ళు. అయితే 71 పర్సెంట్ నీటి భాగంతోనే వుంది. మిగిలింది భూభాగం. అయితే సముద్రపు అడుగున అంతులేని అగాధాలు వున్నాయి అని విన్నాము, వింటున్నాము. ఒక క్యూబిక్ మైలు సముద్రంలో 20 కిలోల బంగారం, 1000 కిలోల వెండి, 15 కిలోల మెర్క్యూరి, 14 టన్నుల రాగి, 9 టన్నుల మాంగనీసు వున్నాయి. ఇవి కొన్ని ప్రత్యేక ప్రయత్నా లతో సాధిస్తున్నాము.

అయితే, వాగ్ 15 ఉపయోగం ఏమిటి? వాగ్ 15 మూడు భాగాలుగా మూడు ఆపరేటింగ్ పిస్టన్స్‌తో వుంటుంది. ఈ వాగ్ 15 సముద్రపు అడుగున ఐమిాన్ సిబెడ్ పైన వుంచి మొదటి పిస్టన్ నొక్కినపుడు, తన చుట్టూవున్న నీరు 100 మీటర్ల దూరంవరకు వెళ్ళిపోతుంది. అంటే ఏ ఆధారం లేకుండా నీరు తాబేలు డెంకి బోర్లించి నట్లు అర్థభాగం గ్లోబ్‌లా వుంటుంది. వాగ్ 15 వుంచిన వందమీటర్ల సర్కిల్‌లో అసలు నీరు వుండదు.

రెండవపిస్టన్ నొక్కినపుడు ఆ వందమీటర్ల స్పేస్‌లో ఆక్సిజన్ వస్తుంది. అంటే కొందరు ఆ స్థలంలో నిరాటం కంగా భూమిమీద ఎలాగయితే పని చేయగలుగు

తున్నారో, అలాగే సముద్రంయొక్క అడుగున కూడా యీ వాగ్ 15 సహాయంతో పని చేయగలుగుతారు. అండర్ వాటర్ ప్రాజెక్ట్కు ఈ వాగ్ 15 సహాకరిస్తుందని నా అభిప్రాయం.

ఇకపోతే థర్డ్ పిస్టన్...యిది చాలా స్లోగా ఆపరేట్ చెయ్యాల్సి వుంటుంది. ఇది ఆపరేట్ చేస్తూ వుంటే క్రమంగా చుట్టు నెట్టివేయబడ్డ నీరు కలుసుకుంటుంది. ఇది షుమారు మూడు సంవత్సరాల కృషి ఫలితం" అంటూ మరో కొన్ని మాటలు చెప్పి ముగించాడు.

డిఫెన్స్ మినిస్టర్ లేచి "ఈ వాగ్ 15 ను బ్రిటన్ తీసుకుంటుంది. ప్రపంచ వ్యాప్తంగా ఈ వాగ్ 15 కు ప్రశంసలందాయి. ఇది మన దేశానికే ఒక గర్వకారణం" చెప్పాడు.

ఆ తరువాత పలువురు ప్రశంసించారు.

జాన్సన్ కు భారతదేశానికి చెందిన విలువయిన బిరుదు యిచ్చారు.

పూలమాలలతో జాన్సన్ ను సత్కరించారు.

ప్రేక్షకులలో చివరివరుసలో ఒంటరిగా కూర్చున్న ప్రొఫెసర్ దీర్ఘనాథ్ పెదవులు బిగించినవ్వాడు. ప్రయత్న పూర్వకంగా చప్పట్లు కొట్టాడు.

ప్రొఫెసర్ దీర్ఘనాథ్ కెమిస్ట్రి రిసెర్చి లేబరేటరీలో జీనియస్ సైంటిస్టు. వయసు నలభైకి పైగా వుంటాయి. నావి బ్లూ సూటులో, ఆరడుగుల ఎత్తుగల రష్యన్ దేశస్తుడులా వుంటాడు. కళ్ళకు తెల్ల అద్దాల నల్లకళ్ళ జోడు, గడ్డం చిన్నగా వుంటుంది. విశాలమయిన నుదురు,

వుంగరాల తల, మనిషి గంభీరంగా గుంభనంగా వుంటాడు
సైము చూశాడు మెల్లగా కదిలి బయటకు నడిచాడు

## 2

"హలో కమేండర్. గుడ్ మార్నింగ్" అన్నాడు సంపత్ లోపలికి వస్తూ.

"గుడ్ మార్నింగ్ మైబాయ్, కూర్చో," అన్నాడు దీర్ఘనాథ్ నవ్వుతూ.

సంపత్ కూర్చొని సిగరెట్ వెలిగించాడు.

"డియర్ సంపత్! మన బృందం మొత్తం ఆరుగురు. వాళ్ళందరిని మన కార్యక్రమాల అనంతరం పరిచయం చేస్తాను."

సంపత్ ప్రశ్నార్థకంగా చూశాడు.

దీర్ఘనాథ్ నవ్వాడు. "మైబోయ్ మన కార్యక్రమం జయప్రదం అయ్యేవరకు మీరంత ఒకరికి ఒకరు పరిచయం శ్రేయోదాయకం కాదు. అందుకే ఒక్కొక్కరిని ప్రత్యేకంగా కలుసుకుంటున్నాను."

సంపత్ తృప్తిగా నవ్వి "దటీజ్ గుడ్ ఐడియా కమేండర్."

"ఇప్పుడు నీవు చేయవలసింది అతి ప్రమాదకరమయింది, మన కార్యక్రమానికి అతి ముఖ్యమయింది. నీవు క్రితంలో స్మగులింగు వ్యవహారాలలో కొన్ని రోజులు సముద్రంపై గడిపావు. అందుకే ఈ కార్యక్రమానికి నిన్నుపయోగిస్తున్నాను. జయప్రదం చేయగలవనే నమ్మకం నాకుంది."

"థాంక్స్ కమేండర్. ఇంతకు కార్యక్రమం ఏమిటి?"

"వాగ్ 15 గురించి పత్రికల్లో చదివి వుంటావు. ప్రపంచ ప్రఖ్యాతి చెందింది వాగ్ 15. దానివల్ల ప్రపం

చానికి ఎలాంటి వుపయోగం వుందో, అది మన చేతుల్లోనికి వచ్చాక అంతకంటె గొప్ప ప్రమాదం వుంది."

సంపత్ కుతూహలంగా వింటున్నాడు.

"ఎలాంటి ప్రమాదమో తరువాత చెపుతాను. ప్రస్తుతం ఫిబ్రవరి 26వ తేదీన మేఘదూత అనే స్పెషల్ షిప్‌లో అది గ్రేట్ బ్రిటన్‌కి పంపబడుతుంది. మేఘదూత షిప్‌లో, అందిన సమాచారాన్నిబట్టి ఇరవైమంది సెక్యూరిటి సిబ్బంది మిషన్‌గన్స్‌తో వుంటారు. ఈ షిప్‌ను చాలా జాగ్రత్తగా స్కేటర్ చేయవలసి వుంటుంది. ఏమాత్రం అజాగ్రత్తగా వున్నా మన పథకం తారుమారవుతుంది.

కాబట్టి, చాలా తెలివిగా నీవు ఈ కార్యక్రమాన్ని జయప్రదం చెయ్యాలి. ఇది హార్బర్ దాటాక రెండువందల యాభై కిలోమీటర్లు వెళ్ళాక షిప్‌ను అకుపై చెయ్యాలి. ఈలోపు ఏం జరిగినా ఇండియన్ ఎయిర్‌ఫోర్స్, సెక్యూరిటి సర్వీస్ ముట్టడిస్తారు. అంతేకాదు మీరు వాగ్ 15 కొరకు వెళుతున్నట్లు ఎవరికి తెలియకూడదు. కనీసం నీ అనుచరులకు కూడా."

"అలాగే కమేండర్."

"ఇదిగో లక్షరూపాయలు అడ్వాన్సు. పథకం ఎలా వేస్తావో, ఎలాంటి మనుషులతో బయలుదేరతావో, ఎలా సాధిస్తావో నీ యిష్టం. నీవు జయప్రదం చేశావా, మరో రెండు లక్షలు యిస్తాను. లేదా నీ ప్రాణానికే ప్రమాదం"

"యస్. కమేండర్."

"వాగ్ 15 సంపాదించాక యాభై కిలోమీటర్లు యీస్టుగా వస్తే అక్కడ సబ్‌మెరైన్ సిద్ధంగా వుంటుంది. వాగ్ 15ను అందులో ఎక్కించి, డైనమేట్‌తో షిప్‌ను

పేల్చివేయాలి. ఆ తరువాత మార్చి 15వ తేదిన హోటల్ న్యూగార్ రూం నెంబర్ 22లో రాత్రి పదిగంటలకు సమావేశం జరుగుతుంది. ఈ సమావేశానికి హాజరు కావాలి.''

''యస్. కమేండర్.''

''విష్ యు బెస్ట్ ఆఫ్ లక్ మైబోయ్'' అన్నాడు దీర్ఘనాథ్. సంపత్ కదిలాడు.

## 3

బొంబాయి, మహాత్మాగాంధిరోడ్‌లో, జె అండ్ కె గవర్నమెంట్ రూపొందించిన టూరిజం హాలు. ''డైరక్టర్ ఆఫ్ టూరిజమ్ జె అండ్ కె గవర్నమెంట్, శ్రీనగర్'' అని వుంటుంది.

దీర్ఘనాథ్ సిగర్ వెలిగించి లోపలకు నడిచాడు.

''వసంతం మిమ్మల్ని కాశ్మీరు ఆహ్వానిస్తుంది-కాశ్మీరులో ప్రకృతి సౌందర్యాన్ని తిలకించండి. గుల్మర్గా హైయస్ట్ గల్ఫ్‌ను దర్శించండి.''

ఇలాంటి బోర్డులు అక్కడక్కడ తగిలించి వున్నాయి.

ట్రేడ్ ఏజెంట్ అనంత్, దీర్ఘనాథ్‌ను చూశాడు. పలకరింపుగా నవ్వాడు. దీర్ఘనాథ్ గాగుల్స్ తీసి తల వూపాడు. అనంత్ కదిలాడు. ఇద్దరు ప్రక్కనేవున్న లాన్‌లో కూర్చున్నారు.

దీర్ఘనాథ్ సిగరెట్ కేసు అందించాడు.

అనంత్ సిగరెట్ కేసు తీసుకొని అందులో మడచి వున్న కాగితం చూశాడు.

అనంత్ ఆశ్చర్యంగా చూశాడు. దీర్ఘనాథ్ నవ్వాడు.

''డియర్ అనంత్ నీది చాలా ప్రమాదంలో కూడిన

పని. ఈ కాగితాన్ని కొన్ని లక్షల కాపీలు అచ్చు వేయించాలి. ఇందులో ఒక్క అక్షరం తీయకూడదు. ఈ కాగితాలు దేశవ్యాప్తంగా పంచటం జరగాలి. ఈ పేపరు ప్రింట్ చేయడానికి రహస్యమయిన ప్రెస్ సిబ్బంది కావాలి. ఇదిగో 3 లక్షలు'' టీపాయిపైన వుంచాడు.

అనంత్ అందుకున్నాడు.

''ఈ మూడు లక్షలతో కొన్ని లక్షలమంది పిచ్చి వాళ్ళయి పోవాలి. మన పథకం గురించి ఇదివరలో నీకు చెప్పాను. ఇకపై ఆచరణలో మన కార్యక్రమాన్ని సాధించాలి.''

''యస్ కమేండర్.''

''విష్ యు బెస్ట్ ఆఫ్ లక్!''

## 4

రాత్రి పదిగంటలయింది. కేరళ స్టేట్‌లో టూటికురన్ షిప్ యార్డ్‌లో కుడివైపు నియాన్ లైటు కాంతితో వెలుగుతున్నాయి. అది సిక్ యార్డ్ కాబట్టి విరిగిపోయిన స్టీమ్‌బోట్ ముక్కలు, రా మెటీరియల్స్ వున్నాయి. షిప్‌లో కొన్ని భాగాలు వున్నాయి. చుట్టు ముళ్ళతీగతో కట్టిన బౌండరి వుంది.

సిక్ యార్డ్ ప్రక్కనే వుంది సెక్యూరిటీ గోడవున్.

సెంట్రీ డ్యూటీలు చేస్తున్న నలుగురు సెక్యూరిటీ సిబ్బంది తిరుగుతున్నారు. ఎలుక నడిచినా, పిల్లి కదిలినా రప్పవేయకుండా జాగ్రత్తగా చూస్తుంటారు. ఎడమవైపు లైట్‌హౌస్ వుంది.

ముళ్ళతీగ కట్ చేశాక లోపల ప్రవేశించిందొక యువతి.

తెల్లచీర కట్టుకొని పరుగెత్తుకుంటూ వస్తోంది ఆమె.

"ఎవరు? ఎవరది?" సెంట్రీ అరిచాడు.

దాంతో అందరు ఎలర్ట్‌గా వున్నారు. గన్స్ స్టడీ చేశారు. ఏమ్ పెట్టారు. అయినా ఆ యువతి ఆగకుండా "కాపాడండి కాపాడండి" అంటూ అరుస్తూ వస్తోంది.

ఈలోపు ఓ టేప్ రికార్డర్ మరొక ప్రక్క వుంచింది. ఆ అమ్మాయి వారినే సమీపించింది. "కాపాడండి," అని అరుస్తూనే వుంది.

మరొక దిశగా బూటుకాళ్ళతో పరుగెడుతున్న శబ్దం. అది టేపురికార్డర్ అని వాళ్ళకు తెలీదు. అందుకే వాళ్ళలో ఇద్దరు సెంట్రీలు అటువైపుకు వెళ్ళారు.

అంతా నిశ్శబ్దంగా వుంది. పరుగెడుతున్న శబ్దం షిప్ యార్డు అంతా వినిపిస్తోంది.

దినేష్ సైలెన్సర్ బయటకు తీశాడు. ప్రక్కనే అతని అనుచరుడు వున్నాడు. ఆ ఇద్దరూ ఆ యువతి వెనుకనే పొంచి వుండి వస్తున్నారు.

"ఏమిటి?" సెంట్రీ అడిగాడు.

"ఎవరో ఆగంతకులు నన్ను వెంబడిస్తున్నారు" అంది ఆమె కంగారు నటిస్తూ, ముఖమంతా చెమటలు పోశాయి.

మరొకప్రక్క హాహాకారం టేప్‌రికార్డర్ నుండి వినిపించింది. క్షణంలో ఆమె చేతిలో రివాల్వర్, దినేష్ చేతిలో సైలెన్సర్ ఒక్కసారిగా పేలాయి. యిద్దరు సెంట్రీలు నేల కూలారు. వాళ్ళిద్దరూ కాల్చటంలో ఏమాత్రం ఆలశ్యమయినా సెంట్రీల చేతుల్లో మిషన్ గన్స్ పేలి వుండేవి.

యింతలో దూరం వెళ్ళిన సెంట్రీలు తిరిగి వచ్చారు. మరుక్షణంలో వాళ్ళూ శవాలుగా మారారు.

అంతా నిశ్శబ్దమయింది.

సెంట్రీల నాలుగు శవాలు భయంకరంగా వున్నాయి.

ఆగంతకులు ముగ్గురు వేగంగా సెక్యూరిటీ రూం వైపు పరుగెత్తారు. రివాల్వర్‌తో తాళం పేల్చి లోపలకు ప్రవేశించారు.

చుట్టూ రాతి కట్టడం మధ్య నీరు నిండి వుంది. ఆ నీటిలో వుంది 'డీప్‌సన్' సబ్‌మెరైన్. సముద్రం వైపు యినుప చట్రం అడ్డుగా వుంది.

మీటర్ వెడల్పు చెక్క సబ్‌మెరైన్ డెక్ మీదకు వేసి గబగబ సబ్‌మెరైన్‌ను సమీపించాడు దినేష్. రెండవ మనిషి డూప్లికేటు తాళంతో సబ్‌మెరైన్ డోర్ తెరిచాడు. ఆ యువతి అతడిని అనుసరించింది.

దినేష్ లోపల ప్రెసర్ హాల్‌లో మీటరునొక్కాడు' ప్రపెల్లర్ స్విచ్ ఆన్ చేశాడు. బుడ బుడ మనే శబ్దంతో నీటిపై తేలిన సబ్‌మెరైన్ కదిలింది. ఆటోమేటిక్‌గా యినుప చట్రం తెరుచుకుంది. డీప్‌సన్ డౌన్ చేసి నీళ్ళ అడుగుకు పోనిస్తూ పెరిస్కోపు మాత్రం పైకి కనిపించేలా మెల్లిగా డ్రైవ్ చేశాడు.

## 5

'మేఘదూత' షిప్ బయలుదేరటానికి సన్నాహాలు జరుగుతున్నాయి.

ఇరవైమంది సెక్యూరిటీ సిబ్బంది మిషన్‌గన్స్‌తో షిప్‌లో ప్రవేశించారు. క్రేన్, ట్రక్‌లో వచ్చిన 'వాగ్ 15'ని ఎత్తి మేఘదూత షిప్‌లోనికి దించింది.

హార్బర్ జనరల్ మేనేజర్ సింగ్ నడుంపై చేతులు పెట్టుకొని చూస్తున్నాడు.

కెప్టెన్ రాజేష్, అసిస్టెంట్ కెప్టెన్ మాధవ్, సింగ్ ప్రక్కగా వచ్చి సెల్యూట్ చేశారు.

"విష్ యు బెస్ట్ ఆఫ్ లక్ మై బాయ్స్" అంటూ షేక్‌హాండ్ యిచ్చి, కవర్స్ చేతికి యిచ్చాడు. కవర్స్ అందుకొని షిప్‌లోనికి ప్రవేశించారు.

రాజేష్ అన్ని భాగాలు తనికీ చేశాడు. మాధవ్ మిర్రర్ పైవున్న ప్లాను మీద బటన్ వత్తాడు.

సిగ్నలింగ్ బెల్ మ్రోగింది. శబ్దం చేస్తూ మేఘ దూత బయలుదేరింది. సముద్రాన్ని చీలికలు చేస్తూ, నీటిపై తేలి, మహాసముద్రంలోనికి సాగిపోతూంది.

కెప్టెన్ రాజేష్ కాబిన్ రూంలోనికి నడిచి ముఖ్య మయిన భాగాలు చెక్ చేసి, కంట్రోల్ రూంలోనికి నడి చాడు. మాధవ్ ఎదురయ్యాడు. "హలో సెక్యూరిటీ మాన్స్" అన్నాడు రాజేష్. ఇద్దరు కలిసి కంట్రోల్ రూం నుండి క్రింది పాసింజర్స్ రూంలోనికి నడిచారు.

కొందరు మిషన్ గన్స్ తుడుస్తున్నారు, మరికొందరు ప్లేయింగ్ కార్డ్సు ఆడుతున్నారు. యింకా కొందరు నిద్రకు ఉపక్రమించారు.

మాధవ్, రాజేష్ టైము చూసి కాబిన్ రూంలోనికి నడిచి స్పీడ్ ఎక్కించారు. మేఘదూత వేగాన్ని అందు కుంది.

* * *

బైనాక్యులర్స్‌తో మిరైన్ బోటులో నుండి చూశాడు సంపత్. చాలా దూరంలో కాగితపు పడవలా కనిపిం స్తూంది, మేఘదూత.

సంపత్ తన అనుచరులకు ఏదో సైగ చేశాడు,

యిరవై మంది గబ గబ స్క్యూబ్స్ ధరించారు. మిరైన్ ట్రాంగిల్ లో మేఘదూతను సమీపిస్తుంది.

"నా" అన్నాడు సంపత్.

తటిళ్ళుమని ఒకరి తరువాత ఒకరు వాటర్ లోనికి దిగారు. రబ్బరు కవర్స్, ఆక్సిజన్ సిలిండర్స్ ధరించిన అందరి చేతులలో ప్లాస్టిక్ క్లాత్ చుట్టిన మిషన్ గన్స్ వున్నాయి. ముఖాలకు మిర్రర్ లెన్స్ వున్నాయి. వేగంగా యీదగల సమర్థులు వాళ్ళు.

మేఘమూత మిరైన్ ను సమీపిస్తుంది.

మాధవ్, కెప్టెన్ రాజేష్ కు చెప్పాడు. కెప్టెన్ రాజేష్ బైనాక్యులర్స్ తో చూశాడు. మిరైన్ షిప్ లో ఒక్కడే కనిపించాడు. అతను కూడా చనిపోయినట్లు పడి వున్నాడు.

ఒకరి తరువాత ఒకరు క్రమంగా కుడి వైపు డెక్ మీదకు వచ్చి నిలబడి చూస్తున్నారు. ఎన్నో సందేహాలు ఎన్నో రకాల ఆలోచనలతో చూస్తున్నారు. మిరైన్ ను సమీపించింది మేఘమూత.

అదే అవకాశంగా ఎడమవైపు తాళ్ళ నిచ్చెన మీదగా నిశ్శబ్దంగా ఎడమ వైపు డెక్ మీదకు ఎక్కారు అందరూ. ప్లాస్టిక్ కవర్స్ తీసి మిషన్ గన్స్ స్టడీగా వుంచారు, వరుసగా యిరవై మంది. ఎల్లో స్క్యూబ్ ధరించిన మనిషి 'ఫైర్' అన్నాడు. మిషన్ గన్స్ పేలాయి.

క్షణాలలో మేఘమూత వారి స్వాధీనం అయిపోయింది.

## 6

"థాంక్యూ, కమేండర్!" అంది లూసియా, డబ్బు అందుకుంటూ.

"నీకు చెప్పింది, యిరవై మంది యువకులు కావాలని. అయితే నీవు నలభై మందిని ఎలా తీసుకు వచ్చావ్?" అడిగాడు దీర్ఘనాథ్ ఆశ్చర్యంగా.

"వెరీ సింపుల్ కమేండర్! లెక్చరర్ మిస్ ఛాయ బర్త్ డే పార్టీకి హాజరయ్యాను. అన్ని డ్రింక్స్‌లో మత్తు మందు కలిపాను. త్రాగిన గంట తరువాత ఒక్కొక్కరు స్పృహ కోల్పోయారు. అందరిని వాన్‌లో మీరు చెప్పిన చోటుకు చేరవేశాను."

"గుడ్! నీ ఐడియా అమోఘం."

"వాళ్ళంతా ఎందుకు కమేండర్?"

దీర్ఘనాథ్ నవ్వాడు. "నీ ప్రశ్నకు హోటల్ న్యూగార్‌లో సమాధానం లభిస్తుంది. ప్రస్తుతం మనం అక్కడికే వెళ్ళాలి పద."

కారులో ఇద్దరూ న్యూగార్ హోటల్‌కి బయలుదేరారు.

రూం నెంబర్ యిరవై రెండులో ప్రవేశించారిద్దరూ.

దీర్ఘనాథ్ టైము చూశాడు రాత్రి పది గంటలు అవుతుంది.

ఒక్కొక్కరు లోపల ప్రవేశిస్తున్నారు. ఆటోమేటిక్‌గా తలుపు మూసుకుంటుంది. అతి చల్లదనంలో వున్న ఎయిర్ కండీషన్ గది కావటంవల్ల ఆహ్లాదకరంగా వుంది. దానికి తగ్గట్టు యింపోర్టెడ్ సెంట్ వాసనతో పరిమళిస్తుంది ఆ గది.

అందరు తమ తమ సీట్లలో కూర్చున్నారు.

దీర్ఘనాథ్ ఓ కుర్చీలో కూర్చున్నాడు. "డియర్ ఫ్రండ్స్! యిప్పటివరకు మనం అనుకున్నవి సాధించాం,

యిప్పటివరకు మీరు నన్ను కమేండర్ అని పిలిచారు. కాని యిప్పుడు అసలు కమేండర్‌ని మీకు పరిచయం చేస్తున్నాను" అనటంతో అందరు ఆశ్చర్యపోయారు.

"డియర్ ఫ్రండ్స్! నా అవర్ గ్రేట్ కమేండర్ విశ్వామిత్ర" అనటంతో డోర్ తెరిచి లోపల ప్రవేశించాడు, ప్రొఫెసర్ విశ్వామిత్ర.

యాభై ఏళ్ళ వయసుగల గంభీరమయిన మనిషి, గ్రే హెయిర్ తలకట్టు, కళ్ళకు తెల్ల అద్దాలు. ఆరడుగుల ఎత్తు. చూపరులకు మహా మేధావిలా కనిపిస్తాడు. రెడ్ కలర్ ట్వీడ్ సూటులోవున్న విశ్వామిత్ర కెమికల్ రిసెర్చిలో ప్రభుత్వ బహుమతి పొందిన మనిషి.

"జంటిల్‌మన్ దిస్ యీజ్ గ్రేట్ డే టు అవర్స్ ఓన్లీ, మనకు మంచిరోజయిన ఈరోజు ప్రపంచానికి చెడు రోజు. ఎలా? ఎందుకని? మన పథకం ప్రకారం సృష్టిని నాశనం చేయబోతూ వున్నాం."

అందరు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

"అంటే మనం విశ్వామిత్రుడిలా అపరసృష్టి చేయబోతున్నాం. ఈ నడుస్తున్న చరిత్రలో మానవ ఆత్మలు మలినమయిపోతున్నాయి. మనిషి మనిషిగా బ్రతకటం మరచిపోయి మగువ, మత్తులో పిచ్చివాడయి, నీచాతినీచాలు చేస్తున్నాడు. రోజురోజుకు యీ భూమిని మలిన పరుస్తూ, అవినీతి కందకాల్ని త్రవ్వుతున్నాడు. దైవం పేరుతో మోసాలు చేస్తూ, స్వార్థం పేరట ధనానికి దాసోహమయి, పదవుల పేరట ప్రజల్ని దోచి, పాపాత్ముడైపోతున్నాడు.

'సంభవామి యుగే యుగే' అని ఎందరు ఈ భూమి

మీద అవతరించినా, ఎన్ని మతగ్రంథాలు రచించినా, ఈ మానవుడు దానవత్వం మానటం లేదు. అందుకే ఈ దేవుళ్ళు, యీ మతగ్రంథాలు, సమాజసిద్ధాంతాలు అంతరించి పోవాలి. ఎలా?

ది గ్రేట్ పాయిజన్ 'కాట్రిడ్జ్' యీ విష పదార్థంతో సృష్టిలో మానవుడు మిగలడు. మిగిలేది— కేవలం మనం, మన అనుచరులు.

అందుకే ఈ విశ్వామిత్ర పథకాన్ని సముద్రగర్భంలో చేయటానికి నిర్ణయించాం. కాబట్టి వాగ్ 15, ఒక డీప్ సన్ సబ్ మెరైన్ మనకు అవసరమయింది. ఈ కార్య క్రమంలో కొందరు యువతులు కావాలి. యువతుల్ని తీసుకువెళ్ళటం జరిగింది. ఆ యువతులు కనే పిల్లలతోనే యికపై సృష్టిని నడుపుతాం. ఇదీ మన పథకం. మీరు వెంటనే మన స్థావరానికి సబ్ మెరైన్ లో బయలుదేరండి" విశ్వామిత్ర వుపన్యాసం ముగించాడు.

# 7

ప్రతి నగరంలో కరపత్రాలు పంచబడ్డాయి. అమాయకు లయిన కిరాయి పిల్లల చేతులనుండి కుతూహలంగా కర పత్రాలు అందుకుంటున్నారు. దేశవ్యాప్తంగా గగ్గోలు ప్రారంభమయింది. పత్రికా విలేకర్లు కరపత్ర వివరాలు ప్రచురిస్తున్నారు. కొందరు అది జోక్ అనుకున్నా, విశ్వామిత్ర ప్రొఫెసర్ గురించి విన్న చాలామంది అది యదార్థమేమో అనుకుంటున్నారు.

"మహాప్రజలారా!

ఈ సృష్టిని, మీ అందర్నీ సర్వనాశనం చేస్తున్నందుకు క్షమించండి. "మీలో ఎందరో మంచివాళ్ళు వున్నా

కొందరు దుర్మార్గులు వుండటంవల్ల, ఈ సృష్టినే నాశనం చేస్తున్నాను. ఈ సృష్టిని తీర్చి దిద్దింది భగవంతుడయితే, దానిని నాశనంచేసి మరొక సృష్టి రూపొందిస్తుంది విశ్వామిత్ర ఒక్కడే.

కామాన్ని చంపుకోలేనివాళ్ళు, కడుపు కొరకు పడుపు వృత్తి చేసేవాళ్ళు, కష్టపడకుండా లక్షలు దాచేవాళ్ళు, ఆ లక్షలతో మిమ్మల్ని మీరు పీక్కుతినేవాళ్ళు యికపై వుండరు.

నా విశ్వామిత్ర పథకంలో మిగిలేది మేము, మా అనుచరులు మాత్రమే. మీకు మృత్యువు ఏ రూపంలో వస్తుందో ఎవరికి తెలీదు. కలియుగం చివరి పాదం నా చేతిలో వుంది. లోకాంత్యం మిమ్మల్ని ఆహ్వానిస్తుంది.

ఒక్కమాట వేలమంది మేధావులు, లక్షలమంది సైంటిస్టులు, కోట్లమంది ప్రొఫెసర్లు, కోటానుకోట్లమంది కెమిస్టులు నా పాయిజన్‌కి ఏంటి పాయిజన్ తయారు చేయలేరు. గుడ్ బై ఆల్ ఆఫ్ యూ.

—ప్రొఫెసర్ విశ్వామిత్ర."

ఈ కరపత్రం చదివిన ప్రతి నగరంలో కోలాహలం ప్రారంభమయింది. మృత్యువు అనేది ప్రతి మనిషికి గుర్తుకు వస్తుంది. పార్కుల్లో, హోటల్లో, సినిమా హాలుల్లో యిదే సంభాషణ జరుగుతుంది. రకరకాల పత్రికలలో రకరకాల నిర్వచనాలు వినిపిస్తున్నాయి. రకరకాల సమావేశాలు జరుగుతున్నాయి.

క్రైస్తవులు లోకాంత్యం అంటున్నారు, హిందువులు కలియుగం ముగుస్తుంది అంటున్నారు. ఇంకా కొందరు యింకోలా అంటున్నారు. దేవుడు, నీతి అంటే తెలియని

ప్రతివాడు బ్రతికిపోవాలని తాపత్రయపడుతున్నారు. చస్తే స్వర్గానికి వెళ్ళాలనుకుంటున్నారు. అంతా క్షణికం అంటూ వేదాంతం చెప్పుకుంటున్నారు కొందరు.

మృత్యువు ఎలా వస్తుందో ఎవరికి తెలియటంలేదు.

# 8

బోయింగ్ 707 శాంతక్రూజ్ ఎయిర్‌పోర్టు చేరుకుంది. పాసింజర్స్ ఒక్కొక్కరు దిగుతున్నారు. అందరిమధ్య ప్రఖ్యాత డిటెక్టివ్ పి. జె. ట్వీడ్ షూట్‌లో దిగుతున్నాడు. అతని వెంటనే అసిస్టెంట్ ధర్మ వున్నాడు.

టెరస్ పైనుండి బైనాక్యులర్‌తో చూస్తున్నాడు సుందర్. ఆ డిటెక్టివ్ ప్రాణాలు తీయటానికి ప్రొఫెసర్ దీర్ఘనాథ్ నుండి అతడికి లక్ష అడ్వాన్సు ముట్టింది.

పదియిరవై నిమిషాలయింది.

డిటెక్టివ్ యిద్దరు బయటకు వచ్చి ఇంపాలా కారు ఎక్కారు. కారు మెల్లగా హంసగమనంతో బయలుదేరింది. సుందర్ ఆతృతగా అంబాసిడర్ ఎక్కి వెంబడించాడు.'

విక్టోరియారోడ్ మలుపు తిరిగింది ఇంపాలా కారు. అక్కడ ట్రాఫిక్ ఎక్కువగా వుంది. అందుకే ప్రక్కగా వున్న లామింగ్‌టన్‌రోడ్ మలుపు త్రిప్పి వేగంగా విక్టోరియారోడ్‌లో క్రాస్ చేశాడు. అప్పటికి యాభై అడుగులు వెనుకగా వుంది ఇంపాలా. తను వేగం తగ్గించాడు. ఇంపాలా వేగం ఎక్కింది.

బ్లూ డైమండ్ హోటల్ దాటుతూ వుంది.

తను క్రొత్తగా ఆ నగరాన్ని చూస్తున్న మనిషిలా చూస్తున్నాడు. సందేహంలేదు పి.జె. తనను గమనించటం లేదు,

విక్టోరియారోడ్‌లో ఖరీదయిన పురాతన భవంతులు, లైబ్రరీలుదాటి పార్కు్రోడ్ మలుపు తిరిగింది. రెడ్ సిగ్నల్ వెలగటంతో ఇంపాలా ఆగింది. సుందర్ మౌంట్ బాటన్ రోడ్డులోనుండి క్రాసుచేసి గ్లాస్కో లేబరేటరీ వున్న ఆనిబిసెంట్ రోడ్ క్రాసుచేశాడు. కరెక్ట్ ఇంపాలా డైభై అడుగులు వెనుక వుంది.

జేబులోనుండి రివాల్వర్ తీశాడు. సైలెన్సర్ అటాచ్ మెంట్ చేశాడు. పదకొండు పన్నెండు నిమిషాలయింది.

చేతులు వణుకుతున్నాయి. భయంగా వుంది. ఇంకా ఇంకా మూడేనిమిషాల వ్యవధి వుంది. ఈ మూడు నిమిషాలలో హత్యజరగాలి. రివాల్వర్ ఏమ్‌లో వుంచుకున్నాడు.

రోడ్డు విశాలంగా వుంది. ఇంపాలా దూసుకువస్తుంది. డ్రైవర్‌ని భుజం తట్టాడు. డ్రైవర్ వెనుక వస్తున్న ఇంపాలాను చూసి స్లో చేశాడు. దానితో సమానంగా అనుసరించటానికి ప్రయత్నిస్తున్నాడు.

ఇంపాలా సమీపించింది.

సుందర్ ముఖం పాలిపోయింది. ఇంపాలాలో డ్రైవర్ తప్ప ఎవరూలేరు. మతిపోయినట్లయింది.

ఇంపాలాకు అడ్డంగా అంబాసిడర్ ఆపాడు. ఇంపాలా ఆగిపోయింది!

గబగబ అంబాసిడర్‌నుండి దిగి సైలెన్సర్ చూపాడు.

"వాళ్ళను ఎక్కడ దించావ్?" కఠినంగా అడిగాడు. ఇంపాలా డ్రైవర్ నవ్వి వేలుపెట్టి చూపాడు. యాభై అడుగుల దూరంలో ఎల్లో టాక్సి బయట నిలబడి వున్నాడు వీ. జె.

సుందర్ గుండెలో రైలుపట్టాల మోత మోగింది. తన

అంబాసిడర్ లోనికి దూరి పారిపోబోయాడు. కాని అప్పటికే పి. జె. అంబాసిడర్ టైరు పేల్చాడు. ఉపేక్షించకుండా సుందర్ పరుగెత్తుతున్నాడు. కారులో వున్న ధర్మ పరుగెత్తుతున్న సుందర్‌ని వెంబడిస్తున్నాడు.

పారిపోతున్న సుందర్ మెదడు మొద్దుబారిపోయింది. అయినా పరుగెడుతున్నాడు. ధర్మ రివాల్వర్ పేల్చాడు. సుందర్ వణకిపోయి సైలెన్సర్ క్రిందవదలి, చేతులు ఎత్తి నిలబడ్డాడు భయంగా.

అతడిని పట్టుకొని, పి. జె. దగ్గరకు తీసుకువచ్చాడు ధర్మ.

# 9

ప్రొఫెసర్ విశ్వామిత్ర, అసిస్టెంట్ దీర్ఘనాథ్ వరుసగా నిలబడ్డ సిబ్బంది ముందు నిలబడ్డారు. చుట్టూ బ్రహ్మాండ్డమయిన మిషనరీ వుంది.

లూసియా వెల్‌వెట్ యూనిఫాంలో వుంది. మిగిలిన సిబ్బంది అంతా వెండిలావున్న దుస్తులు ధరించారు.

"డియర్ ఫ్రండ్స్! మనం ఇప్పుడు సముద్రమట్టానికి రెండువేల అడుగుల లోతులో వున్నాం. కరెక్టుగా చెప్పాలంటే డాగర్ మవుంటెన్ క్రింద వున్నాం. వాగ్ 15 సహాకారంతో డాగర్ మవుంటెన్ అడుగునవున్న ఈ బ్రహ్మాండమయిన గుహలో మనం పదిహేనురోజులు శ్రమపడి స్థావరం ఏర్పరచుకున్నాం.

ఈ డాగర్ కొండలో మూడుభాగాలు, రెండు కేవ్స్ వున్నాయి. మూడుభాగాలలో ఒకటి రాకెట్ సెంటర్ ఆరు రాకెట్లు ఏర్పాటుకు ఆ భాగం. పోతే రెండు టెలివి

జన్ రూం, కంట్రోల్ రూం. ఇందులోనుండి అన్ని భాగాలు కనిపిస్తాయి. మూడవది మన రెసిడెన్స్. ఇక్కడ మనం వుంటాం.

ఇకపోతే రెండు కేవ్స్ ఒకటి మనం తెచ్చిన అమ్మాయిలకు ప్రత్యేకమయిన గదిలాంటిది. రెండు వాళ్ళను ఎంజాయ్ చేయటానికి రెండో కేవ్.

అయితే విషాదకరమయిన వార్త ఏమంటే రాత్రి మన సిబ్బందిలో ఒకమనిషి పారిపోటానికి ప్రయత్నించాడు. రాత్రి టెలివిజన్‌లో చూశాను. ఆ మనిషి యీ స్థావరం నుండి పారిపోటానికి ఎందుకు ప్రయత్నించాడు. ఎవరు ఏమయినా మీకు కావలసిన సదుపాయాలు యిక్కడ వున్నాయి. మనం ఒక కార్యక్రమం తలపెట్టాం. ఈ సితిలో పారిపోయాడంటే ఐ హేట్ దట్ బ్లడీ మేన్. సెంబర్ 26'' పిలిచాడు.

''యస్ కమేండర్.''

''ఆ టబ్‌లో వున్న చేపను పట్టుకురా'' అన్నాడు విశ్వామిత్ర.

సెంబర్ ట్వెంటీసిక్స్ గబగబ వెళ్ళి తొట్లో చెయిపెట్టి అరురంగులున్న చేపను పట్టుకున్నాడు. క్షణంలో వికృతంగా అరచి, కాళ్ళు చేతులు ఆడిస్తూ, క్రింద పడిపోయాడు. భయంకరంగా అరుస్తూ తన్నుకొంటూ చనిపోయాడు.

''డియర్ ఫ్రండ్స్ అది 'మురాండిరాగ్ ఫిగ్!' అంటే పాయిజన్ ఫిష్ అన్నమాట. ఆ ఫిష్ టచ్ అయితే అలాగే చనిపోతారు. ఇక్కడనుండి పారిపోవటానికి ఎవరు ప్రయత్నించినా యిదే ముగింపు,'' అన్నాడు విశ్వామిత్ర.

దీర్ఘనాథ్ ఓ స్విచ్ నొక్కాడు. "ఈ ఫిష్ తాకిన శవాన్ని మనం తాకకూడదు" అంటూ శవంవైపు తిరిగాడు. కంప్యూటర్ శవాన్ని పీత డెక్కలో పట్టినట్లు పట్టి తీసుకువెళుతుంది.

# 10

డేని, గబ్బర్ సింగ్ బోటు నడుపుతున్నారు.

సముద్రం మధ్యలో చిన్న కాగితపు పడవలా వుంది. స్టీమ్‌బోటు వేగంగా దూసుకువెళుతుంది. లోపల చాపలతో పాటు మినియేచర్ టేప్ రికార్డులు, వాచీలు, గోల్డ్ చైన్ వున్నాయి. సముద్రంమీద చల్లనిగాలి తెరలుగా వీస్తుంది.

ఉదయం పదిగంటలయింది.

సాయంకాలం నాలుగుగంటల ప్రాంతంలో తీరం చేరుకోవచ్చు అనుకున్నారు. అప్పటికి వందలమైళ్ళ ప్రయాణం జరిగింది. గబ్బర్ సింగ్ సిగర్ వెలిగించి చుట్టూ కలయచూస్తున్నాడు. డేని టిన్ పగలగొట్టి మిల్క్ తాగుతున్నాడు.

"డేని" పిలిచాడు గబ్బర్. డేని తలెత్తి గబ్బర్ చూస్తునవైపు చూశాడు. నీటిపై తేలాడుతున్న శవం. స్టీమ్‌బోటు మెల్లగా సమీపిస్తుంది.

ఇద్దరు నిశితంగా చూశారు.

ముఖం వికృతంగా వుంది. కళ్ళు ముక్కు పెదవులు చాపలు తినివేయటంవల్ల వికృతంగా వుంది.

* * *

మరునాడు ఉదయం కాఫిన్ బాక్స్ మూత తెరిచి చూశాడు పి. జె. "ఈ శవం మొహం మూడువందల డెబ్బై

మైళ్ళదూరంలో కనిపించింది,'' అన్నాడు గబ్బర్ వేలెట్ లోనుండి సిగరెట్ తీసి వెలిగిస్తూ.

ఇద్దరి ముఖాలలోనికి చూశాడు పి. జె.

"ఈ యూనిఫాంనుబట్టి, ప్రపంచ ప్రమాదపు స్థితి గతులనుబట్టి, ఇది మీ దగ్గరకు తీసుకువచ్చాం,'' అన్నారు ఇద్దరు.

"మీ రెవరు?''

భయంగా ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

చూపులతో మనసులో భావాల్ని చదవగల పి. జెకి అర్థమయింది.

"మీకు అర్థమయ్యే వుంటుంది. స్మగుల్డు బిజినెస్, మమ్మల్ని అరెస్టు చేయరనే నమ్మకంతోనే మీ దగ్గరకు వచ్చాం.''

"యస్. కాని అది నా డ్యూటీ కాదు. కాని మీవల్ల ఓ సహాయంకావాలి,'' అన్నాడు కుషన్ లో కూర్చుంటూ. ఇద్దరినీ ఎదురుగా కూర్చోమన్నాడు. కూర్చున్నారు. ధర్మ నాలుగు గ్లాసులతో బీర్ తెచ్చి అందరికీ యిచ్చి, ఒకటి తను తీసుకున్నాడు.

"మీ ధైర్యం చాలా గొప్పది. ఈ శవంవల్ల, మాకు లభించిన సమాచారంవల్ల, శత్రువుల స్థావరం సముద్రం లోనే అని స్థిరంగా నిర్ణయించవచ్చు. కాబట్టి మీలాంటి సమర్థులు నాతో సహకరించాలి.''

ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

"పరిస్థితుల ప్రాబల్యంవల్ల కొందరు దొంగలు అవుతారు. అయితే అందరు దొంగల్లా చావరు. మీకు ఎంత డబ్బు కావలసినా ఇస్తాను. మీరు నాతో సహకరించాలి.''

"అలాగే సర్."

"ధాంక్యూ. అడ్రసు ధర్మకు యిచ్చి వెళ్ళండి. అవసర మయినపుడు కబురు పంపుతాను."

ఇద్దరి ముఖాలు ఆనందంతో వెలిగాయి.

# 11

డిఫెన్సు మినిస్టర్, ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ డిపార్టుమెంట్, ఆర్మీ జనరల్ మేనేజర్లు, డిటెక్టివ్ పి.జె. అందరూ కూర్చొని వున్నారు.

డిఫెన్సు మినిస్టర్ అన్నాడు. "ప్రస్తుత దేశభద్రత మనచేతుల్లో వుంది. ప్రపంచ ప్రమాదం ఓ రకంగా జోక్ అయినప్పటికి మేఘమాత పేలటం, వాగ్ 15 అంతర్ధానం కావటం, జలాంతర్గామి దొంగిలించటం, అందమయిన యువతులు అగమ్యగోచరం కావటం ఆలోచిస్తే, యధార్ధ మేమో అనిపిస్తుంది."

"ఎందరో జీనియస్ క్రైమ్ బ్రాంచి ఆఫీసర్లు పరిశోధించినమీదట రెండు నిర్ణయాలు తీసుకోబడ్డాయి. ఒకటి–యీ ప్రాజెక్టు సముద్రగర్భంలో వుందని, రెండు–ప్రపంచ ప్రమాదానికి యింకా కొద్దిరోజులు వ్యవధి వుందని," ఐ. జి. అన్నాడు.

పి. జె. తల ఊపాడు. "మనకు పట్టుబడ్డ సుందర్ స్టేట్‌మెంట్ ప్రకారం డాగర్ మవుంటెన్ అనేది హీరియోగ్రఫీలో లేదు. అది వాళ్ళు పెట్టుకున్న పేరు. ఇదే వాళ్ళ స్థావరం అని నిర్ణయించవచ్చు. ఆ కారణంగానే వాగ్ 15 దొంగిలించటం జరిగింది. దేని, గబ్బర్‌కు దొరికిన శవం గురించి ఆలోచిస్తే, యిది నిజమనిపిస్తుంది. ఇంత రహస్య మయిన స్థలంలో యీ కార్యక్రమం సాగిస్తున్నారంటే

దీనికి ఖచ్చితంగా వ్యవధి, కొంత ఆపరేషన్ అవసరం అనిపిస్తుంది."

"ఇప్పుడు కర్తవ్యమేమిటి?" ఐ. జి. అడిగాడు.

"సముద్రగర్భంలో దర్యాప్తు చేయటమే" పి. జె. అన్నాడు.

"అంతకంటే మార్గంలేదు. మిస్టర్ పి. జె. యీ కార్య క్రమానికి నీవే పూనుకోవాలి. ఈ ప్రపంచ ప్రమాదం తప్పించే బాధ్యత నీపై వుంది," డిఫెన్స్ మినిస్టర్ అన్నాడు.

అందుకు పి. జె. సమ్మతించాడు.

# 12

వాలి సిగర్ వెలిగించి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు. ప్రక్కనే పి. జె. కూర్చున్నాడు. వారి వెనుక యుగంధర్ మిర్రర్ ప్రక్కనే కూర్చొని బైనాక్యులర్ సరిచేసుకొని డైరి తెరిచాడు. నర్సన్ బయలుదేరిన చోటు పిన్ చేశాడు. ధర్మ వెనుకగా నిలబడ్డాడు. వైర్లెస్ ఆపరేటర్ చంద్ర మోహన్ యియర్ ఫోన్స్ తగిలించుకున్నాడు. మాలిని, దేని, గబ్బర్ ఎవరిపనులలో వారున్నారు.

ఎర్రని బోర్డుమీద సబ్ మిరైన్ ఎంత లోతులో వెళు తుందో అంకెలు కనిపిస్తున్నాయి. సబ్ మిరైన్ యాభై కిలోమీటర్ల వేగంతో పోతుంది.

ఎండ ఎక్కువగా వుండటంవల్ల సూర్యకిరణాలు నీటి పై భాగంలోనుండి కాంతివంతంగా పడటంచేత ముప్పై మీటర్ల దూరం అన్నివైపుల కనిపిస్తుంది.

సబ్ మిరైన్ నేలకు మూడుమీటర్ల ఎత్తులో వెళు తుంది.

అప్పటికి రెండువందల మీటర్ల లోతు.

గవ్వలు ముక్కలయి అక్కడక్కడ మెరుస్తూ కని పిస్తున్నాయి. పీతలు అడ్డదిడ్డంగా పారిపోతున్నాయి. తాబేళ్ళు గభాలున ముడుచుకు కూర్చుంటున్నాయి.

అప్పటికి సబ్ మెరైన్ బయలుదేరి రెండుగంటలయింది.

డిటెక్టివ్ పి. జె. సిగరెట్ వెలిగించి, ఆలోచనలో పడ్డాడు. యుగంధర్, నర్సన్ మాప్ లో చూస్తూ వెళ్ళ వలసిన దారి పిన్ చేస్తున్నారు.

"ప్రొఫెసర్ దీర్ఘనాథ్, విశ్వామిత్ర భలే ప్రాంతం ఎన్నుకున్నారు" అన్నాడు వాలి.

అందరు తలలు ఊపారు.

# 13

ప్రొఫెసర్ విశ్వామిత్ర అందరిని పిలిచాడు. పిలుస్తున్నట్లు బెల్ మ్రోగించాడు. ఆ బెల్ మ్రోగుతుంది కాబట్టి అందరు అక్కడకు వచ్చారు.

"డియర్ ఫ్రండ్స్. ఈ అత్యవసర సమావేశం ఎందుకంటే మన కార్యక్రమాలు చాలా తొందరగా ముగించాలి. హిట్లర్ ప్రపంచాన్నే జయించాలనుకున్నాడు. జయించినా చరిత్ర మారదు. కాని మనం ఆ చరిత్ర మార్చాలనుకున్నాం. కాని మనలో వున్న ఒకరిద్దరి అసమర్థులవల్ల మన స్థావరం తెలిసిపోయింది, ప్రభుత్వానికి. బాంబులతో మన స్థావరాన్ని ధ్వంసంచేయటం కుదరదు. కారణం మనం రెండువేల అడుగుల లోతులో వున్నాం కాబట్టి శక్తివంతమయిన బాంబు వినియోగించటానికి ఐక్యరాజ్యసమితి ఒప్పందం కావాలి. దానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి.

కాని యిప్పుడు మన పథకాన్ని ధ్వంసం చేయటానికి ప్రఖ్యాత డిటెక్టివ్ పి. జె. వస్తున్నాడు. పి. జె. దగ్గర చాలా శక్తివుంది. ఎముకల్ని పూడ్చి మనిషిని పైకితీసి ఆ మనిషితో నిజం చెప్పించగల మేధావి. మరొక గొప్ప మేధావి బైలాజికల్ ప్రొఫెసర్ యుగంధర్. సముద్రంలో ఏదో చెట్టువేరు తీసి చెప్పమంటే ఆ చెట్టు చరిత్ర చెప్పగల మేధావి. ఇక పోతే వాలి. బాంబుల మధ్య సబ్‌మిరైన్ నడిపి ప్రపంచస్థాయిలో ప్రభుత్వపు బహుమతి పొందిన మనిషి. వీరు గాక యింకా ఆరుగురున్నారు. వీరు 'డీప్ స్టార్ 9' లో వస్తున్నారు."

రణగణధ్వని ఒకరికొకరు మాట్లాడుతున్నారు.

"అయినా భయంలేదు. మనం చాలా తొందరలో మన కార్యక్రమం ముగించాలి. అందుకే శక్తివంచన లేకుండా కృషి చెయ్యాలి."

"డియర్ ఫెర్నాండెజ్."

"యస్ కమేండర్."

"మనదగ్గర మిగ్ ప్లెయిన్ వుంది. నీతోపాటు శ్రీకాంత్‌ను తీసుకువెళ్ళు. మెగ్నెటిక్ రికే ప్రకారం సబ్‌మిరైన్ ఎక్కడవుందో చూడు. సబ్‌మిరైన్ పైకివచ్చిన వెంటనే బాంబింగ్ జరగాలి."

"యస్ కమేండర్."

# 14

"టచ్ అప్" అన్నాడు వాలి సిగర్ పొగవదులుతూ.

డేని సీట్లో కూర్చొని కుతూహలంగా డ్రైవింగ్ నేర్చుకుంటున్నాడు. స్టెపిన్స్ వెనుకకు లాగాడు డేని, ధర్మ ఫ్లాటింగ్ స్పీడ్ చూశాడు. సబ్‌మిరైన్ క్రమంగా పైకి వెళుతుంది.

పి. జె. పెరిస్కోప్ క్రిందకులాగి చుట్టూ చూశాడు. సబ్ మెరైన్ వేపు దూసుకువస్తుంది మిగ్ ప్లెయిన్.

"టచ్ డౌన్" అరిచాడు పి.జె, ధర్మ స్టెపిన్స్ బలంగా తోశాడు. అప్పటికే దూసుకువస్తున్న మిగ్ ప్లెయిన్ బాంబులు వేస్తుంది. నీళ్ళు అల్లకల్లోల మవుతున్నాయి. వాలి గబాలున డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు.

అందరు కంగారుగా బయటకు చూస్తున్నారు. నీళ్ళ బుడగులు, నురుగులు సుడులు తిరుగుతున్నాయి. ఫ్లోటింగ్ రెండువందల మీటర్లకు పెరిగింది. క్షణాలలో సబ్ మెరైన్ అడుగుకు చేరింది.

అందరు నిట్టూర్చారు.

నేలలోనుండి విచిత్రమయిన శబ్దం ప్రారంభమవుతుంది, శబ్దంతో పాటు యిసుకపై బుడగలు ప్రారంభమయ్యాయి. ఆ బుడగలు పైకిపోతున్నాయి. అక్కడక్కడ ఇసుక లేగుతుంది. చేపలు కంగారుగా పరుగెడుతున్నాయి. విచిత్రమయిన ఆ శబ్దంతో భూమి కదులుతున్నట్లుంది. ఆందోళనగా కంగారుగా అందరు చూస్తున్నారు.

"మూడు వందలు" ఆశ్చర్యంగా అన్నాడు పి. జె. ప్రవాహ వేగం మూడువందల బోర్డు చూసి. ఇసుక పైభాగంలో వున్న గడ్డిమొక్కలు లేస్తున్నాయి. పై భాగానికి వెళుతున్నాయి. ఇసుక పైభాగంలో చారలు ప్రారంభమయ్యాయి.

"భూకంపం వస్తుంది" యుగంధర్ అరిచాడు.

"భూకంపమా?" దేని ఆశ్చర్యంగా అన్నాడు.

సబ్ మెరైన్ నూటయాభై మైళ్ళ వేగంతో దూసుకు పోతుంది.

అందరి గుండెలు గుబగుబ లాడుతున్నాయి. ముఖాలు రంగులు మారాయి. నీటిసాంద్రత ప్రవాహ వేగం మారి పోయింది. భయంకరమయిన శబ్దం వినిపించింది. సగంగా చీలిపోయింది సముద్రం లోయలా ఏర్పడింది. సబ్ మెరైన్ ఎంత వేగం హెచ్చించినా ప్రవాహ వేగం ఐదువందలు పెరగటంతో వెనకకు నెడుతుంది.

"వెనుక భాగంలో భూమి చీలివుంటుంది" యుగంధర్ అన్నాడు.

"యస్. యస్" అన్నాడు పి. జె.

సబ్ మెరైన్ అటు యిటు వూగిపోతుంది. రెండు వైపులకు కదలటంతో అందరు అటు యిటు ఒరిగిపోతు న్నారు. పెద్ద పెద్ద చాపలు సబ్ మెరైన్ కి ఢీకొంటున్నాయి.

"నీరు ఎగుడుదిగుడుగా ప్రవహించటంతో తిరగబడే ప్రమాదం వుంది" అన్నాడు యుగంధర్. అయినా శక్తి వంతంగా వాలి సబ్ మెరైన్ ను నడుపుతున్నాడు.

మేగ్నటిక్ రిలే విజిల్ వినిపించింది. మరొకప్పుడయితే గమనించే వాళ్ళుగాని ఇప్పుడా ఆలోచనలేదు. మునుంజి షిప్ దూసుకువస్తూ సబ్ మెరైన్ కుడివైపు దూరింది. అలా దూరటంతో సబ్ మెరైన్ ప్రక్కకు ఒరిగిపోయింది. క్షణంలో స్టడీలో వుంచినా లాభంలేదు. మళ్ళీ దొర్లి యధాస్థానానికి వచ్చింది.

అందరు వణకిపోతున్నారు.

పి. జె. మేగ్నటిక్ రిలేవైపు చూసి "టరన్ దట్ సైడ్" అన్నాడు. వాలి తలూపి అటువైపుకు నడిపాడు.

కొద్దిదూరంలో విరిగి ముక్కలయిపోయిన విమానం కనిపించింది.

పి. జె. గబాలున లేచి ఎల్లో కలర్ స్నాక్బ్ వేసుకొని, దేనిని పిలిచాడు.

"లాభంలేదు పి. జె. మిషనరీ హీట్ ఎక్కింది. ఈ వేగంతో వుంటే పేలిపోతుంది. వదిలేస్తే అగాధంలో పడుతుంది" వాలి అన్నాడు.

"జెస్ట్ ఎ మినిట్" అన్నాడు పి. జె.

నైలాన్ త్రాడు తీసుకొని ఒకటి తనకు దేనికి, కట్టి బయటకు వచ్చాడు "బి కేర్ ఫుల్ మై సన్" యుగంధర్ అన్నాడు.

ప్రవాహంలో జరిగిపోతూ విమానం దగ్గరగా వచ్చారు. పి. జె. త్రాడు విమానం బాడికివున్న ఇనుప కమ్మీలకు చుట్టాడు. దేని సహకరించాడు.

సబ్‌మిరైన్ జరగటం ఆగిపోయింది. చెత్త, గడ్డి, చేపలు వచ్చి వారిని ఢీకొంటున్నాయి. ఇసుక ప్రవాహంతో వచ్చి సబ్‌మిరైన్ పైన పడుతుంది. చెవులు చిల్లులు పడేటంత హోరు. నురగలు కక్కుతున్న నీరు.

ఆ నీరు పైభాగంలో పొర్లుతున్నట్లు కనిపించటంతో ప్లెయిన్ వెళ్ళిపోయింది. సబ్‌మిరైన్ సముద్రంలో మునిగి పోయిందని తీర్మానించుకున్నారు.

వాలి అన్ని స్విచ్‌లు ఆపాడు. పి. జె. దేని నైలాన్ త్రాడు పట్టుకొని అతి ప్రయత్నంమీద తిరిగి లోపలకు ప్రవేశించారు. మాలిని, చెరొక పెగ్ బ్రాంది అందించింది. "కంగ్రాచ్యులేషన్స్ పి. జె" అన్నాడు వాలి.

"మనం బ్రతికినట్లేనా?" నర్సన్ అన్నాడు అనుమానంగా.

"కొన్ని క్షణాలు బ్రతుకుతాం" నవ్వాడు యుగంధర్.

"మిస్టర్ నర్సన్ మన ప్రయాణం ప్రాణాలతో చెలగాటం. ఎప్పుడు? ఎవరు? ఎలా? చనిపోతారో తెలియదు. మన ప్రాణాలుపోయినా పరవాలేదు. కాని మన ప్రాణాలు పోయే చివరిక్షణాలలోనైనా శత్రువుల్ని తుదముట్టించాలి" వాలి అన్నాడు.

"హియర్ ...హియర్" అన్నాడు గబ్బర్ సింగ్.

ప్రవాహపు వేగం క్రమంగా తగ్గుతుంది. అందరు బితుకు బితుకుమంటూ చూస్తున్నారు. పి. జె. విరిగిన విమానం చూస్తున్నాడు.

సమయం నాలుగుగంటలయింది.

ప్రవాహపు వేగం నూటపాతికవరకు తగ్గింగి. "గుడ్ సబ్ మిరైన్ కదల్చవచ్చు" అన్నాడు వాలి.

గబ్బర్, ధర్మ న్యూట్రోబ్స్‌తో బయటకు వెళ్ళారు' సబ్ మిరైన్ చుట్టూ యిసుక పేరుకొని వుంది. క్రమంగా తొలిగించి తాడు విప్పారు.

సబ్ మిరైన్ స్టార్ట్ చేయబోయాడు వాలి.

"బుల్ సిప్" అరిచాడు యుగంధర్. పి. జె. బయట వున్న ధర్మకు వస్తున్న చేపను చూపాడు. చేయి విసిరాడు రమ్మనట్లు వాళ్ళు అప్పటికి విరిగిన విమానం దగ్గర వుండటం చేత వాళ్ళు వచ్చేలోపు ఆచేప వచ్చే అవకాశంవుంది. "తాడు విప్పకపోతే బావుండేది"అన్నాడు యుగంధర్.

"యిప్పుడెలా?"

"లైట్స్ ఆర్పండి ఎవరూకదలవద్దు. ఎవరయినా కదిలితే బంతి ఆడినట్లు యీ సబ్ మిరైన్‌తో ఆడుతుంది," అన్నాడు యుగంధర్.

ధర్మ, గబ్బర్ ఆత్రుతగా విరిగిపోయిన విమానపు బాడిలో దూరారు. లోపల అస్థిపంజరాలు కూర్చునట్లున్నాయి. చిన్న గుడ్డముక్కలు, నాచుపట్టిన కమ్మీలు కొన్ని చిన్నబాక్సులు వున్నాయి.

బుల్ సిప్ రానే వచ్చింది. 'కిక్కుర'మని అరుస్తూ సబ్ మెరైన్ చుట్టూ తిరుగుతుంది. సబ్ మెరైన్ అంత ఎత్తు వుంది. ఆ అరుపుకు సబ్ మెరైన్ ప్రతిధ్వనిస్తుంది.

బుల్ సిప్ చేప చాలా అందంగా వుంది. సగం నల్లగా వుంది. సగభాగం వెన్నునుండి తెల్లని మచ్చలున్నాయి. తోక విశాలంగా వుంది. మోప్ గీసినట్లు గీతలువున్నాయి. వెన్నుపైన విసనకర్రలాంటి ఈకలువుండి, పసుపురంగు చారవుంది. మొప్పల ప్రక్క పసుపురంగులో వింగ్స్.

సబ్ మెరైన్ చుట్టూ తిరిగి విమానం దగ్గరకు వెళ్ళింది. అప్పుడే మరొక ప్రక్కనుండి వస్తున్న పెద్దచేపను చటుక్కున నోరు తెరిచి మింగింది. మళ్ళీ యీదుతూ విమానం బాడి దగ్గరకు వెళ్ళింది.

పి. జె. నిశితంగా చూశాడు. నోరు తెరిస్తే ఓమనిషిని సులభంగా మింగేస్తుంది.

ధర్మ, గబ్బర్ రెండు సీట్లమధ్య కూర్చున్నారు.

బుల్ సిప్ కదిలింది. మెల్లగా సబ్ మెరైన్ వెనక భాగంలోనికి వచ్చి వెళ్ళిపోయింది.

యుగంధర్ నిట్టూర్చాడు. ధర్మ, గబ్బర్ ఆత్రుతగా సబ్ మెరైన్ లోపలకు ప్రవేశించారు.

# 15

"కాలింగ్ డీప్ స్టార్ 9...కాలింగ్ డీప్ స్టార్ 9..." నాలుగు సార్లు చంద్రమోహన్ పిలిచాక, కంట్రోల్ నుండి మెసేజ్ వచ్చింది. జరిగిన సంఘటనలు వివరించారు.

లోపల లైట్స్ వేశారు. మాలిని అందరికి ఓస్కెట్స్ సప్లయి చేసింది.

కొన్ని నిమిషాల తరువాత యుగంధర్, వాలి పి. జె. విశ్రాంతికి ఉపక్రమించారు.

నర్సన్ మాప్ చూస్తు ఆలోచిస్తూ ట్రేస్ గీస్తున్నాడు. దేని, ధర్మ సబ్ మెరైన్ డ్రైవ్ చేస్తున్నారు.

"యింకా కొద్దిదూరంలో మనకు ప్రథమంగా కొండ అడ్డువస్తుంది. వైట్ మవుంటెన్" అన్నాడు నర్సన్.

అక్కడక్కడ చిన్నరాళ్ళు పెద్దరాళ్ళు అడ్డంగా వస్తు న్నాయి. ధర్మ దేనికి కాషన్స్ యిస్తూ నడుపుతున్నాడు. చిన్నచిన్న కొండ గుట్టలు పాతేసినట్లువున్న పాలరాళ్ళు కనిపిస్తున్నాయి. రాయి కాంతివంతంగా వుంది. అందువల్ల పరిసరాలు కాంతిగా మెరుస్తున్నాయి. అక్కడక్కడ లోయలు, మలుపులు వున్నాయి.

అంతలోనే ఎదురుగా వున్న దృశ్యం చూసి అందరి ముఖాలు వివర్ణమయ్యాయి.

కొన్ని పుర్రెలు ఎముకలు కొన్ని కొమ్మలకు వేలాడు తున్నాయి. మనిషి పుర్రలేగాక చాప అస్థిపంజరాలు, సీటి గుర్రం అస్థిపంజరాలు ఆ కొమ్మలకు వున్నాయి. ఎన్నిరకాల చెట్లు వుండటం చేత ఆ చెట్లు ఏమిటో అర్థం కాలేదు.

సబ్ మెరైన్ ఆ చెట్టు ప్రక్కగా వెళుతోంది.

ప్రక్కనే వున్న చెట్టుఆకులు జీవం వున్నట్లు కదులు తున్నాయి. అలా కదులుతూనే కొమ్మలన్నీ ఒక్కసారిగా సబ్ మెరైన్ వైపుకు వంగి సబ్ మెరైన్‌ను చుట్టివేశాయి. ఏదో భయంకరమయిన శక్తి ఆపివేసినట్లు సబ్ మెరైన్ ఆగి పోయింది. ఎంత ప్రయత్నించినా కదలటం లేదు.

యుగంధర్ ఆతృతగా వచ్చాడు. "ఓ గాడ్ డ్రాగో

త్రీస్" అన్నాడు కంగారుగా. వాలి, వెనుక పి. జె. కూడా వచ్చాడు. "యింపాసిబుల్ సబ్ మిరైన్ కదలదు" అన్నాడు యుగంధర్.

మూడువైపుల చెట్టుకొమ్మలు తప్ప ఏమీ కనిపించటం లేదు. యింజన్ ఎంత స్టార్ట్ చేసినా ప్రయోజనం లేదు. అద్దాలమీద పాముల్లాకొమ్మలు ఆడుతున్నాయి. కొంత సేపటికి ప్రొఫెలరు ఆగిపోయింది. ఏమాత్రం అవకాశం వున్నా అద్దాలు బద్దలుకొట్టి లోపలకు ప్రవేశించాలని ప్రయత్నిస్తున్నట్లు వున్నాయి.

"యివి డ్రాగో చెట్లు. భూమిపై నరభక్షక చెట్ల జాతికి చెందింది. ఐదు మీటర్ల దూరంలో ఏవస్తువయినా తనలోనికి లాక్కుంటుంది. సబ్ మిరైన్ ఎట్టి పరిస్థితిలోనూ కదలదు," అన్నాడు యుగంధర్.

"మరెలా?" నర్సన్ భయంగా అడిగాడు.

అందరు సందిగ్ధంలో పడ్డారు.

వీటినుండి తప్పించుకునే మార్గం లేదా?" దేని అన్నాడు.

"మనం యిక్కడే చావవలసిందేనా?" భయంగా నర్సన్ ముఖం పెట్టాడు.

"నీలాంటి పిరికి మనిషిని తీసుకురావటమే తప్పు." చిరాగ్గా అన్నాడు వాలి.

పి. జె. మిర్రర్ దగ్గరకు నడిచాడు. కొమ్మలు మరీ హుషారుగా కదులుతున్నాయి. ఏదో శబ్దంతో గసపెడుతున్నాయి.

"సూక్ర్యూబ్స్" అన్నాడు పి. జె.

"వద్దు పి. జె. చాలా ప్రమాదం! కొమ్మ తగిలిందంటే అమాంతంగా లేపి నల్లిని నలిపినట్లు నలిపివేస్తాయి" యుగంధర్ వారించాడు.

"పర్వాలేదు ప్రొఫెసర్! చాలా జాగ్రత్తగా వుంటాను ఐ ట్రయ్ మై బెస్ట్" అంటూ స్క్యూబ్ ధరించాడు.

"నేను వస్తాను పి. జె" అన్నాడు వాలి.

"నో సర్. మీరు డ్రైవింగ్ సీటులో కూర్చోండి. ధర్మ, డేని నాతో వస్తారు," అన్నాడు పి. జె.

ముగ్గురూ స్క్యూబ్స్ ధరించారు. అందరికీ భయంగా కణకణగావుంది. మాలిని కళ్ళు తడి అయ్యాయి.

"మీరు అద్దాలు దగ్గరగా వెళ్ళండి" అన్నాడు పి. జె. మూడు అడుగుల పొడవుగల కత్తులు తీసుకున్నారు. మెల్లిగా క్రింద డోర్ తెరిచాడు పి. జె. ఒక కొమ్మ గబాలున దూసుకు వచ్చింది. కత్తితో ఒక్క వేటు వేశాడు. కొమ్మ తెగి తెల్లని ద్రవం, సన్నపొగ వచ్చింది.

పైన సబ్‌మిరైన్‌లో అద్దం దగ్గరగా అందరు వుండటంతో కొమ్మలన్నీ పైభాగంలో కదులుతున్నాయి. పి జె నీళ్ళలో దిగే ముందు చుట్టూ చూశాడు. కొమ్మలన్ని పైకే వున్నాయి. ధర్మ, డేనికి సిగ్నల్ యిచ్చాడు. ముగ్గురు మెరుపులా యీది, చెట్టు కాండంని గబగబ నరికివేశారు. కొమ్మలు కదిలి డేనిని చుట్టాయి. ధర్మ నరికివేశాడు. కాండం తెగిపోవడంతో చెట్టుకొమ్మలు నిర్జీవంగా వాలిపోయాయి.

"హాయ్" అరిచారు అంతా.

"జీనియస్" యుగంధర్ అన్నాడు.

పి. జె. ధర్మ, డేని తిరిగి సబ్‌మిరైన్‌లో ప్రవేశించారు.

వాలి సబ్‌మిరైన్ స్టార్ట్ చేసి, వేగంగా దిశ మార్చి డ్రైవింగ్ చేశాడు. ఎన్నో డ్రాగో చెట్లు వున్నా ఏఒక్క దానికి అందకుండా ఆ కొండ మలుపు తిప్పిదాటించారు.

# 16

"కాలింగ్ డీప్ స్టార్ 9...కాలింగ్ డీప్ స్టార్ 9" కొన్ని నిమిషాల తరువాత కంట్రోల్ నుండి మెసేజ్ వినిపించింది.

"హౌ యీజ్ యువర్ పొజిషన్"

"నౌ వుయ్ ఆర్ ఓ. కె."

"దిస్ యీజ్ డేంజరస్ మెసేజ్ టుయూ. యింకా నాలుగైదు గంటలలో తుఫాను వస్తుంది. ప్రస్తుతం మీకు వెయ్యి కిలోమీటర్ల దూరంలో వుంది. బి కేర్ ఫుల్!"

అందరి ముఖాలు మాడిపోయాయి.

పి. జె. బరువుగా నిట్టూర్చాడు.

"విశ్వామిత్రతో ప్రమాదం ఎదుర్కొనటం ఎలా వున్నా, యీ ప్రమాదం చాలా భయంకరంగా వుంది" అన్నాడు ధర్మ ఆలోచిస్తూ.

"యిప్పుడు మనం ఎంత దూరం వచ్చాం?" పి. జె. ప్రశ్న.

"రెండు వేల నూటయాభై కిలోమీటర్లు" నర్సన్ అన్నాడు.

"శత్రువుల స్థావరం యింకా ఎంతదూరం వుండవచ్చు."

"ఏడువందల కిలోమీటర్లలోపు వుండాలి."

మేప్ చూశాడు పి. జె. వైట్ మవుంటెన్ ప్రక్కగా మరొక మవుంటెన్ వుంది. "యిప్ నోవ్స్ మవుంటెన్."

"యీ కొండలో కేవ్స్ వున్నాయా?" పి. జె. ప్రశ్నించాడు.

"యస్ చాలావున్నాయి. అయితే ప్రమాదకరమయిన జంతువులు కూడా వున్నాయి."

"అయినా పరవాలేదు. యీ ప్రమాదంనుండి తప్పుకో

వాలంటే ఏదైనా గుహలో సబ్‌మిరైన్ను దాచటం మంచిది. వాయుగండం దిశమారి యిలాటి స్తే సబ్‌మిరైన్ దానితోపాటు మనం నీళ్ళపాలవుతాం. గో యెహెడ్'' అన్నాడు పి. జె. అప్పటికే తుఫాను ప్రారంభమైన సూచనలు కనిపిస్తున్నాయి.

సబ్‌మిరైన్ వెయ్యి ఐయిదువందల మీటర్ల లోతులో వెళుతుంది. రెండువందల కిలోమీటర్ల వేగం, అదేవేగంతో నీటి ప్రవాహం వుంది. అక్కడక్కడ షుమారయిన చేపలు ఎదురయి తప్పుకుంటున్నాయి. నాచుపట్టిన రాళ్ళ గుట్టలు, గుట్టలపైన పుట్టగొడుగులులాంటి మొక్కలు వున్నాయి.

అక్కడ ఒక పెద్ద కొండగుహలో సబ్‌మిరైన్‌ను ఆపి అందరూ విశ్రాంతి తీసుకున్నారు. ఇరవై నాలుగు గంటల తర్వాత తుఫాను తగ్గి, సముద్రంలో తిరిగి ప్రశాంతత ఏర్పడింది.

# 17

సబ్‌మిరైన్ వేగంగా నడుస్తుంది. వాలి చేతి రుమాలుతో ముఖం తుడుచుకున్నాడు. పి. జె. సిగరెట్ వెలిగించాడు.

మాగ్నెటిక్ రిలేవిజల్ వినిపించింది.

అందరు కుతూహలంగా చూశారు. మాగ్నెటిక్ రీడింగ్ చూపించింది. ''సమీపించాం'' అన్నాడు పి. జె.

''ఉయ్ ఆర్ ఓకె స్టడీ నా'' అన్నాడు వాలి. సీటులో కూర్చున్న ధర్మవైపు తిరిగి కాషన్ యిచ్చాడు.

సబ్‌మిరైన్ వేగం హెచ్చింది.

యుగంధర్ అందర్ని పిలిచాడు. ''డియర్ ఫ్రెండ్స్. యిది ప్రపంచానికి ఎంత ఆపదో, మనకి అంతే ఆపద. యీ

సమయంలో మన ప్రాణాల్ని కూడా లెక్క చేయకూడదు.''

పి. జె. నవ్వాడు. ''అలాగే ఈ కార్యక్రమంలో అందరు ప్రాణాలకి తెగించాలి. మనం చచ్చినా, ప్రపంచానికి కలుగబోయే ప్రమాదం తప్పాలి. ఇది ఆశయం.''

''యస్. యస్'' అన్నాడు నర్సన్.

మేగ్నటిక్ రిలే చూపినవైపు సబ్ మెరైన్ వేగంగా దూసుకుపోతుంది. అంచలంచలుగా నీరు విడిపోతుంది. పి. జె. లోపలకు నడిచి స్టెచ్ గన్స్ స్టడీలో వుంచాడు. ధర్మను పిలిచి కొన్ని కాషన్స్ యిచ్చాడు.

మేగ్నటిక్ రిలేలో శబ్దం అధికమయింది.

దూరంగా వరుసగా వున్న చెట్లు చూచి ''అది బౌండరీ'' అనుకుంటూను అన్నాడు యుగంధర్. వరుసగా ఐదునుండి ఇరవై అడుగుల ఎత్తులోవున్న చెట్లు. దేని, గబ్బర్ నిశితంగా చూస్తున్నారు. అయితే ఆ చెట్లలో బాంబులు వున్నాయని ఏ ఒక్కరికి తెలీదు. అందుకే సబ్ మెరైన్ దూసుకుపోతునే వుంది.

చంద్రమోహన్, ''కంట్రోల్ స్టేషన్ కు మెసేజ్ పంపితే బావుంటుంది'' అన్నాడు.

''మనం తిరిగి వెళ్ళమని భయమా?'' నవ్వాడు నర్సన్.

''కాదు. అత్యవసరంగా మనకు తోడుగా హెలికాప్టర్స్ రావచ్చునని, అందుకని.''

''అయితే సబ్ మెరైన్ పైకి వెళ్ళాలి'' అన్నాడు నర్సన్.

''అలా వెళ్ళితే ఆగంతుకులు పైలెట్స్ గా తిరుగుతూ వుంటే కోలాహలం జరగవచ్చు'' అంది మాలిని.

పి. జె. వాలెట్ లోనుండి సిగరెట్ తీసి వెలిగిస్తూ బయటకు చూశాడు. ''టచ్ అప్'' అరిచాడు కంగారుగా.

వాలి మెదడు మెరుపులా పని చేసింది. సేఫ్టిన్ లెఫ్టకు డౌన్ చేసి, స్టీరింగ్ త్రిప్పాడు. సబ్ మెరైన్ గ.భాలున మలుపు తిరిగి వెనుకకు మళ్ళింది. "వాట్ పి.జె" అడిగాడు వాలి.

"ఆ చెట్లలో చూడండి," అన్నాడు.

చెట్లలో నల్లగా గ్యాస్ బూరలా పైకి తేలుతూ వుంది. వాటినుండి క్రిందకు ఒక తీగె కట్టి వుంది.

"అది అండర్ వాటర్ బాంబ్ అయివుండాలి!" అన్నాడు నర్సన్. యుగంధర్ బైనాక్యులర్స్ తో చూశాడు.

"ఒక్క క్షణం ఆలస్యమయితే ఈపాటికి మనం మిగిలే వాళ్ళం కాదు" అన్నాడు చంద్రమోహన్.

"ఇప్పుడేమిటి చేయటం ఎలా దాటటం."

"ఆ చెట్లకు పైగా పోవచ్చు. అభ్యంతరం లేదు," అన్నాడు పి. జె.

సబ్ మెరైన్ బయలుదేరి చెట్లపైగా వెళ్ళి బౌండరీ దాటింది. సబ్ మెరైన్ మళ్ళీ వేగం హెచ్చింది.

ఆక్సిజన్ అయిపోయింది" అంటూ నర్సన్ ఆత్రుతగా వెళ్ళి ఆక్సిజన్ సిలిండర్ ఆన్ చేశాడు.

పి. జె. సిగరెట్టు ధర్మకు అందించాడు. ధర్మకు సిగరెట్ అందించాడంటే ఏదో ప్రమాదం రాబోతుందని సూచన. ధర్మ ఎలార్ట్ గా వున్నట్లు, అర్థం చేసుకున్నట్లు, రివర్స్ లో అగ్గిపుల్ల వెలిగించాడు.

ఏదో గాస్ సబ్ మెరైన్ అంతా నిండిపోతుంది. అప్పటికి నర్సన్ మూడుసార్లు టైము చూశాడు. "మిస్టర్ పి. జె. చెక్ ది ఆక్సిజన్" అన్నాడు వాలి సబ్ మెరైన్ ఆపు చేస్తూ. పి.జె. లోపలకు వెళుతూ గబాలున తూలిపడి పోయాడు.

అప్పటికే సబ్ మెరైన్‌లో అంతా పడిపోయారు.

సబ్ మెరైన్ ఆగిపోయింది.

ఒక కొండగుహాలోనుండి కొందరు ఆగంతకులు పరుగెత్తుకు వచ్చి సబ్ మెరైన్ చుట్టుముట్టారు. హాహాకారాలు చేస్తూ, అందరు సబ్ మెరైన్‌లో వున్న ఒక్కొక్కరిని లోపలకు తీసుకెళ్ళిపోయారు. ఎవరూ స్పృహాలో లేరు.

# 18

ఒక్కొక్కరిని నిశితంగా చూసిన విశ్వామిత్ర "పి. జె. ఎక్కడ?" దాదాపు అరచినట్లుగా అడిగాడు. నర్సన్ విస్తుపోయాడు. "మిస్టర్ నర్సన్! చాలా శ్రమతో మాకు యీ పథకానికి సహాకరించినందుకు ధన్యవాదాలు."

నర్సన్ నవ్వాడు. ధర్మ కళ్ళలో నెత్తురు చారలు కట్టింది. యుగంధర్ పెదవులు బిగించాడు. వాలి పళ్ళు కొరికాడు. డేని గుప్పిడిపట్టాడు. గబ్బర్ ముఖం కందగడ్డలా అయింది.

"అయితే పి. జె. తప్పించుకోవటం ఆశ్చర్యంగా వుంది."

"మీరు యిచ్చిన గాస్‌తో అందరూ స్పృహాకోల్పోయారు."

"పి. జె. కోల్పోయాడని అనుకున్నావ్ కాని పి. జె. మాస్టర్ ఆఫ్ ఆల్ టైమ్. ఎక్కడ? ఎప్పుడు? ఎలా వుండాలో పి. జెకి తెలుసు. పి. జె. ఎక్కడో వుండి వుండడు. ఈ కొండ పరిసరాలలోనే వుంటాడు. నెంబర్ సెవెన్" పిలిచాడు.

"యస్ కమేండర్."

"మనదగ్గర వున్న ఆక్టోపస్‌లను వదిలివేయి."

"ఆక్టోపస్‌లు మీ దగ్గర వున్నాయా!" నర్సన్ ఆశ్చ

ర్యంగా అడిగాడు.

"యస్ నర్సన్. రెండు ఆక్టోపస్‌లను బంధించాం. ఆక్టోపస్ సముద్రగర్భంలో భయంకరమయిన జంతువు. తల పది అడుగులు వ్యాసంతో. ఎందరో మనుషులు యీ ఆక్టోపస్‌కు ఆహుతి అయ్యారు. ఇది మనిషిని తొండంతో చుట్టి రక్తం పీలుస్తుంది. తన తొండంనుండి వూరే సెలివరీ గ్రంథులనుండి వచ్చే విషద్రవంవల్ల మనిషి శక్తివిహీను డవుతాడు. నెంబర్ 7 డు యువర్ డ్యూటీ."

"యస్. కమేండర్."

"నెంబర్ టెన్. నీవు వీళ్ళందరిని ఎలక్ట్రిక్ రూంలో వుంచు. మిస్టర్ ధర్మ మీరు కేవలం కూర్చునేటందుకు ఆరు అడుగుల పొడవు, నాలుగు అడుగుల వెడల్పు చెక్క వుంటుంది. చుట్టూ ఇనుపతీగతో అల్లిన బోను అది. కాలు క్రింద పెడితే కరెంట్ షాక్ తగిలి మనిషి నల్లగా అయిపో తాడు. గుర్తు తెలియని వికృతరూపం వస్తుంది. మిమ్మల్ని చంపి పారేయగలము. కాని యిప్పుడు మా కార్యక్రమం ఒకటి వుంది."

"మిస్టర్ దీర్ఘనాథ్! మనం తయారుచేసిన పాయిజన్ సీసాలలో ఎక్కించి వేయండి! క్విక్!"

"యస్ కమేండర్."

"ఇంకా యాభైనిమిషాలలో మన కార్యక్రమం అమలు జరగాలి," అంటూ ముందుకు నడిచాడు.

# 19

నర్సన్ ఆక్సిజన్ మార్చటంతో ఓ రకమయిన వాసన ప్రారంభమయింది. పి. జె. గ్రహించి, ధర్మకు తెలియ చేశాడు. ఇద్దరు శ్వాస ఆపివేశారు. నర్సన్ కూడా అందరిలా స్పృహ కోల్పోవటంతో తను స్కూబ్

ధరించాడు. స్టెచ్ గన్ పట్టుకొని, సబ్ మిరైన్ అడుగు భాగంలో డెక్ క్రింద దాక్కున్నాడు.

అందరిని బంధించి లోపలకు తీసుకువెళ్ళారు.

పి. జె. అది కొండ అని, అందులో చాలా పెద్ద గుహ వుండివుంటుందని, వాగ్ 15 ద్వారా నీళ్ళను దూరంచేసి ప్రాజెక్ట్ కట్టారని వూహించాడు. ఆ కొండచుట్టూ ఒక సారి స్విమ్ చేసాడు.

కొండరాయి మలుపు తిరుగుతూ వుండగా ఆక్టోపస్ శబ్దం వినిపించింది. వెంటనే తన తొండాన్ని చాచింది. పి. జె. కొండపైనున్న ఒక్కొక్క రాయి చాటుగా దాక్కుంటున్నాడు. ఆక్టోపస్ భయంకరమయిన సాలి పురుగులా వస్తుంది. పి. జె. గబగబ స్విమింగ్ చేస్తూ రాయి దాటాడు. కాని అప్పటికే బలమయిన తొండం పి. జెను చుట్టుకుంది.

ఆక్టోపస్ మరో తొండం మెడచుట్టింది. మిగిలిన ఆరు కాళ్ళు నీళ్ళపై ఆడుతున్నాయి. దాని తొండాలకు వున్న సెలివరీ ద్రవం పి. జె. స్క్యూబ్ మీదగా జారుతుంది. పి. జె. స్టిచ్ గన్ శ్రమతో స్టడీలోవుంచి ఆక్టోపస్ నోట్లో వదిలాడు. వికృతంగా అరచిన ఆక్టోపస్ తొండం వదిలింది.

పి. జె. గబగబ రెండవవైపుకు వెళ్ళాడు. ఆ గుహాలో మూడువైపుల డోర్స్ వున్నాయి. ఒక డోర్ తెరిచాడు. ఇంకో ఐదు అడుగులదూరంలో మరొక డోర్ వుంది. అండర్ వాటర్‌లో డబుల్ డోర్స్ అవసరం. రెండు డోర్స్ మధ్యచేరిన నీరు బయటకు పంపింగ్ అవుతాయి. రెండు డోర్స్ ఒక్కసారే తెరిస్తే నీరు ధాటిగా లోపలకు పోతుంది. రెండు డోర్స్ మధ్య ఆగి స్టిచ్ గన్ స్టడీలో వుంచాడు.

సెంట్రీ ఒకడు లోపల డోర్ తెరిచాడు. లోపల అడుగుపెట్టటంతో పి. జె. స్టిచ్‌గన్‌తో సెంట్రీ తలపై కొట్టాడు. గబగబ ఆ యూనిఫాం తను ధరించాడు. లోపల ప్రాజెక్ట్‌లో ప్రవేశించాడు.

ఆ మిషనరీ చూసిన పి. జె. విస్తుపోయాడు.

వరుసగా ఆరు రాకెట్లు వున్నాయి. ఒక్కొక్క రాకెట్ ఆరు అడుగుల పొడవు మాత్రం వుంది. గోల్డ్ కలర్‌లో తళతళ మెరిసిపోతున్నాయి. మరొకప్రక్క జనరేటర్, కంప్యూటర్స్ వున్నాయి. ఇంకోవైపు టెలిస్కోపు, డాష్‌బోర్డ్ వున్నాయి. కొంతమంది ఆపరేట్ చేస్తున్నారు. పదిమంది మిషన్‌గన్స్‌తో అక్కడ కాపలా కాస్తున్నారు.

అంతలో ప్రొఫెసర్ విశ్వామిత్ర మైక్‌లో అంటున్నాడు. "డియర్ ఫ్రెండ్స్ యింకా అరవై నిమిషాలలో ప్రపంచ ప్రమాదం జరుగుతుంది. ఇప్పుడు దీర్ఘనాథ్ ఆరు సీసాలు ఆరు రాకెట్ల పైభాగంలో పెడతారు. ఈ ఆరు రాకెట్లు, పైభాగంలోవున్న అద్దపు చట్రాన్ని పగలకొట్టి ఆకాశంలోనికి దూసుకుపోతాయి. ఆరు మహాసముద్రాల్లో పడిపోయిన వెంటనే ఒక చుక్క మందు వంద కిలో మీటర్ల నీటిను విషంగా మారుస్తుంది.

ఆ నీరు మేఘాలుగా మారుతుంది. అప్పుడు సరైన టెంపరేచర్ ఈ పాయిజన్స్‌కు వస్తుంది. ఆ మేఘాలు వర్షాలుగా కురిసినపుడు ప్రపంచంలో ప్రతి నీటి చుక్క విషంగా మారుతుంది. అదే ప్రపంచ ప్రమాదం. ఈ రాకెట్లు వదిలేటందుకుగాను సాగరగర్భంలో ఈ ప్రాజెక్టు నిర్మించాం."

"హియర్...హియర్" చప్పట్లు మారుమ్రోగాయి.

ధర్మ సిగరెట్ వెలిగించి ఆలోచిస్తున్నాడు. పి. జె. ఏమయ్యాడో తెలియటంలేదు. చుట్టూ పది అడుగుల దూరంలో యినుపచట్రం వుంది. ఒకవైపు డోర్ వుంది.

డోర్ తెరుచుకుంది. కర్రతో వున్న ట్రాలినుండి కాఫీ, టిఫిన్ వచ్చింది. ఎక్కడో స్విచ్ నొక్కి వుండాలి, అనుకున్నాడు ధర్మ. కంప్యూటర్ మిషన్‌లా వచ్చేసింది.

"తొంభై... ఎనభైతొమ్మిది... ఎనభై ఎనిమిది" రీడింగ్ వినిపిస్తుంది. రాకెట్ వదిలేటందుకు ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్నారు అనుకున్నాడు ధర్మ.

ధర్మ గభాలున ట్రాలిపై ఎక్కాడు. ట్రాలి బోనును దాటటం, ఓ ధృఢకాయుడు రివాల్వర్‌తో ఎదురుగా నిలబడటం ఒకేసారి జరిగాయి. ధర్మ ఎటు కదలినా ఎలక్ట్రిక్ ఫెన్స్ తగులుతుంది.

"మిస్టర్ ధర్మ. మేము జాలిపడి టిఫిన్ యిస్తే పారి పోరిపోతావా? ఐ కిల్ యు బాస్టర్డ్" అంటూ రివాల్వర్ పేల్చబోయాడు.

అదేసమయంలో యుగంధర్ తను టిఫిన్ చేస్తున్న పింగాణి ప్లేట్ విసిరాడు. అది ధృఢకాయుడు చేతికి తగిలి రివాల్వర్ క్రిందపడింది.

వాడు కళ్ళు ఎర్రచేసి ధర్మనుచూసి రెండు చేతులతో మెడచుట్టాడు. ధర్మ చేతులు క్రిందకు లాగుతూ నడుం దగ్గర రెండువేపుల కొట్టి ఒక చెయిపట్టుకొని జూడో ఫైట్ చేసినట్లు దొర్లించాడు. ధృఢకాయుడు ఎగిరి ఎలక్ట్రిక్ ఫెన్స్‌పై పడ్డాడు. క్షణంలో హాహాకారాలతో నల్లగా మారిపోయాడు. కరెంట్ ఫ్యూజులు పోయాయి.

యుగంధర్, వాలి ఒకవైపు దేని, గబ్బర్ మరొక వైపు తప్పుకున్నారు. ధర్మ ఒక్కొక్క చోటు దాటుకుంటూ ఎదురయిన మనిషిని శబ్దంరాకుండా చంపేస్తున్నాడు.

క్షణంలో కోలాహలం అయింది. మిషన్‌గన్స్ స్టెన్‌గన్స్‌తో ఫైరింగులు ప్రారంభమయ్యాయి. హాతులదగ్గర తీసుకున్న గన్స్ అందరికి సప్లయిచేశాడు ధర్మ.

విశ్వామిత్ర కంగారయాడు. "ఫైర్" అరిచాడు.

పి. జె. గబాలున అడ్డువచ్చి "విశ్వామిత్ర! దిస్ ఈజ్ ఫైనల్."

"నీ వెనుక చూడు మిస్టర్ పి. జె" వికృతంగా నవ్వాడు విశ్వామిత్ర.

"అవసరంలేదు. నీ గాంగ్ చాలామంది నాకు గన్స్ పెట్టారు. అయినా ఫరవాలేదు. ప్రపంచ శ్రేయసుకొరకు ప్రాణాలు యిస్తాను. కాని నీ ప్రాణం తీస్తాను."

"యూ బాస్టర్డ్" అరిచాడు విశ్వామిత్ర.

పి. జె. నవ్వాడు. "నీ వెనకాల చూడు" అన్నాడు. ప్రక్కనే యుగంధర్, వాలి, వెనుక ధర్మ నిలబడి వున్నారు. "నా ధర్మ చాలు మీ అందర్నీ చంపటానికి." అన్నాడు.

విశ్వామిత్ర కళ్ళతో సైగచేశాడు. వెనుక మిషన్‌గన్స్ పేలాయి. అప్పటికే పి. జె. క్రిందకువంగి ప్రక్కనేవున్న కంప్యూటర్ చాటుకు వెళ్ళిపోయాడు.

అప్పుడే ధర్మ కాల్చబోయాడు. దీర్ఘనాథ్ రివాల్వర్ పేలటంతో అది ధర్మను దూసుకుపోయి, ధర్మ ఒరిగి పోయాడు. పి. జెకి మతిపోయినట్లయింది. కాని క్షణంలో

వాలి స్టెచ్‌గన్ దీర్ఘనాథ్ గుండెల్లో దూసుకుపోయింది. యుగంధర్, ధర్మను ఎత్తాడు. చేతిలోనుండి రక్తం కారుతుంది.

పారిపోయిన విశ్వామిత్ర వాగ్ 15 దగ్గరకు పరుగెత్తాడు. ఒకప్రక్క డేని, మరొకప్రక్క గబ్బర్ రివాల్వర్ చూపి, విశ్వామిత్రను బంధించారు. ముఠా అంతా చాలామంది చనిపోయారు. మిగిలినవాళ్ళు సరెండర్ అయిపోయారు.

—: ఐపోయింది :—




(26 వ భాగము)

ఆమెను వెంటబెట్టుకొని పక్షులగుంపు మధ్యకు వెళ్ళాను.

బాగా బలంగా ఒకదాని మెడ పట్టుకున్నాను. గుర్రం ఎక్కినట్లుగా ఎక్కి కూర్చున్నాను. బరువుపైన పడగానే రెక్కలను విప్పి అటు ఇటు విసుర్తూ కాసేపు కొట్టుకుందా పక్షి.

నర్స్ ప్రక్కనే నిలబడి వుంది. ఆమెకేసి చూశాను.

"నీ వెనక ఎక్కేదా?" అంది.

"ఎక్కు" అన్నాను.

ఆమెకూడా ఎక్కి నా వెనుక కూర్చుంది. మా ఇద్దరి బరువుకు తట్టుకోలేక ఆ పక్షి ఠక్కున క్రిందకు పడింది. దాని పొట్ట భూమి కానుకుంది. ముందది భయపడిందేమో ననుకుని, నర్స్ క్రిందకు దిగబోయినా వారించాను వద్దని. ఐదునిముషాలపాటు అలాగే కూర్చున్నాను. కానీ అది

మామూలుగా లేచి నిలబడే ప్రయత్నమేమీ చెయ్యలేదు. దాంతో అది మోయలేని బరువువల్లే అలా కుప్పలా కూలి పోయి కూర్చుందని తీర్మానించుకున్నాను.

వెనక్కి తిరిగిచూసి "నువ్వు దిగు!" అన్నాను.

నర్స్ పక్షిపైనుండి దిగింది క్రిందకు.

ఆమె బరువు తగ్గగానే పక్షి యధాప్రకారం లేచి నిలుచుంది. రెక్కల్ని ఆడించింది.

"నువ్వింకో దానిపైకి ఎక్కు!" అన్నాను.

"ఒంటరిగానా?" అడిగింది భయంగా.

"ఆఁ!"

"అమ్మో! నాకు భయం!!" అంది.

"ఇద్దర్ని మోసే శక్తి లేదు వీటికి. అన్నీ గుంపులుగానే వెళ్తాయి. నీకేం భయం వుండదు. నేనుకూడా వెంట వుంటాగా. ఎక్కి కూర్చో! వెళ్ళు!" అంటూ ధైర్యం నూరిపోశాను.

అయిష్టంగానే అక్కడ్నుంచి కదిలింది. మరో పక్షి పైన ఎక్కి కూర్చుంది.

అవి ఇంకా ఏవేవో ఏరుకొని తింటూ వుండిపోయాయి. అక్కడ్నుంచి కదిలివెళ్ళే సూచనలు కనుపించలేదు. అలా ఎంతసేపు వుంటాయో ఊహించడం అసాధ్యమయింది నాకు.

ఆ బయలు ప్రదేశంలో చెల్లాచెదురుగా వెళ్ళి ఆహారం సేకరించుకొంటున్న పక్షులన్నీ మెల్లగా ఒక ప్రదేశం వద్దకు చేరుకొన్నాయి గుంపుగా. అప్పటికి బాగా పొద్దు వాలిపోయింది. గాలి కూడా బాగా చల్లగా వుంది.

పక్షులన్నీ విమానాల్లా లేచాయి ఆకాశంలోకి. ఆ తర్వాత స్పీడందుకొన్నాయి. వాటివేగం జెట్ విమా

నాలను మించిపోయినట్లనిపించింది. దాని మెడ పట్టుకొని కూర్చున్నా నేగానీ, నాకు భయంగా వుంది. మాటిమాటికీ మెడను అటూ యిటూ త్రిప్పుతుందా పక్షి. వెనకగా వున్న నర్స్ కేసి చూశాను. ఆమెకూడా చాలా ఇబ్బందిగా, భయంగా కూర్చునుంది.

ఇంకొంతదూరం ముందుకు పోయాం.

క్రింద ఏం కనిపిస్తుందో చూద్దామని తల వంచాను. విశాలమైన నీటిపొర కనుపించింది. బహుశా నేను సముద్రంపైన ఉన్నాననుకొన్నాను. అది ఏ సముద్రమో ఊహాకూడా అందలేదు.

ఈ పక్షులగుంపు ఏ దీవిలో మకాం పెట్టాయో, అక్కడెటువంటి మనుష్యులుంటారో, వాళ్ళతో ఏం ప్రమాదాలు ముంచుకొస్తాయోనని ఊహించుకుంటూ, నేనెక్కిన పక్షి మెడ తేలిగ్గా పట్టుకొన్నాను.

వెనకనుంచి "హెల్ప్, హెల్ప్" అంటూ నర్స్ కేకలు వినిపించాయి. ఆకాశంలో మేఘాలు ఢీకొన్నప్పుడు వినిపించే ఉరుముల్లాగున్నాయి ఆ కేకలు. వెనక్కి తిరిగి చూశాను. ఆమె పక్షి మెడను కరుచుకుని వుంది బల్లిలా. అదేమో గాలిలో పల్టీలు కొడుతున్నట్లు తిరిగిపోతుంది. అయినా దాన్ని పట్టించుకోలేదు మిగిలిన గుంపు. దాని వేగం తగ్గింది. మిగిలిన గుంపు ముందుకు సాగిపోతూనే వుంది.

నేను వెనక్కి తిరిగి చూశాను.

నర్స్ ఎక్కిన పక్షి అలానే పల్టీలుకొడుతూ క్రిందకు జారిపోయింది. ఆకాశంలోంచి నేలపైకి తోకతెగిన చుక్కలా నేలపైకి రాలిపోయింది. ఆ పక్షితోపాటు నర్స్ అంతర్థానమైపోయింది అరక్షణంలో.

ఆమె చేసిన పాపానికి ఫలితం, మరుజన్మలో కాకుండా, ఈ జన్మలోనే, నా కళ్ళముందు పొందడం ఒకవంక ఆనందాన్ని మరోవంక విచారాన్ని కలిగించింది నాకు. ఆమె ఆత్మకు శాంతి చేకూర్చమని భగవంతుణ్ణి మనసారా ప్రార్థించాను.

నేను ఎక్కిన పక్షి రివ్వున మేఘాలపైనుంచి దూసుకు పోతూంది. నా చుట్టూవున్న గుంపంతా కూడా అదే వేగంతో పరుగెత్తుతున్నాయి గాలిలో. అలా చాలాసేపు ఆకాశంలోనే వున్నాను.

ఆ తర్వాత మెల్లగా ఎత్తునుంచి క్రిందికి దిగటం మొదలెట్టాయి. నేను కాళ్ళు రెండు పెనవేసి కూర్చున్నాను. గొంతును మరికొంత ఘట్టిగా చేతుల్తో పట్టుకున్నాను. పది నిముషాల్లో విశాలమైన మైదానంలాంటి ప్రదేశంలోకి దిగింది గుంపంతా. పక్షులన్నీ నేలపైన కాళ్ళు ఆన్చాయి. నేను తక్కున క్రిందికి దూకాను. వాటి మధ్యనుండి దూరంగా వెళ్ళాను.

అది ఏ దీవో, భూగోళంలో ఏ భాగంలో వుందో, అర్థంకాలేదు నాకు. నా అంచనా ప్రకారం కొన్ని వందల మైళ్ళు వచ్చేసి వుండాలి. సూర్యుడు నాకు ఎడంచేతివేపు వున్నాడు చాలాసేపు. అంటే అంతకుముందున్న దీవినుండి దక్షిణంగా ప్రయాణంచేసి వుండాలి నేను.

ప్రపంచపటం నా కళ్ళముందు మెదలింది.

అంతకుముందున్న దీవిలో సైంటిస్టులు దాచుకొన్న మ్యాప్‌లను చూసి అందులో నేనున్న దీవిప్రాంతాన్ని గుర్తుపెట్టుకొని వున్నాను. దాన్నిబట్టి దక్షిణంగా వెళ్తే ఏ యే దేశాలు, దీవులు, వస్తాయో లెఖగట్టాను.

నా అంచనాలు వంచన చెయ్యకుంటే, బహుశా నేను

ఉత్తర అమెరికాకు క్రిందిభాగంలో వున్న ఏదో దీవి చేరుకుని వుండాలి. ఆ దీవి ఏదైందీ తెలిసే అవకాశం మాత్రం లేదు.

బాగా చీకటిపడింది.

చిన్న చెట్ల గుంపొకటి కనుపించింది. దాని మధ్యకు వెళ్ళాను. ఏదైనా చెట్టుక్రింద నేల శుభ్రంచేసుకొని పడుకుందామనుకున్నాను. కానీ అక్కడ క్రూరజంతువు లేమైనా వుండి నేను ఆదమరచి నిద్రించే సమయంలో వచ్చి అమాంతంగా మింగివేస్తే చెయ్యగలిగిందేమీ వుండ దని ఆ ప్రయత్నం మానుకున్నాను.

మెల్లగా లావుపాటి చెట్టొకటి చూసుకుని ఎక్కాను' రెండు కొమ్మలమధ్య ఇరుక్కుని కూర్చున్నట్లే పడు కున్నాను.

కాసేపు నిద్రపోతే అలసిపోయిన శరీరానికి కాస్త విశ్రాంతి దొరుకుతుంది. కానీ నిద్రరాలేదు. కారణం ప్రేమల్లో రగులుతున్న మంట. ముందది ఆరితేగాని కళ్ళు మూతపడేట్లు లేవు. ఆకలితీరే మార్గంకోసం అన్వేషించుదా మనిపించింది. కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి. ఏ చెట్టు ఏదో, ఏ కాయ తింటే ఎలాంటి ప్రమాదమో తెలియకుండా, ప్రయత్నించడం నా చావు నేనే తెచ్చు కొన్నట్లవుతుందనిపించింది.

ఆకలిని అలానే అణగద్రొక్కి, పడుకున్నాను.

గాలిమాత్రం చల్లగా వస్తూంది. నా శరీరాన్ని ఫ్రిజ డైర్‌లో పెట్టినట్టుంది. ఒళ్ళు బాగా చల్లబడగానే ఆకలి మంట కాస్త తగ్గినట్లయింది. కళ్ళు వాటంతటవే అర్ధరాత్రి తర్వాత మూతలుపడ్డాయి. నాకు తెలియకుండానే నిద్ర లోకి జారిపోయాను.

మళ్ళీ కళ్ళు తెరిచేసరికి తెల్లగా తెల్లవారిపోయింది. చెట్టు పైనుంచి దూకాను. ఆ మైదానంలాంటి ప్రదేశం మధ్యగావున్న నీళ్ళ సరస్సులో కాళ్ళూ చేతులూ, కడుక్కుని, మొహం తడుపుకుని, కడుపునిండేట్లు నీళ్ళు త్రాగి బయలుదేరాను.

చాలాదూరం నడిచాను. రెండుగంటలకు పైనే నడిచాను. అంటే సుమారు ఆరేడుమైళ్ళు నడచివుండాలనుకున్నాను. మధ్యలో ఎక్కడా, జనసంచారంగానీ, జంతువుల చలనంగానీ లేదు.

ఆకాశంకేసి చూశాను.

నా ముందు దూరంగా ఎత్తైన లావుపాటి పెద్ద గొట్టంలాంటిదేదో కనుపించింది. అదేదో ఫ్యాక్టరీకి సంబంధించిందయింది వుండాలనుకున్నాను.

మనస్సు తేలికపడింది.

కాళ్ళలోకి క్రొత్త శక్తి వచ్చినట్లయింది.

కళ్ళు తేజోవంతమయినట్లు తోచాయి.

ఆ గొట్టాన్ని చూసుకుంటూ వడివడిగా నడచాను.

అలా నడుస్తున్నప్పుడు కాళ్ళనొప్పిగాని, ఆకలి మంటగానీ, నాకు గుర్తురాలేదు. తొందరగా అక్కడికి చేరుకుంటే నన్ను బంధించిన పరిస్థితుల్నించి, ఖైదుచేసిన పరిసరాలనుంచి పర్మనెంటుగా తప్పుకునే అవకాశం కనుపిస్తుందన్న ఆశ కలిగింది.

డెల్లా గుర్తుకొచ్చింది. ఆమెకోసం నేను ఎంత శ్రమపడ్డా, ఫలితం లభించనందుకు మాత్రం బాధ కలిగింది.

నడక వేగం హెచ్చించాను.

ఎండ ఎక్కువ కావటంతో గాలి వేడెక్కింది. నా మొహానికి వేడిగాలి తగులుతూంది. అడవిలాంటి ప్రదేశం

దాటగానే అట్టపెట్టెలాంటి అందమైన ఇళ్ళు చిన్నచిన్నవి కనుపించాయి,

ఇంకా వేగంగా నడిచాను.

ఆ ఇళ్ళ మధ్యకు వెళ్ళాను.

అక్కడ చాలా మంది మనుష్యులు కనుపించారు అంతా ఆడవాళ్ళు, పిల్లలు, మగవాళ్ళంతా పనుల్లోకి వెళ్ళినట్లున్నారు.

ఒకావిడను మాటల్లోకి దించి వివరాలు సేకరించాను. అది ఉత్తర అమెరికాకు క్రింద వున్న దీవి. ఆ దీవిలో బంగారు దొరుకుతుంది. అమెరికా ప్రభుత్వపు గనులు ఆ ప్రాంతమంతా వున్నాయి. అక్కడ అన్నిదేశాల వాళ్ళూ పని చేస్తున్నట్లు ఆవిడ చెప్పింది.

ఆవిడ అమెరికన్ స్త్రీ. నన్ను చూడగానే ఇండియన్ వా అని అడిగింది. అవునన్నాను. అక్కడ్నుంచి మైలు దూరం వెళ్తే ఇండియన్స్ కాలనీ వుందని చెప్పింది.

ఆమెకు కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరించాను. మరి కొంతదూరం వెళ్ళాను నా దేశపు వాళ్ళుంటున్న కాలనీకి వెళ్దామని.

ఎదురొచ్చిన మనుషులు చాలామంది నన్ను గమనించడాన్ని పసిగట్టాను. బహుశా నా బట్టల్ని చూచి అనుకున్నాను. నా వొంటిపై నున్నవి బట్టలు కాదు పేలికలు. ఫక్తు బిచ్చగాడిలా వున్నానని నాకు తెలుసు. ఆ దీవిలో బహుశా బిచ్చగాళ్ళు వుండి వుండరు. అందువల్లే అంత ఆశ్చర్యంగా నాకేసి గమనించి చూస్తున్నారనుకున్నాను.

తిన్నగా ఇండియన్స్ కాలనీకి వెళ్ళాను. మొత్తం నాలుగొందల ఇళ్ళు వుంటాయి. మనుషులు నా దేశం వాళ్ళే అయినా వాళ్ళు అమెరికన్లలాగే వున్నారు.

ఒక ఇంటి ముందు నిలబడ్డాను. ఆ ఇంటావిడ వచ్చి నిలుచుంది గుమ్మంలో. నేను అర్థంకాక కాసేపు చిత్రంగా చూశాను.

"ఎవరు కావాలి?" అడిగింది ఇంగ్లీషులో.

"ఆకలవుతుంది. కాస్త అన్నం కావాలి!" అన్నాను ఇంగ్లీషులో.

"నీది ఇండియానా!"

"అవును." అన్నాను.

"ఇక్కడికి కెలా వచ్చావ్?"

"అదో పెద్ద కథ! తర్వాత చెపుతాను!" అన్నాను.

ఆమె లోనికి వెళ్ళి ఒక పెద్ద బ్రెడ్, ఒక సాస్ సీసా తెచ్చి అందిచ్చింది. వీధిలో నిలుచుని తిన్నాను రెండు నిముషాల్లో.

"చాలా! మరో బ్రెడ్ ఇచ్చేదా?" అడిగింది.

"చాలు! చాలా థ్యాంక్స్." అన్నాను.

"ముందు వెళ్ళి సెక్యూరిటీ వాళ్ళకు రిపోర్టు చెయ్యి. లేకుంటే నానా గొడవ అవుతుంది!" అందామె.

"గొడవా? ఎందుకు?" అర్థంగాక అడిగాను.

"సెక్యూరిటీ వాళ్ళకు తెలీకుండా, ఎవ్వరూ ఈ దీవికి రాకూడదు! అలా వచ్చే వీలుకూడా లేదు. ఇక్కడకి వచ్చేవీ, పోయేవీ, ప్రభుత్వపు విమానాలే! ఎవరైనా దొంగ చాటుగా వచ్చి తిరుగుతున్నట్లు తెలిస్తే సెక్యూరిటీవాళ్ళు కనిపెట్టారంటే కాల్చి చంపుతారు." అందామె.

"నే వెళ్ళి రిపోర్టు చేస్తే చంపరా?" అడిగానామెను.

"బహుశా చంపరనుకుంటాను. నువ్వేలా వచ్చిందీ అడుగుతారు. చెప్పిన సమాధానాలు తృప్తికరంగా వుంటే

క్షమించి వదులుతారు. లేకుంటే..." అంటూ ఆగిపోయింది.

"లేకుంటే చంపేస్తారు! అవునా?" అడిగాను.

"అవును!" అందామె.

"నా సమాధానాలు వాళ్ళకు తృప్తిపరుస్తాయన్న నమ్మకంలేదు నాకు. వాళ్ళ ప్రమేయం లేకుండా నాకు మీలో ఎవ్వరూ ఆశ్రమం ఇవ్వలేరా! నాగ్రోజుండి వెళ్ళి పోతాను ఏదో మార్గం చూసుకుని" అన్నాను.

"లాభంలేదు!" అందామె.

ఇంక ఆవిడను బలవంతం చేసిగూడా లాభం వుండదని అర్థం చేసుకున్నాను. నా ఆకలి తీర్చినందుకు మరోమారు థాంక్స్ చెప్పి, సెక్యూరిటీవాళ్ళు ఎక్కడుందేదీ అడిగి తెలుసుకుని అక్కడ్నుంచి కదిలాను.

ఇండియన్స్ వుండే కాలనీకి, సెక్యూరిటీ డిపార్టుమెంటు వాళ్ళ ఆఫీసుకు దాదాపు రెండుమైళ్ళ దూరముంది.

వెళ్ళగానే నన్ను ముందు బంధించారు. చేతులకు అరదండాలు తగిలించి ఒక ఆఫీసరు దగ్గరకు తీసుకెళ్ళారు.

ఆయన రకరకాల ప్రశ్నలకు ఓర్పుగా సమాధానం చెప్పాను.

నా అనుభవాలు, అగచాట్లు, సాహసాలు, విని విస్తు పోయాడు. పెద్ద పక్షి నెక్కి ఈ దీవికి వచ్చానని చెప్పి నప్పుడు మాత్రం ఆయన ఆశ్చర్యానికి అంతూ పొంతూ లేకుండా పోయింది.

"నీలాగే మరో స్త్రీ చెప్పింది" అన్నాడు.

"స్త్రీయా! ఆమెపేరు చెప్పిందా?" అడిగాను ఆత్రతగా ఆమె డెల్లా తప్ప మరో మనిషి కావటానికి వీల్లేదనుకుంటూ.

"పక్షి నెక్కి రావటం తప్ప మరేదీ గుర్తులేదంది. ఆమెను బంధించివుంచాం. నువ్వు గుర్తుపట్టగలవేమో

చూస్తావా?'' అడిగాడు అతను.

''చూస్తాను!'' అన్నాను.

ఇద్దరి గార్డ్సుకు నన్నప్పగించారు. వాళ్ళ వెంట వెళ్ళాను. వెనుక వేపునున్న గదుల్లో ఒకదాని తలుపులు తీశారు. లోపల నేలపైన వెల్లికింతలా పడుకునివున్న ఆమె కేసి చూసాను. నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను. చచ్చిపోయిందనుకున్నా. నా డెల్లా సజీవంగా వుంది ముందు.

''డెల్లా!'' అరచాను పెద్దగా.

అంత పెద్దగా అరచినా ఆమెకు వినిపించనట్లు, కనీసం తలైనా త్రిప్పకుండా పడుకుండిపోయింది. దగ్గరగా వెళ్ళి కూర్చొని ఆమెను నావేపుకు త్రిప్పుకున్నాను. నా వంక చూసింది. ఆ చూపులు తీక్షణంగా వున్నాయి.

''నేను డెల్లా! నీ రాజ్ ను! గుర్తుపట్టలేదూ!'' అడిగాను ఆతృతగా.

పిచ్చిదానిలా చూసింది తప్ప, మాట్లాడలేదు.

''మాట్లాడవెందుకు? నీకోసం వెతకని స్థలంలేదు. నిన్నీ స్థితికి తెచ్చిన ఆ నర్స్... కాదు – రాక్షసి ఘోరమైన చావు చచ్చింది. రా!'' అన్నాను.

ఆమె కదలలేదు!

డెల్లా మతి చెడిపోయిందని ధృవపరచుకున్నాను. ఎంత పోరాడినా ఆమె నన్ను గుర్తించలేకపోయింది. గార్డ్సు నన్ను తిరిగి వాళ్ళ ఆఫీసరుముందుకు తీసుకొచ్చారు. ఆమె వివరాలు చెప్పాను. అంతా విని కాగితంపైన నోట్ చేసుకున్నాడు.

గార్డ్స్ నన్నుగూడా తీసుకెళ్ళి బంధించారు. డెల్లా ప్రక్కగదే నాది!

ఆలోచిస్తూ కూర్చున్నాను.

వీళ్ళు మమ్మల్ని ఏంచేస్తారో అర్థంగాలేదు. వాళ్ళ అనుమతి లేకుండా వచ్చినందుకు ఉరితీస్తారా?

డెల్లా కనుపించినందుకు ఆనందం కలిగినా, ఇద్దరం మళ్ళా ఖైదీలుగా మారడం, ఆవేదన కలిగించి, అశాంతి రేపింది. ఏదైనా మార్గం వెతుక్కొని తప్పించుకుందామను కున్నాను. గదంతా కలయజూచాను. వెంటిలేటరులాంటిది కూడా లేదు. ద్వారబంధం, కిటికీ వెంటిలేటరు, మొత్తం ముందున్న కమ్ముల తలుపే!

ఒకవేళ వీళ్ళ బారినుండి తప్పించుకున్నా, ఈ దీవినుండి బైటపడేందుకు మార్గం మాత్రం ఏమిటి? విమానాల్లో వెళ్ళే వీలులేదు. అవన్నీ ప్రభుత్వానివి.

మళ్ళీ ఆ పక్షుల గుంపును వెతుక్కుంటూ వెళ్ళాలి. అవి మళ్ళీ తీసుకొచ్చిన స్థలానికి తీసుకెళ్తాయి తప్ప, వేరే దేశానికో, దీవికో మమ్మల్ను చేరుస్తాయన్న నమ్మకం అణుమాత్రం కూడా లేదు.

ఆలోచిస్తూ పడుకున్నాను.

డెల్లా కిలాంటి మతిస్థిరం లేని స్థితి విషపుగాలులవల్ల వచ్చింది. ఆమెను మామూలు మనిషిని చేయించేందుకు దారి ఏదైనా వుందో, లేదో? అలాంటి దారేదీ లేకుంటే జీవితాంతం ఆమె అలానే వుండిపోవాల్సి వస్తుందేమోనన్న భయం పట్టుకుంది.

అంతలోనే మేమిద్దరం ప్రస్తుతం వున్న పరిస్థితి గుర్తొచ్చింది. ముందీ చెరనుంచి బైటపడ్డాక, ఆ తర్వాతగదా ఆ విషయం గురించి ఆలోచించవలసిందనుకున్నాను.

ఆ రాత్రి కమ్మటి భోజనం పంపారు. చాలా దినాల తర్వాత, ఆ మాటకొస్తే చాలా నెలల తర్వాత అంత కమ్మటి భోజనం తినటం ఇదే మొదటిసారి. సుష్ఠుగా భోజనం చేశాను.

ట్రే తీసుకెళ్ళేందుకొచ్చిన గార్డును "సిగరెట్లు దొరుకుతాయా?" అని అడిగాను.

"కావాలా?" అడిగాడతను.

"కావాలి!" అన్నాను.

"తెచ్చిస్తాను!" అంటూ ట్రే చేతికి తీసుకున్నాడు.

"మిస్టర్!" పిలిచానతన్ని.

ఏమిటన్నట్లు చూశాడు నాకేసి.

"ప్రక్కగదిలో వున్నామెకు భోజనం పెట్టావా?" అడిగాను.

"ఆఁ!" అంటూ తలూపాడు.

"తినిందా?"

"హాయిగా తినింది!"

"థాంక్స్!" అన్నాను.

అతను వెళ్ళిపోయాడు వెలుపలకు.

మతి ఎలావున్నా, ఆహారం తీసుకుంటున్నందుకు డెల్లా గురించి నాకు ఆనందం కలిగింది. ఆమెను ఎలాగైనా పెద్ద పెద్ద డాక్టర్లకు చూపించి ఆరోగ్యం బాగుచేయించాలనుకొన్నాను. ఎక్కడో ఒకచోట సెటిలయి పెళ్ళాడి, పిల్లపాపలతో సుఖంగా జీవించాలనిపించింది. ఇంకా ఈ సాహసాలకు, అర్థంలేని ప్రయాణాలకూ, ప్రయాసాలకు స్వస్తి చెప్పాలనిపించింది.

ఆ రాత్రి హాయిగా నిద్రపోయాను.

తెల్లవారాక గార్డ్స్ వచ్చారు. కాలకృత్యాలు తీర్చుకొన్నాను. తొమ్మిదిగంటల ప్రాంతంలో బ్రేక్ ఫాస్ట్ పంపారు. తిని, సిగరెట్ దమ్ములాగాను. పదింటికి నన్ను రమ్మని ఆఫీసరు కబురుపంపాడు.

వెళ్ళి నిలబడ్డాను అతనిముందు.

## సప్లిమెంట్ పోటీ - 22.

U, V, W, X, Y — అక్షరాలను తీసుకొని మీకు నచ్చిన వరుసక్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 75 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|

మా ఆఫీసులో సీలుచేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు సెప్టెంబరు '76 నెల మాసపత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులుపంపాలి.
మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ క త్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి ఇవ్వబడుతుంది. *

కూర్చోమని సంజ్ఞ చేశాడు.

అతనిముందు కూర్చున్నాను.

"నువ్వు చెప్పిన వివరాల ప్రకారం చెక్ చేశాం. అంతా నిజమని తేలింది!" అన్నాడు.

నేనేం మాట్లాడలేదు.

"మీ దేశపు ప్రభుత్వం నీమీద మూడు నేరాలు మోపింది. వాటిన్ని నీ పరోక్షంలో విచారించింది. స్మగ్లింగ్ వ్యాపారంలో చెయ్యి వేసినందుకు పదేళ్ళు, కోస్టల్ గార్డ్సను చంపినందుకు పాతికేళ్ళు, ప్రభుత్వానికి చిక్కకుండా తప్పించుకొనిపోయినందుకు మరో పాతికేళ్ళు మొత్తం అరవై సంవత్సరాల కఠిన కారాగారశిక్ష విధించింది నీకు" అన్నాడా ఆఫీసరు.

నా మొహాన నెత్తురుచుక్క లేకుండా పోయింది.

"నీ ప్రియురాలు డెల్లాగురించి కూడా చెక్ చేశాం!" అన్నాడా ఆఫీసరు.

నేనేం మాట్లాడకుండా అతని మొఖంలోకి చూశాను.

"ఆమెను నువ్వు పెళ్ళాడినట్లు ఏవిధమైన ఋజువూ లేనందువల్ల, బ్రిటిషు ప్రభుత్వం ఆ దేశం ప్రకారం ఆమెను అక్కడికి పంపుతున్నాం. నిన్ను మీ ప్రభుత్వానికి అప్పగించమని మా ప్రభుత్వం ఉత్తర్వు జారిచేసింది" అన్నాడా ఆఫీసరు.

"మమ్మల్ను ఇక్కడి కూలీలుగానన్నా బ్రతకనివ్వరా?" అడిగాను అరిస్తూ.

"సారీ! మీ ప్రభుత్వ అభీష్టానికి వ్యతిరేకంగా ఏ పనీ చెయ్యడానికి మాకు ఇష్టంలేదు. నువ్వుచేసిన నేరాలకు నువ్వు అక్కడే శిక్ష అనుభవించాలి!"

"పోనీ డెల్లాను నాతో పంపతేరా?"

"దానికి నువ్వు మీ ప్రభుత్వానికి అర్జీ పెట్టుకో!"

"అంతకన్నా మరోదారి ఏదీలేదా? మేము తప్పించుకొని పోయామని చెప్పండి. ఏదో దారి చూసుకుంటాం. మళ్ళీ నాదేశం వెళ్ళి చచ్చేదాక ఖైదీలా బ్రతకడం భయంకరంగా అన్పిస్తూంది" అన్నాను.

"నీకు వేరే దారిలేదు! నిన్నూ, డెల్లానూ, మోసుకొచ్చిన పక్షులగుంపును కూడా రాత్రి కాల్చిపారేశాం!" అన్నాడా ఆఫీసరు.

నా కళ్ళు చెమర్చాయి!

"నువ్వు వెళ్ళి, రాత్రి ప్రయాణానికి సిద్ధంగా వుండు!" అన్నాడు అతను.

"థాంక్స్!" అని వెళ్ళిపోయాను.

సెలు గదిలో కూర్చుని ఆలోచించసాగాను.

నా జీవితం తలుచుకొని నాకే నవ్వొచ్చింది. చదువు ముగించింది మొదలు, నా బ్రతుకంతా ఖైదీలాగే గడిచింది. కొన్నాళ్ళు స్మగ్లర్లకు, మరికొన్నాళ్ళు ప్రకృతికి, ఇంకొన్నాళ్ళు పరిస్థితులకు, ఖైదీనయ్యాను, ఇంక మిగిలిన జీవితం చట్టానికి ఖైదీగా బ్రతకాలి!

రాత్రి విమానం ఎక్కాం. డెల్లా కూడా నాతోనే వుంది. నా ప్రయాణానికి ఏర్పాట్లుచేసిన ఆఫీసరు నన్ను విమానం ఎక్కిస్తూ "మిస్టర్ రాజ్!" అన్నాడు.

"సారీ! నా పేరు మిస్టర్ ఖైదీ!" అన్నాను.

"ఐ. సీ." అంటూ నవ్వి "ఆమె మామూలు మనిషి కాదు! గర్భంతో వుంది. మీరు మీదేశం వెళ్ళగానే ఆమె మీ భార్యని, పెళ్ళి చేసుకొన్నానని, ఇండియాకు పిలిపించ

మని అర్జీ పెట్టుకోండి. తప్పకుండా పిలిపిస్తారు, ఈ పరిస్థితుల్లో'' అన్నాడు.

నవ్వొచ్చింది ఆ మాటలకు.

ఈ ఖైదీ కడుపున పుట్టినవాడు కూడా మరో ఖైదీ అవుతాడా?

'ఏమో? కాలమే నిర్ణయించాలి!' అనుకుంటూ విమానం ఎక్కాను.

విమానం కదిలింది.

ఇండియాలోని ఏదో జైల్లో మిగిలిన జీవితం నిస్సారంగా బ్రతికేందుకు సన్నిద్ధమైన నన్ను వేగంగా మోసుకు పోసాగింది విమానం. నా వొళ్ళో మతిస్థిరం లేని జెల్లా పడుకుని వుంది.

మాది అమరమైన ప్రేమ! నేనెక్కడున్నా నా గుండె నిండా వున్నది, వుండేది జెల్లాయే!

—:సమాప్తం:—

